

# యక్షపర్వతం

కొన్ని వందల సంవత్సరాల క్రిందట నర్మదానది ప్రాంతాన గల అరణ్యాలలో అనేకమైన ఆటవిక జాతి మనుష్యులు నివసిస్తూండే వాళ్ళు. వాళ్ళల్లో ఒక్కొక్క జాతి వాళ్ళకు ఒక నాయకుడో, ఒక రాజో వుండి అందరి మీదా అధికారం చెలాయిస్తూండేవాడు. ఈ జాతుల మధ్య ఐకమత్యం లాంటిది లేకపోగా, తరచు ఒకరిపై ఒకరు యుద్ధాలు చేస్తూండే వారు.

ఇలాంటి ఆటవిక జాతుల్లో ఒకటైన ఖడ్గమృగ జాతి వాళ్ళు, అరణ్యంలో గల కొండల్లో అరణ్యపురం అని ఒక పెద్ద పల్లె నిర్మించుకుని అందులో నివసిస్తూండే వాళ్ళు. ఖడ్గమృగాలను మచ్చిక చేసి వాటిని వ్యవసాయప్పనులకూ, వాహనాలుగానూ ఉపయోగించుకుంటున్నందు వల్ల, ఈ అరణ్యపురంలో వుండే వాళ్ళకు ఖడ్గమృగ జాతి వాళ్ళన్న పేరు కలిగింది.

ఈ ఖడ్గమృగ జాతి వాళ్ళకు కొత్తగా అధికారానికి వచ్చిన అరణ్యమల్లు అనే యువకుడు రాజుగా వుండేవాడు. ఇతణ్ణి అధికారం నుంచి తొలగించేందుకు జాతి వాళ్ళ గణాచారి ఒకడు గట్టి ప్రయత్నాలు చేశాడు. కాని, ఇద్దరు క్షత్రియ యువకుల తోడ్పాటుతో అరణ్యమల్లు, ఆ గణాచారి మోసాన్ని బయట పెట్టించి, ఆతణ్ణి పులికి మేతగా వేశాడు.

గణాచారి దుర్మరణం తరవాత అరణ్యమల్లు పరిపాలన ఎటువంటి ఒడిదుడుకులు లేకుండా సాగిపోతున్నది. పూర్వం కేవలం



వేట మీద ఆధారపడి జీవించే ఖడ్గమృగ జాతివాళ్ళు, యిప్పుడు చుట్టుపక్కల వున్న అరణ్య ప్రాంతాల్లో వ్యవసాయపు పనులు ప్రారంభించి, జొన్నలూ, గోధుమలూ లాంటి ఆహార ధాన్యాలను పండించసాగారు.

అరణ్యమల్లు సింహాసనానికి వచ్చి సంవత్సరం పూర్తయింది. ఆరోజున ఖడ్గ జాతి వాళ్ళంతా మహోత్సాహంతో వార్షికోత్సవం ఏర్పాటు చేశారు. యువకులు ఈటె కత్తులు తిప్పటం, ఖడ్గమృగాలను ఎత్తుగా కట్టిన గడకర్రల మీది నుంచి దూకించటం, మల్ల యుద్ధాలు చేయటం లాంటి బల ప్రదర్శనాలతో స్త్రీ, బాల, వృద్ధు లందరినీ వినోదింప చేస్తున్నారు.

అరణ్యమల్లు ఒక ఎత్తయిన ప్రదేశంలో, నగిషీలు చెక్కిన రాతి సింహాసనంలో కూర్చుని యిదంతా చూసి ఎంతగానో ఆనందపడుతున్నాడు.

అలాంటి ఉత్సాహ సమయంలో ఇద్దరు ఖడ్గజాతి వాళ్ళు తమ వాహనాల మీద ఉరుకులూ పరుగులతో ఆ ప్రదేశానికి వచ్చి, వాహనాలు దిగి అడ్డు వచ్చిన జనాన్ని తోసుకుంటూ అరణ్యమల్లు కేసి పోసాగారు.

అరణ్యమల్లుకు శిలాముఖి అనే మంత్రి వున్నాడు. అతను అరణ్యమల్లు కేసి పోతున్న ఆ యిద్దరినీ చూసి దగ్గిరకు రమ్మన్నట్టుగా సౌంజ్ఞ చేసి, వాళ్ళు రాగానే, "ఏమిటి సంగతి? కొంపలంటుకున్నట్టు అలా పరిగెత్తుతారేం! ఈ ఉత్సాహ సమయంలో రాజుగారితో మీకేం పని? మంత్రిని నేను లేనా." అన్నాడు కోపంగా.

శిలాముఖి యిలా అనగానే ఆ ఇద్దరూ అతడికి నమస్కరించి నిలబడి పోయారు.

"సంగతేమిటో చెప్పండి? ఇంతలోనే మూగవాళ్ళయారా?" అన్నాడు శిలాముఖి.

ఆ ప్రశ్న వింటూనే ఆ వచ్చిన వాళ్ళిద్దరూ ముఖముఖాలు చూసుకున్నారు. వాళ్ళల్లో కొంచెం పెద్దవాడు గొంతు సవరించుకుని, "అయ్యా, కొండ వాగు పక్కన వున్న మన జొన్నచేల మీద ఎవరో కొత్త వాళ్ళు పడి కంకులన్నీ కోసుకుపోతున్నారు.

వాళ్ళు మనం ఎరిగిన అరణ్య జాతుల వాళ్ళలా లేరు. వాళ్ళ నెత్తి మీద పెద్ద పెద్ద తల గుడ్డలున్నవి. శరీరాన్నంతా కప్పుతూ వస్త్రాలు ధరించి వున్నారు. అన్నిటికన్నా వింత, ఈ పరిసరాల్లో ఎక్కడా కనబడని కొత్త రకం జంతువులను వెంట తోలుకు వచ్చారు. వాటి మీదే కోసిన జొన్నకంకులు వేస్తున్నారు," అన్నాడు.

"ఏమిటా కొత్త రకం జంతువులు?" అన్నాడు మంత్రి శిలాముఖి.

"అవి ఏనుగులంత ఎత్తున్నాయి. పుల్లల్లాంటి కాళ్ళు. మెడలు కొంగ మెడల్లా వంకర తిరిగి వున్నాయి. నడుం మీద ఎత్తయిన మూపురం వున్నది." అన్నాడు వచ్చిన వాళ్ళల్లో చిన్నవాడు.



మంత్రి వాళ్ళు యిలా సంభాషిస్తూండగా అదేమిటో వినేందుకు చుట్టూ కొందరు ఖడ్గజాతి వాళ్ళు చేరారు. ఆ వింత జంతువుల వర్ణన వినగానే వాళ్ళల్లో కొందరికి హడలెత్తి పోయింది. వాళ్ళు జనంలోకి పరిగెత్తుతూ, "ఏవో వింత మృగాల మీద వచ్చిన మరొక లోకం వాళ్ళు మన పండిన పంటలు కోసుకు పోతున్నారు." అంటూ కేకలు పెట్టారు.

వినోదాలు చూస్తున్న జనంలో కలకలం బయలుదేరింది. అది చూసి రాజు అరణ్యమల్లు సింహాసనం మీద నుంచి లేచి,

"ఏమిటా గొడవ? ఏం జరిగింది? మంత్రి శిలాముఖి ఎక్కడ?" అన్నాడు బిగ్గరగా.

శిలాముఖి ఆ వింత జంతువులను చూసి వచ్చిన వాళ్ళిద్దర్నీ అరణ్యమల్లు దగ్గిరకు తీసుకుపోయి, వాళ్ళ ద్వారా తాను విన్నదంతా అతడికి చెప్పాడు.

"మనం కష్టపడి పండించిన పంటలు బందిపోట్లు దోచుకు పోతుంటే, వాళ్ళను పట్టుకునేందుకు ఆయుధాలు తీసుకుని బయలుదేరక, వింత జంతువులను గురించి ఆశ్చర్య పడుతున్నారా? పేరుకు నేను రాజును, నా కొక మంత్రి! కాని, మన ప్రవర్తన మాత్రం ఆటవిక మూక ధోరణి లోనే వున్నది. దీనికి ఒక రాజ్యం అన్న



పేరెందుకో తెలియటం లేదు." అన్నాడు అరణ్యమల్లు కోపంగా.

అరణ్యమల్లు యిలా అనగానే శిలాముఖి జనం కేసి తిరిగి. "ప్రస్తుతానికి యీ వినోదాలు కట్టి పెట్టండి. మన పొలాల్లోని పంటల్ని బందిపోట్లు దోచుకు పోతున్నారు. వాళ్ళను హతమార్చి మన పంటల్ని కాపాడుకోవాలి," అన్నాడు పెద్ద గొంతుతో.

ఆ వెంటనే అనేక మంది ఖడ్గజాతి వాళ్ళు ఈటెలూ. కత్తులూ తీసుకుని బయలు దేరారు. కొందరు ఖడ్గమృగాల మీద సవారీ అయారు. ఒక అనుచరుడు తెచ్చిన ఖడ్గమృగాన్ని ఎక్కి మంత్రి శిలాముఖి ముందుగా బయలుదేరాడు.

రాజా అరణ్యమల్లు వాళ్ళను ఉత్సాహ పరుస్తూ, "ఆ బందిపోట్లెక్కి వచ్చిన వింత మృగాలను చూసి భయపడకండి. లోకంలో మనం వాహనాలుగా ఉపయోగించే ఖడ్గ మృగాల కన్న భీతి గొల్పేవి మరెక్కడా లేవు. ఆ బందిపోట్లలో కొందరిని ఖైదీలుగా పట్టుకు రండి. వాళ్ళ ద్వారా ఆ దుర్మార్గుల గుట్టుమట్లు తెలుసుకోవచ్చు," అన్నాడు.

"జై, అరణ్యమాతకూ! జై, అరణ్య మల్లు మహారాజుకూ!" అంటూ ఖడ్గజాతి వాళ్ళు కొండ వాగు కేసి పరుగులు తీశారు.

వాళ్ళు వాగు ప్రాంతాల గల తమ పంట పొలాలను సమీపించేంతలో అక్కడ కని పించిన దృశ్యం అందర్నీ హడలగొట్టింది. బందిపోట్లు పాతికా ముప్పైమంది వున్నారు. వాళ్ళల్లో కొందరు జొన్నకంకులు కోస్తు న్నారు. ఆ కోసిన వాటిని కొందరు వికృతంగా వున్న మృగాల మీద గల పెద్ద సంచుల్లో పెడుతున్నారు. నలుగురైదుగురు బంది పోట్లు పొడవాటి ఈటెలతో చేల చుట్టూ పహరా తిరుగుతున్నట్లు, తమ వాహనాలను అటూ యిటూ పరిగెత్తిస్తున్నారు.

బందిపోట్లనూ. వాళ్ళ వెంట వున్న వికృత మృగాలనూ చూసి ఖడ్గజాతి వాళ్ళే ఎంతగా భయపడ్డారో అంతకన్న మిన్నగా బందిపోట్లు ఖడ్గమృగాల మీద ఎక్కి వున్న వాళ్ళను చూసి భయపడిపోయారు.

బందిపోట్లలో వికృత మృగం మీద ఎక్కి వున్న వాడొకడు తన చేతిలోని ఈటెను పైకెత్తి పెద్దగా, "ఈ వస్తున్న భయంకర జంతువుల్నీ, వాటి మీద ఎక్కి వున్న ఆటవికుల్నీ చూడండి! ఖడ్గమృగాలను మచ్చిక చేసి వాహనాలుగా ఉపయోగించే వాళ్ళు ఎంతటి మహా సాహసులై వుంటారు!" అన్నాడు.

తమ అనుచరుడు చేసిన హెచ్చరిక వింటూనే ఎవరి పనుల్లో వారు మునిగి వున్న బందిపోటు వాళ్ళందరూ తల లెత్తి చూశారు. . వాళ్ళకు ఖడ్గమృగం మీద ముందు వస్తున్న మంత్రి శిలాముఖి, అతడికి కొంచెం వెనకగా వస్తున్న యితర ఖడ్గజాతి వాళ్ళూ కనిపించారు. అందరి కన్న చాలా వెనకగా కాలి నడకన వచ్చిన ఖడ్గజాతి వాళ్ళు దూరంగా నిలబడి భయకంపిత నేత్రాలతో బందిపోట్ల కేసి చూస్తున్నారు.

బందిపోట్ల నాయకుడు గబగబా ఒక వింత జంతువును ఎక్కి, ఖడ్గజాతివాళ్ళ కేసి పరీక్షగా చూశాడు. వాళ్ళ వాలకం చూస్తే తమ మీదికి వచ్చి పడేందుకు తట పటాయిస్తున్నట్టు అతడికి కనిపించింది. ఖడ్గమృగజాతి వాళ్ళల్లో ఒక్కడూ చొరవగా తమ కేసి వాహనాన్ని దూకించటం లేదు.

"ఒరే, ఉష్ట్రవీరుల్లారా! మన కొచ్చిన భయం ఏమీలేదు. ఈ ఖడ్గమృగం వాళ్ళు మనను చూసి బెంబేలు పడిపోతున్నట్టున్నది. చూడండి. ఒక్కడైనా సాహసించి మన మీదికి కదిలా, వేగంగా వస్తున్నా





తేవా! అందరూ బెదురుకుని తటపటా యిస్తున్నారు. ఇదే మంచి అదను. నా వెంట మరి నలుగురైదుగురు రండి. వాళ్ళను చుట్టు ముట్టి ఈటెలు విసిరి చెల్లాచెదురు చేద్దాం," అన్నాడు బందిపోట్ల నాయకుడు.

నాయకుడు చేసిన హెచ్చరిక వింటూనే నలుగురు బందిపోట్లు తమ వాహనాల మీద ఎక్కి, ఈటెలు ఝళిపిస్తూ ఖడ్గజాతి వాళ్ళ కేసి బయలుదేరారు. అది చూస్తూనే మంత్రి శిలాముఖి భయంతో వణికిపోతూ తన అనుచరుల కేసి తల తిప్పి, "ఈ బంది పోట్లు అంత ఎత్తు జంతువుల మీద వుండి మనను తేలిగ్గా తమ ఈటెలతో పొడవ గలరు. మనం వెంటనే వెనుదిరిగి సమీ వంలో వున్న చెట్ల కేసి పోదాం. మనను బందిపోట్లు తప్పక తరుముకుంటూ వస్తారు. అప్పుడు చెట్లకొమ్మల్లో వున్న మన వాళ్ళు, వాళ్ళను తేలిగ్గా ఈటెలతో పొడవవచ్చు. మన వెంట వచ్చిన వాళ్ళను చెట్లెక్క మనండి!" అంటూ పెద్దగా కేక పెట్టాడు.

శిలాముఖి తన అనుచరులకు ఈ హెచ్చ రిక చాలా అలక్ష్యంగా చేశాడు. తమ మంత్రి అన్న మాటలు వింటూనే ఇద్దరు ఖడ్గజాతి వాళ్ళు తాము ఎక్కి వున్న మృగాలను వెనక్కు తిప్పి, "కాలి నడకన వచ్చిన వాళ్ళంతా చెట్లెక్కి. బందిపోట్లు వాటి కిందికి రాగానే ఈటెలతో పొడవండి!" అంటూ కేకలు పెట్టారు.

ఖడ్గజాతివాళ్ళల్లో కొందరు చెట్లెక్క సాగారు. వాళ్ళ ఎత్తుగడ గ్రహించిన బంది పోటు నాయకుడు, "ఒరే, మిత్రులారా! ఆ జొన్నకంకులు కోయటం ఆపి అందరూ వాహనాలెక్కండి. నేనూ, మరికొందరం ఈ ఖడ్గమృగాల మీద వున్న వాళ్ల అంతు చూస్తాం. మిగతా వాళ్ళు ఆ చెట్లెక్కే ముఠాను ఈటెలతో పొడిచి కింద పడ వేయండి," అని హెచ్చరించాడు.

శిలాముఖి తను ఎక్కి వున్న ఖడ్గమృగాన్ని వెనక్కు తిప్పేలోపలే, బందిపోటు నాయ కుడూ, అతడి అనుచరులు కొందరూ వేగంగా వచ్చి, అతణ్ణీ అతడి వెంట వున్న

వాళ్ళనూ చుట్టు ముట్టారు. శిలాముఖి ధైర్యంగా బందిపోటు నాయకుడి ఈటె దెబ్బలను తన ఈటెతో కాచుకుంటూ. "జై అరణ్యమాతా! అందరూ చెట్ల కేసి ఖడ్గమృగాలను పరిగెత్తించండి!" అంటూ అరిచాడు.

ఖడ్గమృగాల మీద వున్న వాళ్ళందరూ ఒక్కసారిగా అరణ్యమాతకూ జై, అంటూ కేకలు వేసి వేగంగా చెట్ల కేసి పరిగెత్తసాగారు. శిలాముఖి వాళ్ళందరి కన్న వెనక పడిపోయినా, ఉపాయంగా బందిపోటు నాయకుడి ఈటె దెబ్బల నుంచి తప్పుకుంటూ, "చెట్ల మీద వున్న వాళ్ళు గురి చూసి బందిపోట్ల గుండెల్లో గుచ్చుకునేట్టు ఈటెలు విసరండి!" అంటూ అరిచాడు.

శిలాముఖి తన ప్రాణరక్షణా ప్రయత్నంలో కిందు మీదైపోతూ, ఇంత సేపూ చెట్ల ప్రాంతాన జరుగుతున్న దేమిటో గమనించలేదు. అక్కడ చెట్లెక్కబోతున్న ఖడ్గజాతి వాళ్ళ మీదికి కొందరు బందిపోట్లు పోయి, వాళ్ళను ఈటెలతో కొట్టసాగారు. గాయపడిన వాళ్ళు కింద పడిపోగా, మిగిలిన ఖడ్గజాతి వాళ్ళు చావు కేకలు పెడుతూ అరణ్యపురం కేసి పరిగెత్తసాగారు.

శిలాముఖి కూడా ఎలాగో ప్రాణరక్షణ చేసుకుంటూ, వెనక తరుముకు వస్తున్న బందిపోట్లకు దొరకకుండా తన అనుచరులతో చెట్ల కేసి పారిపోగలిగాడు. కాని, అక్కడ మరికొందరు బందిపోట్లు తమ వాహనాలతో అతన్ని చుట్టు ముట్ట ప్రయత్నం



చేశారు. పరిస్థితి విషమిస్తున్నదని గ్రహించిన శిలాముఖి. "ఇక మనం ఈ బందిపోట్లను ఎదిరించలేం. అరణ్యపురం కేసి పారిపోవటమే క్షేమం!" అని తన అనుచరులను హెచ్చరించాడు.

ఆ సమయంలో దాపుల నున్న ఒక చెట్టు కొమ్మల్లోంచి, "మహామంత్రి శిలాముఖీ! పారిపోకు. నీ ఖడ్గమృగాన్ని వెనక్కు తిప్పి, దానిచేత నీ వెనక వస్తున్న ఒంటెను కుమ్మించు. నీ ఖడ్గమృగం కొమ్ము వాడి, ఇంద్రుడి వజ్రాయుధం పదునుకు ఏమాత్రం తీసిపోదు!" అన్న మాటలు వినిపించాయి.

శిలాముఖి ఆ మాటలు స్పష్టంగా విన్నాడు. స్వరాన్నిబట్టి ఆ మాట్లాడింది తా నెరిగిన క్షత్రియ యువకుల వెంట వుండే స్వర్ణాచారి అనే వాడిదని కూడా గుర్తించాడు. కాని, అతడిలో నిలబడి బందిపోట్లను ఎదిరించే ధైర్యం పూర్తిగా నీరు కారిపోయింది. ఆ కారణం వల్ల ఖడ్గమృగాన్ని మరి కాస్త గట్టిగా అదిలించి, తన అనుచరుల వెనగ్గా అరణ్యపురం కేసి పారిపోసాగాడు.

శిలాముఖితోపాటు, స్వర్ణాచారి చేసిన హెచ్చరికను బందిపోట్ల నాయకుడు విన్నాడు. అతడు ఎక్కడలేని ఆగ్రహంతో స్వర్ణాచారి ఎక్కి వున్న చెట్టు కిందికి పోయి, "ఎవర్రా అక్కడ? నా శత్రువులకు ఉపాయాలు చెపుతున్నావా? నే నెవర్నో తెలుసా?" అంటూ హుంకరించాడు.

"నా పేరు స్వర్ణాచారి, పద్మపురవాస్తుశాస్త్రజ్ఞుణ్ణి. పుట్టి ఎరిగి జీవి ఒంటెను చూసి, మహా పౌరుష ప్రాణి అయిన ఖడ్గమృగం పారిపోవటం చూసి మెచ్చలేక శిలాముఖికి అలాంటి సలహా యిచ్చాను. నాకు మీ ఒంటెజాతివాళ్ళూ, ఆ ఖడ్గమృగజాతి వాళ్ళూ — అంతా మిత్రులే!" అన్నాడు స్వర్ణాచారి కొమ్మల్లోనే వుండి.

"ఓహోఁ, చాలా అతి తెలివిగా మాట్లాడుతున్నావే! వెంటనే చెట్టు దిగి వస్తావా లేక గురి చూసి ఈటె విసరమంటావా?" అంటూ బందిపోట్ల నాయకుడు ఒంటె మీద లేచి నిలబడి ఈటె పైకెత్తాడు.

—(ఇంకా వుంది)





# యక్షపర్వతం

## 2

[ఖడ్గజాతి వాళ్ళ పంటపొలాలను బందిపోట్లు దోచుకుపోతున్నారని కబురు వచ్చింది. ఖడ్గజాతి వాళ్ళు మంత్రి నాయకత్వాన బందిపోట్లను ఎదిరించబోయారు. ఆ సమయంలో చెట్లకొమ్మల్లో వున్న వాడొకడు వాళ్ళకు ధైర్యం చెప్పబోయాడు. బందిపోట్ల నాయకుడు చెట్టు కిందికిపోయి ఈటె ఎత్తి అతణ్ణి దిగిరమ్మని హెచ్చరించాడు. తరవాత—]

బందిపోట్ల నాయకుడి ముఖలక్షణాలూ, అతడు ఈటె ఎత్తి ఝుళిపిస్తున్న తీరూ చూసి స్వర్ణాచారి తనకు చావు తప్పదనుకున్నాడు. ఖడ్గజాతి వాళ్ళు ఆ చుట్టుపక్కల ఎక్కడా లేరు. వాళ్ళు ప్రాణాలరచేత పెట్టుకుని అరణ్యపురం కేసి పారిపోతున్నారు. ఇప్పుడు తను చెట్టు దిగకపోతే ఎక్కువ ప్రమాదమా? దిగితే ఎక్కువ ప్రమాదమా? అని ఆలోచించసాగాడు స్వర్ణాచారి.

"ఒరే, ఇంతకు ముందు అంత తెలివిగా మాట్లాడినవాడివి, ఇప్పుడు మతిలేని వెధవలాగా తలాడిస్తూ నా కేసి చూస్తావేం? కొమ్మల్లో నుంచి కిందికి దిగి వస్తావా, ఈటె విసరమంటావా?" అన్నాడు బందిపోట్ల నాయకుడు పళ్ళుకొరుకుతూ.

ఆ హెచ్చరికతో స్వర్ణాచారి మరింతగా భయకంపితుడైపోయి, చెట్టు మీది నుంచి కిందికి దిగుతూ. "అయ్యా, అనవసరంగా



నన్ను చంపి పాపం కట్టుకోకండి. ఇంతకు ముందే చెప్పాను గదా, నేను వాస్తుశాస్త్ర జ్ఞాణ్ణి. రాజప్రాసాదం దగ్గిర్నుంచి, పేద రైతు గుడిసె వరకూ ఏ వాస్తు దోషం లేకుండా నిర్మించగలను," అన్నాడు.

ఆ మాటలకు బందిపోట్ల నాయకుడు పెద్దగా నవ్వి, "నువ్వు వాగే వాగుడు కేమైనా సందర్భ శుద్ధి వున్నదా? నేను కొంపా గోడూ కట్టించాలనుకుని, నిన్నెతుకుతూ యీ అరణ్యంలోకి వచ్చాననుకున్నావా? ఛీ, వెధవా, దిగు ముందు!" అన్నాడు.

స్వర్ణాచారి మారు మాటాడకుండా చెట్టు దిగి కింద నిలబడ్డాడు. బందిపోట్ల నాయకుడు ఒంటె మీది నుంచి దిగకుండానే, అతన్ని ఓసారి పరీక్షగా చూసి, "నువ్వు చూడబోతే, ఆ ఖడ్గమృగాల మీద సవారీ చేసే వాళ్ళ జాతి మనిషిలా లేవు. ఇక్కడ ఈ కొండల్లో, అరణ్యాల్లో ఏం చేస్తున్నావు?" అని అడిగాడు.

"అయ్యా, మీ తెలివితేటలు అద్భుతం! నేను ఆ ఖడ్గజాతి వాణ్ణి కాదని మీరు సరిగానే గుర్తించారు. అసలు నాది పద్మపురం. గృహ నిర్మాణ వృత్తిలో బతుకు తెరువు అంత బాగా సాగక, యంత్ర నిర్మాణ రహస్యం కూడా తెలిసిన వాణ్ణి గనక, విశ్వేశ్వరపూజారి అనే ఒక అర్చకుడితో కలిసి మాయ ఏనుగును సృష్టించాను. కాని, ఇద్దరు క్షత్రియ యువకుల కారణంగా ఆ వృత్తిలో గట్టి చావు దెబ్బతిని, పురం వదిలి యీ అరణ్యాలు పట్టాను." అన్నాడు స్వర్ణాచారి.

"ఒరే, నువ్వు ఏదో మహాపురుషుడవని నీ జన్మ వృత్తాంతం అంతా అడుగుతున్నా ననుకుంటున్నావా ఏం, నీ సొంత గొడవంతా నాకు వినిపిస్తున్నావు? నే నడిగింది నువ్వీ ప్రాంతాల ఏం చేస్తున్నావని. ఆ సంగతి చెప్పు చాలు. నీకు తోడుగా ఆదేదో పురం అంటున్నావే — ఆ పురం వాళ్ళెవరైనా యిక్కడ వున్నారా?" అన్నాడు బందిపోట్ల నాయకుడు ఒంటె మీది నుంచి దిగి, ఈటెను స్వర్ణాచారి గుండెల కేసి గురిచేసి.



స్వర్ణాచారి ప్రాణభయంతో గజగజ వణికి పోతూ, "అయ్యా. నన్ను చంపకండి. మిమ్మల్ని విసిగించకుండా అంతా నాలుగు మాటల్లో చెప్పేస్తాను. ఇక్కడికి దగ్గర్లోనే ఒక పర్ణశాల వంటిది నిర్మించుకుని ఇద్దరు క్షత్రియ యువకులు నివసిస్తున్నారు. వాళ్ళకు కొంచెం దూరంలో కొండరాళ్ళతో ఒక కట్టడం కట్టుకుని నేనూ, విఘ్నేశ్వర పూజారీ వుంటున్నాం." అన్నాడు.

క్షత్రియయువకులు అన్నమాట వింటూనే బందిపోట్ల నాయకుడు, స్వర్ణాచారి ముఖం లోకి అనుమానంగా చూశాడు. తరవాత స్వర్ణాచారి చెప్పటం ముగించగానే, "ఈ దగ్గర్లోనే యిద్దరు క్షత్రియ యువకులు పర్ణశాల నిర్మించుకుని వుంటున్నారా? వాళ్ళు తపస్సు లాంటిది చేస్తున్నారా ఏం?" అని అడిగాడు.

"వాళ్ళకు తపస్సు చేయవలసిన ఖర్మేం పట్టింది. ఇద్దరూ యుద్ధ విద్యల్లో ఆరితేరిన వాళ్ళు. అడవిలో వేటాడటం, అవసరం కలిగినప్పుడు దుష్టశిక్షణా, శిష్టరక్షణా చేస్తుండటం వాళ్ళ నిత్యకార్యక్రమం," అన్నాడు స్వర్ణాచారి ఉత్సాహంగా.

"ఓహో, అలాగా!" అంటూ బందిపోటు నాయకుడు అవహేళనగా నవ్వి, "ఇప్పుడు మేం చేసిన పని–ఖడ్గజాతి వాళ్ళు పండిన పంటలు కోసుకు పోవటం దుష్టకార్యమవుతుందా? ఆ క్షత్రియ యువకులకు యీ సంగతి తెలిస్తే ఏమంటారు?" అని అడిగాడు.

బందిపోటు తనం దుష్టకార్యాల్లో పరమ దుష్టకార్యమనీ, ఈ సంగతి వింటే క్షత్రియ యువకులు ఊరుకోరనీ చెప్పాలనిపించింది స్వర్ణాచారికి. కాని, అలా చెప్పటం కోరి గొంతు కోయించుకోవటమే అని గ్రహించి అతడు తడబడే గొంతుతో, "అయ్యా. మీరు చాలా గొప్ప ధర్మసూక్ష్మానికి సంబంధించిన ప్రశ్న అడిగారు. దానికి జవాబిచ్చే అర్హత నాకు లేదు," అన్నాడు.

"బతికి పోయావ్!" అన్నాడు బందిపోట్ల నాయకుడు పెద్దగా ఘనకొడుతూ.



తరవాత ఒక్క క్షణం ఆగి, "ఆ క్షత్రియ యువకులు వుంటున్న పర్ణశాల అన్నావే, అక్కడికి దారి తియ్యి. అంత మంచి వాళ్ళు ఈ అరణ్యంలో ప్రాణాలతో వుండటం మాబోటి వాళ్ళకు క్షేమం కాదు," అన్నాడు.

బందిపోట్ల నాయకుడి ఉద్దేశమేమిటో ఆ మాటల ద్వారా స్వర్ణాచారి గ్రహించాడు. ఆ క్షత్రియ యువకులిద్దరినీ హతమార్చాలని అతను ఆలోచిస్తున్నాడు. ముందుగా ఆ యువకుల్ని హెచ్చరించటం ఎట్లా?

"ఏమిటాలోచిస్తున్నావ్? పారిపోవాలని చూస్తున్నావా? జాగ్రత్త! ఈటెకు గుచ్చి, చెట్టుకు వేలాడ తీస్తాను," అన్నాడు బందిపోట్ల నాయకుడు.

తానిక మాటలతో కాలయాపన చేయటం ప్రాణాపాయకరం అని గుర్తించి, స్వర్ణాచారి తాను చెప్పిన క్షత్రియ యువకులుండే పర్ణశాల కేసి బయలుదేరాడు. బందిపోట్ల నాయకుడు తిరిగి ఒంటె ఎక్కి, తన అనుచరులిద్దరిని వెంట రమ్మని కేక పెట్టాడు.

ముందు స్వర్ణాచారీ, కొంచెం వెనకగా ఆ ముగ్గురు బందిపోట్లూ బయలుదేరి కొద్ది సేపటికల్లా, పర్ణశాల లాంటి ఒక ప్రదేశాన్ని సమీపించారు. పూల మొక్కలూ, ఫల వృక్షాలూ వున్న ఒక ప్రశాంత ప్రదేశం మధ్య ఒక చిన్న కుటీరం వున్నది. ఆ కుటీర ప్రాంతం చుట్టూ కంచె వున్నది. ఆ కంచె బయట ఒక ఆవు పచ్చిక మేస్తున్నది.

స్వర్ణాచారి వెనగ్గా ఒంటె మీద వస్తున్న బందిపోట్ల నాయకుడు ఆవును చూస్తూనే కళ్ళింత చేసి, "ఒరే, ఆచారీ! ఆ ఆవు పాడి ఆవులా కనిపిస్తున్నదే. దూడ ఎక్కడ?" అని అడిగాడు.

"అయ్యా, అది పాడి ఆవే. దూడ ఆ కంచెకు అవతల ఎక్కడో మేస్తూ వుంటుంది." అన్నాడు స్వర్ణాచారి. అతడికి ముందుగా క్షత్రియ యువకులకు శత్రువాడి గురించి ఎలా హెచ్చరించటమా అన్న గడ్డు సమస్య ఎదురయ్యింది. మధ్యలో, యీ బందిపోటు పాడి ఆవుల గురించి ముచ్చట లాడుతున్నాడు.



"అయ్యా, మీ రిక్కడే వుండండి. నేను ముందుగా ఆ కుటీరానికి పోయి క్షత్రియ యువకులున్నారేమో చూసి వస్తాను," అన్నాడు స్వర్ణాచారి ఎంతో అమాయకుడిలా ముఖం పెట్టి.

ఆ మాటలకు బందిపోట్ల నాయకుడు చిన్నగా నవ్వి, "ఒరే, నీ గుంటనక్క ఎత్తులు నా దగ్గిర చెల్లవు. సింధు ఎడారుల నుంచి ఈ అరణ్యాలూ, కొండలూ చేరే లోపల నీ లాటి వాళ్ళను చాలా మందిని చూశాను. నువ్వు కంచె దగ్గిరే వుండి, ఆ క్షత్రియ యువకులు వినేలా, 'దూర దేశం నుంచి అతిథులు వచ్చారు!' అని కేక పెట్టు; తెలిసిందా!" అన్నాడు.

బందిపోట్ల నాయకుడి ఎత్తుగడ ఏమిటో స్వర్ణాచారికి అర్థమైంది. తను అతిథు లొచ్చారని కేక పెట్టగానే, యువకులిద్దరూ నిరాయుధులుగా కుటీరం నుంచి బయటికి వస్తారు. అప్పుడు వాళ్ళను హతమార్చ వచ్చునని బందిపోటు ఆలోచిస్తున్నాడు. కాని, తాను వాడు చెప్పినట్టు కేక వేయక పోతే ఆపదలో చిక్కుకోవలసి వస్తుంది. ఏమిటి దారి ?

"ఊఁ, కేక పెట్టి పిలువు. ఏమిటి అంతగా తటపటాయిస్తున్నావు?" అంటూ బందిపోట్ల నాయకుడు ఈటెను స్వర్ణాచారి వీపుకు గట్టిగా ఆనించాడు.

స్వర్ణాచారి పెద్దగా గొంతెత్తి, "ఒంటెల మీద దూర దేశం నుంచి అతిథులు ఎత్తి వచ్చారు!" అని కేక పెట్టాడు. తరవాత రెండు మూడు క్షణాల కాలం జరిగినా కుటీరంలో నుంచి ఎవరూ బయటికి రాలేదు.

"అయ్యా, క్షత్రియ యువకులు వేటకు వెళ్ళినట్టుంది!" అన్నాడు స్వర్ణాచారి, ప్రమాదం తొలిగిపోయిందని సంతోషపడుతూ.

"అనుమానం ఎందుకు, మరోసారి కేక వెయ్యి, చూద్దాం!" అన్నాడు బందిపోట్ల నాయకుడు.

స్వర్ణాచారి యీసారి మరింత బిగ్గరగా కేక పెట్టాడు. కుటీరంలో నుంచి ఎవరూ బయటికి రాలేదు. బందిపోట్ల నాయకుడు



ఒంటె మీదినుంచి దిగి, తన అనుచరుడొకణ్ణి స్వర్ణాచారి పారిపోకుండా కాపలా వుండమని చెప్పి, రెండవ వాణ్ణి వెంటబెట్టుకుని, కంచె దాటి కుటీరం ముందుకు వెళ్ళాడు.

కుటీర ద్వారానికి అడ్డంగా వున్న వెదురు తడికె తాడుతో ఒక మేకుకు బయట గట్టిగా బంధించబడి వున్నది. దాన్ని చూస్తూనే బందిపోట్ల నాయకుడు, తన పక్కన వున్న వాడితో, "ఆ ఆచారి చెప్పిందే నిజం. ఆ క్షత్రియు లిద్దరూ ఇంటలేరు. మనం లోపలికి పోయి చూద్దాం, పనికొచ్చే విలువైన వస్తువులేమైనా దొరకవచ్చు!" అన్నాడు.

బందిపోట్లిద్దరూ ద్వారానికి బిగించి వున్న వెదురు తడికెను వెనక్కు తోసి కుటీరం లోపలికి వెళ్ళారు. లోపల వాళ్ళకు దోచుకునేందుకు విలువైన వస్తువు లేవీ కనిపించలేదు. గోడల నుంచి పులి, ఎలుగా, జింకా లాంటి మృగాల చర్మాలు వేలాడు తున్నవి. గోడకు ఒక మూలగా రెండు ఈటెలూ, కొన్ని విల్లంబులూ ఆనించి వున్నవి. కొక్కెం నుంచి రెండు ధనుస్సులు వేలాడుతున్నవి.

"వీళ్ళెవరో కాని మంచి విలుకాళ్ళలా వున్నారు. దూరం నుంచే శత్రువునుగాని, అడవి మృగాన్నిగాని కొట్టేందుకు బాణం కన్న గొప్ప ఆయుధం మరొకటిలేదు. మనం విలువిద్య కూడా కొంత నేర్చుకుని వుండటం మంచిది. ఆ విల్లంబులు తీసుకో!" అని హెచ్చరించాడు బందిపోట్ల నాయకుడు తన అనుచరుణ్ణి.

నాయకుడు యిలా హెచ్చరించగానే బందిపోటు ముందుకు పోయి అక్కడ వున్న రెండు ధనుస్సులనూ, అంబులనూ తీసుకుని కట్టగా కట్టి, భుజాన పెట్టు కున్నాడు. బందిపోటు నాయకుడు కుటీరం లోని అన్ని మూలలకూ పోయి బాగా వెతికి, అక్కడ విలువైన వస్తువు లేవీ కనబడక పోవటంతో నిరుత్సాహ పడిపోయి, తల వంచుకుని కుటీరం బయటికి వచ్చేశాడు.

"ఆచారీ! నువ్వు చెప్పే ఆ క్షత్రియ యువకులు ఆహారధాన్యాలు కూడా కుటి



రంలో ఎక్కడా దాచినట్టు లేదే! పులి చర్మాలూ, జింక చర్మాలూ తప్ప అఖరికి ఏనుగుల దంతాలైనా ఎక్కడా కనిపించ లేదు. వాళ్ళు అడవి ఏనుగులను వేటాడరా?'' అన్నాడు బందిపోటు నాయకుడు.

''అయ్యా, ఆ క్షత్రియ యువకులు ఆహారం కోసం తప్ప ఏ అడవి జంతువునూ చంపరు. మీరు చూసిన పులిచర్మాలు, వాళ్ళు ఆత్మరక్షణ కోసం చంపిన పులులవి,'' అన్నాడు స్వర్ణాచారి.

''ఓహో, వాళ్ళకు ఏనుగు దంతం విలువ కూడా తెలియదన్నమాట!'' అన్నాడు బందిపోట్ల నాయకుడు యీసడిస్తున్నట్టు.

తరవాత అతడు ఆ దాపుల మేస్తున్న ఆవును తన అనుచరులకు చూపుతూ, ''ఒంటెపాలు తాగి తాగి ముఖం మొత్తుతున్నది. ఈ ఆవు మెడకు తాడు బిగించి వెంట లాక్కురండి. దాని దూడ ఎక్కడ?'' అంటూ చుట్టూ కలియచూడసాగాడు.

ఒక బందిపోటు ఆవు దగ్గిరకు పోయి దాని మెడకు తాడు తగిలించి ఒంటె కేసి లాక్కుపోసాగాడు. ఆవు మెడ గింజుకుంటూ పెద్దగా అరిచింది. ఆ అరుపు వింటూనే కుటీరం వెనక నుంచి దాని దూడ పరిగెత్తుతు వచ్చింది.

''ఈ ఆచారిని కూడా ఒంటె మీద ఎక్కించండి,'' అన్నాడు బందిపోట్ల నాయకుడు.

ఆ మాట వింటూనే స్వర్ణాచారి గడగడ లాడిపోతూ, ''అయ్యా, నన్ను మీ వెంట తీసుకుపోకండి. నా కిక్కడే హాయిగా వున్నది. నా బతుకు యిక్కడే వెళ్ళబుచ్చుతాను,'' అన్నాడు.

''అదేం కుదరదు. మేం ప్రస్తుతం వుంటున్న కొండ చరియ ప్రాంతాల వాస్తు శాస్త్రం తెలిసిన వాడివి గనక, నువ్వు చక్కని గృహాలు నిర్మించాలి. కొద్ది కాలంలోనే మేమీ చుట్టుపక్కల నూరామడల వరకూ ఆక్రమించుకుని, అధికారం చెలాయించ బోతున్నాం. అప్పుడు నువ్వు గృహాలు నిర్మించబోయే చోటు రాజధానీ నగరం అవుతుంది. నిన్ను తప్పక ఆస్థాన వాస్తు

శాస్త్రజ్ఞుణ్ణి చేసి గౌరవిస్తాను." అన్నాడు బందిపోట్ల నాయకుడు.

"అయ్యా, నాకలాంటి పదవులేమీ వద్దు. నన్నిక్కడే సుఖంగా...."

స్వర్ణాచారి మాట పూర్తి చేసే లోపలే బందిపోటొకడు అతడి గొంతు పట్టుకుని ఎత్తి ఒంటె మీద పడవేశాడు. స్వర్ణాచారి అక్కడ లేచి నిలబడి, "రక్షించండి! రక్షించండి!" అంటూ అరవసాగాడు.

స్వర్ణాచారి కేకలు ఆ కుటీర ప్రాంతానికి వస్తున్న అతడి మిత్రుడు విఘ్నేశ్వర పూజారి అనేవాడు విన్నాడు. అతడు స్వర్ణాచారికేదో ప్రమాదం సంభవించిందని గ్రహించి త్వర త్వరగా కుటీరాన్ని సమీపించాడు. అతడి దృష్టికి ఒంటెల మీద వున్న బందిపోట్లూ, స్వర్ణాచారీ, బందిపోట్లలో ఒకడు లాక్కు పోతున్న పాడి ఆవూ కనిపించాయి.

విఘ్నేశ్వర పూజారికి మెరుపులా ఒక ఆలోచన వచ్చింది. కుటీరంలో నివసించే క్షత్రియ యువకులు ఒక సింహాన్ని, పిల్లగా వున్నప్పుడే పట్టుకు వచ్చి, పెంచుతున్నారు. అది ఆ యువకులు కుటీరం దగ్గిర వున్న సమయాల్లో స్వేచ్ఛగా ఆ చుట్టు పక్కల తిరుగుతూ వుంటుంది. వాళ్ళు కుటీరంలో లేనప్పుడు దాన్ని కుటీరం వెనక వున్న కర్రల బోనులో వదిలి పోతూంటారు.

ఇప్పుడు విఘ్నేశ్వరపూజారికి ఆ సింహాన్ని బోనులో నుంచి వదలటం వల్ల స్వర్ణాచారినీ, పాడి ఆవునూ రక్షించవచ్చునన్న ఆలోచన కలిగింది. పాడి ఆవుకూ, సింహానికీ చాలా స్నేహం. ఆవు అరుపులు సింహాన్ని రెచ్చ గొట్టి, దానికి బందిపోట్ల మీదికి దూకేలా కోపం తెప్పించవచ్చు....

విఘ్నేశ్వరపూజారి పరుగు పరుగున పోయి బోనులోంచి సింహాన్ని బయటికి వదిలాడు. అది బయటికి వస్తూనే పెద్దగా గర్జించి, బందిపోట్ల కేసి వేగంగా దూకుతూ పరిగెత్తింది. దాన్ని చూస్తూనే ఒంటెలు బెదిరాయి. ఒక బందిపోటు పట్టుతప్పి ఒంటె మీది నుంచి కింద పడిపోయాడు. సింహం చెంగున ఎగిరి వాడి మీద పడి, గొంతు పట్టుకున్నది. --(ఇంకా వుంది.)





# యక్షపర్వతం

## 3

[బందిపోట్లనాయకుడు స్వర్ణాచారి అనే వాణ్ణొకణ్ణి పట్టుకుని, అతని ద్వారా అరణ్యంలోని ఒక కుటీరంలో నివసిస్తున్న ఇద్దరు క్షత్రియయువకుల్ని గురించి తెలుసుకున్నాడు. ఆ సమయంలో విశ్వేశ్వరపూజారి అనేవాడు బందిపోట్ల పైకి పెంపుడు సింహాన్ని ఉసి కొల్పాడు. అది బందిపోట్లలో ఒకడి మీదపడి, గట్టిగా గొంతుపట్టుకున్నది. తరవాత—]

హఠాత్తుగా గర్జిస్తూ వెనక వస్తున్న తన అనుచరుడి మీద పడిన సింహాన్ని చూస్తూనే బందిపోట్లనాయకుడు అదిరిపడ్డాడు. అతడు ఒక్క క్షణం ఏమిచేయటమా అని ఆలోచించి, చప్పున ఈటెను పైకెత్తి, సింహాని కేసి బలంగా విసిరాడు. ఈటె పోయి సింహానికి ఒక అడుగు దూరంలో నేలకు తగిలి, నిలువుగా గుచ్చుకుపోయింది. సింహం మాత్రం బందిపోటును గొంతు పట్టుకుని అటూ యిటూ విదిలిస్తూ నేల మీద పొర్లించటం మానలేదు.

బందిపోట్లనాయకుడు చుట్టూ ఓసారి కలయ చూశాడు. సింహం పట్టులో చిక్కిన బందిపోటువాడి ఒంటె బెదిరి క్షత్రియ యువకుల కుటీరం వెనక వున్న చెట్ల కేసి పారిపోయింది. మరొక అనుచరుడున్న ఒంటె మీది నుంచి స్వర్ణాచారి రక్షించండి, అంటూ గట్టిగా కేకలు పెడుతున్నాడు.



బందిపోట్లనాయకుడికి యిక తాను తన అనుచరుణ్ణి సింహం బారి నుంచి కాపాడ లేనని తెలిసిపోయింది. సింహం నోట చిక్కిన ఆ బందిపోటు రెండు మూడుసార్లు పెద్దగా అరిచి వూరుకున్నాడు. ఇప్పుడు సింహం వాణ్ణి దూరంగా విదిలించి పార వేసి, వెనక కాళ్ళ మీద కూర్చుని చిన్నగా గర్జిస్తూ బందిపోట్ల నాయకుడి కేసీ, ముందున్న బందిపోటు లాక్కుపోతున్న పాడిఆవు కేసీ చూడసాగింది.

ఈసారి సింహం తన మీదో లేక తన అనుచరుడి మీదో తప్పక దూకుతుందని బందిపోట్లనాయకుడు భయపడ్డాడు. అది ముఖ్యంగా ఆహారం కోసం ఆవును పట్టుకోవాలని చూస్తున్నదని అతడు పొరబడ్డాడు. ఆవును వదిలి వేస్తే తమకు సింహాన్నుంచి ఎలాంటి ప్రమాదమూ రాకపోవచ్చు....

బందిపోట్లనాయకుడు యిలా అనుకుని తన అనుచరుడితో, "ఒరే, ఉష్ట్రవైధవా! నీ తెలివి తక్కువ తనం వల్లనే మనవాళ్ళొకరు చచ్చారు. సింహగర్జన వింటూనే నువ్వు ఆవును వదిలివేస్తే యీ ప్రమాదం సంభవించేది కాదు. సింహం ఆవును తరుముకుంటూ అరణ్యంలోకి పోయేది; ఇప్పటికైనా బుద్ధిగా ఆవును వదిలి పెట్టు," అని, కేకలు పెడుతున్న స్వర్ణాచారి కేసి రౌద్రంగా చూస్తూ, "ఒరే, వాస్తుపతీ! ఇకనైనా నోరుమూసుకుని మా వెంటవస్తావా, లేకపోతే ఒంటె మీది నుంచి కిందికి పడదోసి సింహానికి మేతగా వెయ్యమంటావా?" అన్నాడు.

ఈ ప్రశ్న స్వర్ణాచారికి ఎంతో సంతోషాన్ని కలిగించింది. క్షత్రియ యువకుల పెంపుడు సింహం తనకు బాగా మాలిమి అయినదే. అది తనను ఏమీ చేయదు. ఆ కారణంగా అతడు లేని భయాన్ని నటిస్తూ, "ఉష్ట్రనాయకా! నన్ను సింహానికి మేతగా వెయ్యండి. ఆ విధంగానైనా జన్మభూమిలోనే మరణిస్తాను. జన్మభూమి కన్న ప్రియమైన వస్తువు మరేం వున్నది!" అన్నాడు.

బందిపోటునాయకుడికి ఓ క్షణకాలం స్వర్ణాచారిని ఒంటె మీది నుంచి కింద పడవేయటమే మంచిదనిపించింది. కాని, అతడికి మరుక్షణంలో తాను కొండచరియ ప్రాంతాల కట్టనున్న రాజధాని నగరం మాట గుర్తు కొచ్చింది. ఆ కారణంగా అతడు తన అనుచరుడితో, "ఒరే, ఆ వాస్తువేత్తని యిక్కడ సింహానికి ఆహారంగా వదలకు. మనం నిర్మించబోయే కొండకోట పట్టణానికి వాడి సాయం కావలిసి వస్తుంది. అక్కడ వాడు అంతగా మన మాట వినకపోతే, అప్పుడు ముక్కలు ముక్కలుగా నరికి ఏ తోడేళ్ళ పొట్టలో నింపుదాం," అన్నాడు.



ఈ మాటలతో స్వర్ణాచారికి నిజంగానే చావు భయం కలిగింది. అతడు సింహాని కేసి తిరిగి, "భీమా! భీమా!" అంటూ పెద్దగా కేక పెట్టి, "రక్షించండి! రక్షించండి!" అంటూ అరవసాగాడు.

పెంపుడు సింహం పేరు భీముడు. అది తన పేరు చెవుల పడగానే గర్జిస్తూ లేచి, ఒకసారి జూలు విదిలించుకుని స్వర్ణాచారి వున్న ఒంటె కేసి దూకింది. కాని, యీలోపలే రామన్న ప్రమాదాన్ని గుర్తించిన బందిపోటు ఆవు మెడకు వున్న తాడును చప్పున వదిలి, ఒంటెను గట్టిగా అదిలించాడు. ఒంటె జొన్నపొలాల కేసి పరుగు లంకించుకున్నది. దాని వెనకగా బందిపోటునాయకుడు కూడా తన ఒంటెను వేగంగా పరిగెత్తించాడు.

ఈ జరిగినదంతా విఘ్నేశ్వర పూజారి కుటీరం వెనక వుండి చూస్తూనే వున్నాడు. ఎంతో కాలంగా తనకు మిత్రుడుగా వుంటూ కష్టసుఖాల్లో తనను వదలని స్వర్ణాచారి బందిపోట్లకు బందీ అయి పోవటం అతడికి ఎంతో బాధ కలిగించింది. సమయానికి క్షత్రియ యువకులు కుటీరంలో వున్నట్టయితే, యీ విపత్తు కలిగి వుండేది కాదు.

విఘ్నేశ్వరపూజారి యింతగా అనుకునే ఆ క్షత్రియ యువకులిద్దరూ ఆ సమయంలో అరణ్యంలో వేట ముగించి తమ కుటీరాల వైపుకే బయలుదేరి వస్తున్నారు. ఆ రోజున



వాళ్ళకు వేట బాగా సాగింది. ఒక యువకుడి భుజాన్నుంచి లేడి ఒకటి వేళ్ళాడుతున్నది. రెండవ యువకుడి భుజం మీద రెండు అడవికోళ్ళూ, చేతిలో నాలుగు కుందేళ్ళూ వున్నవి. వాళ్ళు నిశ్చింతగా కబుర్లాడుకుంటూ నడుస్తున్నారు.

ఆ యువకులిద్దరూ తమ కుటీరానికి కూతవేటు దూరంలో వుండగా పెంపుడు సింహం చిన్నగా గర్జిస్తూ వాళ్ళ దగ్గరకు వచ్చి, గిరికీలు తిరుగుతూ, యువకుల్లో ఒకడి కాళ్ళను చుట్టుకోసాగింది. సింహాన్ని చూసి ఆ యువకులు పొందిన ఆశ్చర్యం అంతా యింతా కాదు. తాము వేటకు బయలుదేరేటప్పుడు దాన్ని బోనులో పెట్టటం జరిగింది కదా! మరి అది బోనులో నుంచి ఎలా బయట పడింది? కర్మం కాలి సింహం ఎవరికైనా ప్రాణహాని కలిగించలేదుగదా!

యువకులు యిలాంటి అనుమానాలతో ఒకరి ముఖం కేసి ఒకరు ప్రశ్నార్థకంగా చూసుకునేంతలో విఘ్నేశ్వర పూజారి చెట్ల వెనక నుంచి వాళ్ళ ముందుకు పరిగెత్తుకుంటూ వస్తూ, "మహా యోధుల్లారా, ఖడ్గ జీవదత్తుల్లారా! పుట్టిమునిగింది, కొంప లంటుకున్నై, సర్వనాశనం జరిగిపోయింది!" అన్నాడు.

ఆ మాటలకు క్షత్రియయువకు లిద్దరూ ఓ క్షణకాలం నివ్వెరపోయారు. వాళ్ళల్లో ఒకడు పూజారి కేసి నిశితంగా చూస్తూ, "ఏమిటా సర్వనాశనం? నువ్వూ, మేమూ, చుట్టూ వున్న అరణ్యం పచ్చగా కళకళలాడుతూ బతికే వున్నాంగదా! మరి ఆ జరిగిపోయిన సర్వనాశనం ఏ ప్రాంతాల? మాకు ఆశ్చర్యం కలిగిస్తున్నదల్లా, యీ భీముడు బోనులో నుంచి ఎలా బయట పడగలిగాడా అన్నదే!" అని సింహం జూలు పట్టుకుని వేళ్ళతో దువ్వసాగాడు.

విఘ్నేశ్వరపూజారి ఆ క్షత్రియ యువకు లిద్దరికీ అంతకు ముందు కుటీరం ప్రాంతాల జరిగిన భీభత్సం సంగతి గబగబా చెప్పి, "ఖడ్గ జీవదత్తుల్లారా! ఇక్కడ కాలయాపన చేయటం దేనికి? త్వరగా కుటీరం దగ్గరకు

రంది. అక్కడ భీముడి పంజా దెబ్బలకు చచ్చిన బందిపోటు శవాన్ని కూడా మీరు చూడవచ్చు. ఆ మహా విఘ్నేశ్వరుడి కృప వల్ల పాడిగేవు, గోవత్సం మాత్రం మనకు దక్కాయి," అన్నాడు.

పూజారి చెప్పినదంతా విన్న ఖడ్గ జీవదత్తులకు ఆశ్చర్యంతో పాటు, ఎక్కడ లేని కోపావేశం కూడా కలిగింది. తాము వుంటున్న మహారణ్యంలో ఆదిమవాసులైన అనేక తెగల మానవులు నివసిస్తున్నారని మాత్రమే యింత వరకూ వాళ్ళకు తెలుసు. ఒంటెలను యీనాటి వరకూ వాళ్లా ప్రాంతాల చూసి ఎరగరు. అలాంటి పరిస్థితుల్లో ఒంటెల మీద వచ్చిన బందిపోట్లు తమ కుటీరంలో జొరపడటమేగాక, తమకు అతిథి సమానుడైన స్వర్ణాచారిని బలవంతంగా ఎత్తుకు పోవటం వాళ్ళకు ఎక్కడ లేని కోపాన్ని తెప్పించింది.

"జీవా, యిక మనం యిక్కడ కాలయాపన చేయకూడదు. ఆ బందిపోట్లు వెళ్ళిన మార్గం ఏదో పూజారి మనకు చెప్పాడు గదా. మనం వెంటనే బయలుదేరి పోయి స్వర్ణాచారిని వాళ్ళ బారి నుంచి విడిపించి, ఆ దుర్మార్గుల్ని నరికి పోగులు పేద్దాం," అంటూ ఖడ్గవర్మ కత్తి దూశాడు.

జీవదత్తుడు తన మిత్రుడి భుజం మీద చెయి వేసి, "ఖడ్గా, ముందు వెనుకలు



చూడకుండా శత్రువుల కేసి దుముకటం ప్రమాద కారణం అవుతుంది. ఆ శత్రువుల సంఖ్య ఎంత? వాళ్ళు మన కుటీరం కేసి పనిగట్టుకు రావడం వెనక ఏదైనా రహస్యం వున్నదా? ఇవన్నీ సావధానంగా ఆలోచించాలి. పైగా ఎక్కడో ఎడారుల్లో మాత్రమే వాహనాలుగా ఉపయోగించే ఒంటెలను, ఆ దుర్మార్గులు యీ అరణ్యంలోకి ఎందుకు తెచ్చారు?... సరే, ముందు కుటీరంలో నుంచి వాళ్ళు ఏమేమి ఎత్తుకుపోయారో వెళ్ళి చూద్దాం," అన్నాడు.

ఖడ్గ జీవదత్తులు కుటీరం ముందుకు వెళ్ళేంతలో, వెనక వస్తున్న విఘ్నేశ్వర పూజారి వాళ్ళను ఆపి, "యోధుల్లారా!



ఇదిగో యీ పొద పక్కన నేల వాలి వున్న శత్రుశవాన్ని తిలకించండి! భీముడి పంజా దెబ్బకు వీడు వీరస్వర్గం అలంకరించాడు,'' అన్నాడు.

ఖడ్గ జీవదత్తులు బందిపోటు శవం వున్న చోటుకు పోయారు. ఖడ్గవర్మ కాలితో శవాన్ని అటూ యిటూ కదిలించాడు. జీవదత్తుడు శవం కేసి పరీక్షగా చూసి, "వీడు అడవిజాతి వాడు కాదు. దుస్తుల తీరూ, ముఖ లక్షణాలూ చూస్తూంటే, ఎక్కడో దూర ప్రాంతం నుంచి యీ అరణ్యాల్లోకి వచ్చినట్టుంది," అన్నాడు.

"వీడు కాస్త ప్రాణంతో వున్నట్టయితే, ప్రశ్నించి అన్ని రహస్యాలూ బయటికి లాగే వని. పాపం, భీముడి కేం తెలుసు! కోపం కొద్దీ పంజా దెబ్బలతో పాటు, వాడి కోరలతో గొంతు కూడా పట్టుకున్నది.'' అన్నాడు ఖడ్గవర్మ.

తరవాత యువకులిద్దరూ కుటీరంలోకి వెళ్ళారు. అక్కడ చాలా వస్తువులు చెల్లా చెదురుగా కింద పడవేసి వున్నవి. గోడకు వేళ్ళాడుతూ వుండవలసిన రెండు ధనుస్సులూ, ఒక మూలగా పెట్టివుంచిన అంబులూ వాళ్ళకు కనిపించలేదు.

"ఈ బందిపోట్లకు మన కుటీరంలో కనిపించిన విలువగల వస్తువులు ధనుస్సులూ, అంబులూ అన్న మాట! వీళ్ళను వదల రాదు, వేటాడి తరమవలసిందే! వాళ్ళు ఎటు నుంచి వచ్చారో, ఎటు పోయారో ఖడ్గజాతి వాళ్ళల్లో కొందరైనా తప్పక చూసే వుంటారు," అని జీవదత్తుడు, పూజారితో, "విఘ్నేశ్వర పూజారీ! నువ్వు కొంచెం వెళ్ళి యీ చుట్టుపక్కల ఎవరైనా ఖడ్గజాతి వారు కనిపిస్తే, వెంటనే వాళ్ళ యిక్కడికి తీసుకురా!" అన్నాడు.

విఘ్నేశ్వర పూజారి కుటీరం నుంచి బయటికి వచ్చేసరికి, ఆ పరిసరాల్లో వున్న మోకాళ్ళ ఎత్తు కంచె పక్కగా ఖడ్గజాతి వాళ్ళ నాయకుడు అరణ్యమల్లూ, అతడి అనుచరులు కొందరూ రణగొణ ధ్వనిగా మాట్లాడుకుంటూ రావటం అతడికి కని

పించింది. వెంటనే విఘ్నేశ్వర పూజారి వాళ్ళ కేసి గబగబాపోయి, "క్షత్రియ యువకులు వేట నుంచి యిప్పుడే తిరిగి వచ్చారు. ఒంటెల మీద వచ్చిన బందిపోట్లను మీలో ఎవరైనా చూశారా? వాళ్ళు నా ప్రాణమిత్రుడైన స్వర్ణాచారిని ఎత్తుకు పోయారు," అన్నాడు.

ఆ మాటలకు అరణ్యమల్లు చిన్నబుచ్చుకుని, "పూజారీ, మేం ఆ బందిపోట్లను చూడటం ఏమిటి? వాళ్ళు మా పంట పొలాలను దోచుకు పోతూండగా ఎదిరించి, వాళ్ళ ధాటికి తట్టుకోలేక పారిపోయాం కూడా. స్వర్ణాచారి వాళ్ళ వెంట జంతువుల్లో ఒక దాని మీద వుండటం నా అనుచరుల్లో కొందరు చూశారు. ఖడ్గజీవదత్తు ప్రభువులు సమయానికి యిక్కడ వున్నట్టయితే, ఆ దుర్మార్గుల్లో ఒక్కడు కూడా ప్రాణాలతో పోగలిగేవాడు కాదు," అన్నాడు.

బయట రేగిన కలకలం విని ఖడ్గ జీవదత్తులు కుటీరం నుంచి వెలుపలికి వచ్చారు. అరణ్యమల్లు వాళ్ళ దగ్గరకు పోయి, "ఖడ్గ జీవదత్త ప్రభువుల్లారా! మహా విపత్తు జరిగి పోయింది. మా పంట పొలాలను బందిపోట్లు దోచుకు పోయారు. ఓటమి ఎరుగని మా ఖడ్గమృగజాతి వీరులు, వాళ్ళ ధాటికి నిలబడలేక అరణ్యపురానికి పారిపోయి వచ్చారు," అన్నాడు.

అరణ్యమల్లు యిలా అనగానే ఖడ్గ జీవదత్తులకు ఆ వచ్చిన ఒంటెల వాళ్ళు కేవలం బందిపోటు వృత్తి మీద బతికే రకం మనుష



లని అర్థమైపోయింది. కాని, వాళ్ళు ఖడ్గ మృగాల మీద వున్న ఆటవికుల్ని ఎదిరించి ధైర్యంగా నిలబడటమే గాక, వాళ్ళను తేలిగ్గా ఓడించి పారదోలగలగటం వాళ్ళకు చాలా ఆశ్చర్యాన్ని కలిగించింది.

"రాజువైన నువ్వూ, ఆ బందిపోట్లకు వెన్నిచ్చి పారిపోయావా? నీ పిరికితనం చూసి నీ అనుచరు లేమనుకుంటారు?" అన్నాడు ఖడ్గవర్మ కోపంగా.

"అయ్యో, ఆ పారిపోయింది నేను. రాజుగారు ఆ బందిపోట్ల కేసే రాలేదు," అంటూ మంత్రి శిలాముఖి ఖడ్గ జీవదత్తుల ముందుకు వచ్చాడు.

"అలాగా! వాళ్ళు మనం ఎరగని కొత్త ఆయుధాలేమైనా మీ మీద ప్రయోగించారా? లేక ఆ ఒంటెల్ని చూసి మీ ఖడ్గమృగాలు బెదిరి పారిపోయాయా?" అని అడిగాడు జీవదత్తుడు.

శిలాముఖి కొండవాగు దగ్గిర జరిగిన దంతా చెప్పి, "ఆ బందిపోట్ల దగ్గిర కత్తులూ, ఈటెలూ తప్ప మరేం లేవు. కాని, ఒంటె అని మీరు చెప్పే ఆ వింత జంతువును చూసి మా వాళ్ళు ఎందుకనో చాలా భయపడిపోయారు. లోగడ ఆ ఒంటెను మా వాళ్ళు చూసి వుండలేదు," అన్నాడు.

"సరే, జరిగిందేదో జరిగిపోయింది. మేం స్వర్ణాచారిని వాళ్ళ నుంచి విడిపించుకు రావాలి. అంతేకాక ఆ దుర్మార్గులు మరే నాడూ యిటు రాకుండా తగిన శిక్ష విధించాలి. కనక మీలో కొందరు బయలుదేరి, వాళ్ళు పోయిన దారి గుర్తులు తెలుసుకుని రండి! మేం యిద్దరం సూర్యాస్తమయానికి యింకా రెండు మూడు గంటల కాలం వున్నదనగా బయలుదేరి పోతాం," అన్నాడు జీవదత్తుడు.

జీవదత్తుడు మాట పూర్తి చేసేలోపలే అరణ్యమల్లు తన అనుచరులలో నలుగురిని దగ్గిరకు పిలిచి బందిపోట్లు పోయిన మార్గం తెలుసుకుని రమ్మని ఆజ్ఞాపించాడు. ఆ వెంటనే ఆ నలుగురూ ఖడ్గమృగాలను ఎక్కి కొండవాగు కేసి బయలుదేరారు.

—(ఇంకా వుంది)





# యక్షపర్వతం

## 4

[అరణ్యంలో వేటాడబోయిన ఖడ్గ జీవదత్తులనే క్షత్రియయువకులిద్దరూ తమ కుటీరానికి తిరిగి వచ్చి, విశ్వేశ్వరపూజారి ద్వారా బందిపోట్లు చేసిన దుష్కార్యాల సంగతి విన్నారు. వాళ్ళు ఏటు వైపుకు పోయారో తెలుసుకుని వచ్చేందుకు నలుగురు ఖడ్గజాతివాళ్ళను, వాళ్ళ రాజైన అరణ్యమల్లు అరణ్యం కేసి పంపాడు. తరవాత—]

ఖడ్గజాతివాళ్ళు నలుగురూ తిరిగి వచ్చే లోపల వంట ముగించి, భోజనాలు చేసి ప్రయాణానికి సిద్ధంగా వుండటం మంచిదనుకుని ఖడ్గ జీవదత్తులు వంటపనుల్లో నిమగ్నులయారు. రాజు అరణ్యమల్లూ, అతడి అనుచరులూ కుటీరం ముందు బందిపోట్లను గురించి మాట్లాడుకోసాగారు.

"ఈ బందిపోట్లను పూర్తిగా తుడిచి పెట్టందే మనకు రక్షణ లేదు. మన పొలాలు పంటకు సిద్ధంగా వున్న తరుణంలో వాళ్ళు మరోసారి దోచుకు పోయేందుకు తిరిగి రావచ్చు," అన్నాడు అరణ్యమల్లు.

ఆ మాటలకు మంత్రి శిలాముఖి అవునన్నట్టు తల వూపి, "మహారాజా! మన వాళ్ళు ఆ బందిపోట్లను చూసిగాక, వాళ్ళు ఎక్కి వచ్చిన వింత జంతువులను చూసి ఎక్కువగా భయపడ్డారు. ఆ జంతువులు హానికరమైనవి కావని తెలుసుకున్నారు



గనక, యీసారి మనవాళ్ళు ఆ దుర్మార్గులను ఎదిరించి, హతమార్చేందుకు ఏ మాత్రం వెనుదీయరు," అన్నాడు.

"క్షత్రియయువకుల సాయం తీసుకుని యిప్పుడే మనం వాళ్ళను వెంటబడి తరిమి సర్వనాశనం చేస్తే బావుంటుంది కదా? ఈ ఆలోచనకు క్షత్రియయువకు లేమంటారో!" అన్నాడు అరణ్యమల్లు.

"యుద్ధం అంటే ఖడ్గ జీవదత్తులు నిద్రాహారాలు కూడా మానేస్తారు. యిప్పుడు ఆ బందిపోట్లు స్వర్ణాచారిని కూడా ఎత్తుకు పోయారు గదా! వాళ్ళను భోజనాలు ముగించి బయటికి రానీయండి, చెప్పి చూద్దాం," అన్నాడు విఘ్నేశ్వరపూజారి.

వీళ్ళు యిలా మాట్లాడుకుంటూ వుండగా ఖడ్గ జీవదత్తులు భోజనాలు చేసి కుటీరం నుంచి బయటికి వచ్చారు. విఘ్నేశ్వర పూజారి జీవదత్తుడితో, అరణ్యమల్లూ, యితర ఖడ్గజాతి వాళ్ళూ చేసిన ఆలోచన గురించి చెప్పారు.

"ఈ ఆలోచన నాకు వేట నుంచి యిక్కడికి వస్తూనే కలిగింది. కాని ఆ బందిపోట్లు అప్పటికే యీ పరిసరాల నుంచి వెళ్ళిపోయారు. మన ఖడ్గమృగం కన్న దూర ప్రయాణంలో ఒంటె మూడింతలు వేగంగా పరిగెత్తుతుంది. అందువల్ల ఆ దుర్మార్గులను హతం చేయాలంటే, వాళ్ళు ఒంటెల మీది నుంచి దిగి ఏ విశ్రాంతి తీసుకుంటున్నప్పుడో చుట్టుముట్టాలి." అన్నాడు జీవదత్తుడు.

"అలాగే చేద్దాం, జీవదత్తప్రభూ! మా వాళ్ళను నలభై యాభైమందిని వెంట బెట్టుకు పోదామా?" అన్నాడు అరణ్యమల్లు ఉత్సాహంగా.

జీవదత్తుడు నవ్వి, "అరణ్యమల్లూ, అంతమంది అనుచరులతో ఆ బందిపోట్లను అనుసరించి పోవటం ఎలా సాధ్యమవుతుంది? వాళ్ళు మన రాకను తేలిగ్గా గుర్తించి అందకుండా పారిపోతారు. అందుకని నేనూ, ఖడ్గవర్మా యిద్దరమే బయలుదేరి పోతాం. ఈ రాత్రికి వాళ్ళు ఎక్కడ విడిది చేస్తారో చూసి ముందుగా వాళ్ళ నాయ

కుల్ని హతమార్చి, తతిమ్మా వాళ్ళను పట్టు కోవటమో లేక యీ అరణ్యప్రాంతాలు వదిలి పోయేలాగానే చేస్తాం," అన్నాడు.

ఒక అరగంట కాలం గడిచీ గడవక ముందే బందిపోట్ల జాడలు తెలుసుకోవ టానికి పోయిన ఖడ్గజాతి వాళ్ళల్లో ఒకడు తిరిగి వచ్చాడు. వాడెక్కి వున్న ఖడ్గమృగం ఆయాసంతో రొప్పుతున్నది.

తన అనుచరుల్ని చూస్తూనే అరణ్య మల్లు ఆదుర్దాగా, "బందిపోట్లు కనిపిం చారా? నీతో బయలుదేరిన తతిమ్మా ముగ్గురూ ఏమయారు?" అని అడిగాడు.

ఖడ్గజాతివాడు నాలుగు మాటల్లో సంగతి సందర్భాలన్నీ చెప్పేశాడు. అతడూ అతడి అనుచరులు ముగ్గురూ కొండవాగును చేరే సరికే బందిపోట్లు వాగును దాటి ఉత్తర దిశగా వెళ్ళిపోతున్నారు. వాళ్ళ కంట బడ కుండా ఖడ్గజాతివాళ్ళు బందిపోట్లను కొంత దూరం అనుసరించి పోయి, వాళ్ళు కొండ పాదాన్ని ఆనుకుని ప్రవహిస్తున్న నదీ తీరాన్ని అంటి పెట్టుకుని పోతున్నట్టు గ్రహించారు. ఆ సంగతి చెప్పేందుకు ఖడ్గజాతి వాళ్ళల్లో ఒకడు ముందుగా యిక్కడికి పరుగుల మీద వచ్చాడు.

"తతిమ్మా మన వాళ్ళు బందిపోట్ల వెన్నంటి పోతున్నారా?" అని అడిగాడు జీవదత్తుడు.



"పోతున్నారు, దొరా! మనం పోయి వాళ్ళను కలుసుకునేవరకూ, వాళ్ళు బంది పోట్లను కనుమరుగు కాకుండా చూస్తూనే వుంటారు," అన్నాడు ఖడ్గజాతివాడు.

జీవదత్తుడు ఓ క్షణకాలం మౌనంగా వూరుకుని ఖడ్గవర్మతో, "ఖడ్గా, యిక మనం బయలుదేరవచ్చు. సూర్యాస్తమయం తర వాత మనం ఆ బందిపోట్లు వున్న ప్రదేశాన్ని చేరటం మంచిది. ఆ తరవాత అవకాశాన్ని బట్టి వాళ్ళ అంతుతేలుద్దాం. స్వర్ణాచారిని యీ రాత్రికే విడిపించుకురావాలి," అన్నాడు.

ఆ తరవాత ఖడ్గ జీవదత్తులు తమ తమ కత్తులూ, విల్లంబులూ తీసుకుని ప్రయాణా నికి ఖడ్గమృగాలను ఉపయోగిద్దామా అను



కునేంతలో విఘ్నేశ్వరపూజారి హఠాత్తుగా ఏదో గుర్తు కొచ్చిన వాడిలా ఎగిరిపడి, "క్షత్రియ యోధుల్లారా, మీరు ఆ బంది పోట్లను సునాయాసంగా వెంబడించి పోవ టానికి వాళ్ళు ఉపయోగించిన వాహనాన్నే వాడుకోవచ్చు. మన సింహం చంపిన బంది పోటు వాడి ఒంటె యీ ప్రాంతాలనే ఎక్కడో వుంటుంది, వెతికించండి!" అన్నాడు.

ఆ మాట వింటూనే అరణ్యమల్లు తన అనుచరులతో, "నిజమే, ఆ వింత జంతువు మాట మరిచాం. అది కుటీరం వెనకనే ఎక్కడో చెట్ల కింద మేస్తూ వుంటుంది. వెళ్ళి పట్టుకు రండి," అన్నాడు.

ఆ వెంటనే నలుగురు ఖడ్గజాతివాళ్ళు కుటీరం వెనక వున్న అరణ్యంలోకి పోయి పావు గంటకాలం గడిచీ గడవకముందే ఒంటెను వెతికి పట్టుకుని ఖడ్గ జీవదత్తుల దగ్గిరకు వచ్చారు. ఖడ్గ జీవదత్తులు ఒంటె మీద ప్రయాణమయారు. అంతకు ముందు బందిపోట్లను గురించి సమాచారం తెచ్చిన ఖడ్గజాతివాడు ముందుండి దారి తీయగా, సూర్యాస్తమయ సమయంలో వాళ్ళు బంది పోట్లను నదీ ప్రాంతంలో గల ఒక కొండ పక్కన చూశారు. ఈ లోపల ఖడ్గ జీవదత్తులకు మిగిలిన ముగ్గురు ఖడ్గజాతివాళ్ళూ కనిపించి వాళ్ళతోబాటే బయలుదేరారు.

చీకటి పడే సమయానికి బంది పోట్ల నాయకుడు తన అనుచరులను నదీతీరంలో ఆ రాత్రికి మజిలీ ఏర్పాటు చేయవలసిం దిగా ఆజ్ఞాపించాడు. బందిపోట్లందరూ తమ వాహనాలు దిగి, ఒంటెలను దాపులనున్న చెట్లకు కట్టివేసి వంట పనులు ప్రారంభిం చారు. వాళ్ళల్లో కొందరు వంటకు పుల్లల కోసం అడవి చెట్లలోకి వెతకబోయారు.

ఖడ్గ జీవదత్తులు, తమ వెంట వున్న నలుగురు ఖడ్గజాతి వాళ్ళతో బందిపోట్లకు కనబడకుండా కొంచెం దూరంగా వున్న గుబురు చెట్లచాటున దాక్కుని, స్వర్ణాచారి కోసం బందిపోట్లు మజిలీ చేసిన ప్రాంతాన్ని పరీక్షగా చూడసాగారు. స్వర్ణాచారి బంది

పోట్లు మళ్ళీ ఎక్కడా వాళ్ళకు కనిపించ లేదు. ఆ దుర్మార్గులు అతణ్ణి దారిలోనే ఎక్కడైనా చంపి పారవేశారా అన్న అను మానం జీవదత్తుడికి కలిగింది.

"ఖడ్గా, స్వర్ణాచారి ఎక్కడా కనిపించ టం లేదు. ఒకవేళ యీ దుర్మార్గులు అతణ్ణి చంపివేసి వుందరు గదా?" అన్నాడు జీవదత్తుడు.

ఆ ప్రశ్నకు ఖడ్గవర్మ తల అడ్డంగా ఆడించి, "అలా జరిగి వుండదు. స్వర్ణా చారి జిత్తులమారి నక్క. వీళ్ళను మోస గించి పారిపోయి వుంటాడని నాకు అను మానం కలుగుతున్నది. కాని, అతణ్ణి గురిం చిన నిజం తెలుసుకోవటం చాలా సులభం. నువ్విక్కడే వుండు. యిప్పుడే వస్తాను," అంటూ కత్తి దూసి బయలుదేరాడు.

జీవదత్తుడు అతణ్ణి ఆపి, "ఏం చేయ బోతున్నావు?" అని అడిగాడు.

"ఎండు పుల్లల కోసం నదీ తీరం నుంచి అరణ్యంలోకి కొందరు బందిపోట్లు వచ్చారు గదా. వాళ్ళల్లో ఒకణ్ణి ప్రాణాలతో పట్టు కుంటే సంగతి సందర్భాలన్నీ తెలిసి పోతవి," అన్నాడు ఖడ్గవర్మ.

జీవదత్తుడు కొంచెం ఆలోచించి, "ఈ ఎత్తుగడ బాగానే వున్నది. వెంట ఒక ఖడ్గజాతి వాణ్ణి కూడా తీసుకుపో. మనం యిక్కడ దాగి వున్న సంగతి మాత్రం



ఆ దుర్మార్గులకు తెలియకుండా పని పూర్తి చేసుకురావాలి," అని హెచ్చరించాడు.

ఖడ్గవర్మ, ఒక ఖడ్గజాతి వాణ్ణి వెంట తీసుకుని చెట్లల్లో ఎండు పుల్లలు వెతుకు తున్న బందిపోట్లల్లో ఒకణ్ణి పట్టుకునేం దుకు బయలుదేరాడు. అతడికి త్వరలోనే అలాంటివాడు ఒకడు కనిపించాడు. కాని వాడు తనను చూసి అనుచరులను హెచ్చ రించక ముందే గొంతు నొక్కి పట్టుకోవాలి!

ఖడ్గవర్మ ఒక ఉపాయం ఆలోచించాడు. బందిపోటువాడు చెట్లకింద పడివున్న ఎండు పుల్లలను పోగు చేయటమే కాక, ఎండిన వని అనుమానం కలిగిన చెట్లకొమ్మలను కూడా బలంగా లాగి విరుస్తున్నాడు.



ఖడ్గవర్మ, తన వెంట వున్న ఖడ్గజాతి వాణ్ణి హెచ్చరించి, వాడి చేత ఒక పెద్ద ఎండు కొమ్మను చెట్టు నుంచి విరిపించి, అది దభీమని కింద పడుతూండగానే పరిగెత్తి వాడితోపాటు దగ్గిర వున్న ఒక చెట్టు వెనక దాక్కున్నాడు. ఎండుకొమ్మ విరిగి పడినశబ్దం వింటూనే బందిపోటువాడు దాన్ని ఎత్తుకు పోయేందుకు అక్కడికి వచ్చాడు. వాడున్న అవసరంలో వాడికి అంత పెద్ద ఎండుకొమ్మ దానికై అది చెట్టు నుంచి విరిగి ఎందుకు పడుతుందా అన్న అనుమానం కలగలేదు.

బందిపోటువాడు వంగి ఎండుకొమ్మను కదిలించబోయే సమయంలో ఖడ్గవర్మ వెనక నుంచి వచ్చి మీదపడి, వాడి గొంతును రెండు చేతులతో బలంగా ఒడిసి పట్టుకున్నాడు. అదే సమయంలో ఖడ్గజాతివాడు అక్కడికి వచ్చి, ఈటెను వాడి గుండెకు గురి చేసి నోరెత్తితే ఈటెతో పొడుస్తానని సౌంజ్ఞ చేశాడు.

ప్రాణభయంతో గడగడ వణికిపోతున్న బందిపోటును మెడపట్టుకుని లేపి నిలబెట్టి ఖడ్గవర్మ వాడితో, "నోరెత్తకుండా నా వెంట రా. నీ కెలాంటి ప్రాణ హాని కలగదు. కాని, అరిచి నీ అనుచరులను హెచ్చరించ ప్రయత్నించావో — నిన్నిక్కడే నిలువునా నరికేస్తాను." అన్నాడు.

బందిపోటువాడు కుక్కిన పేనులా అయిపోయి ఖడ్గవర్మ వెంట బయలుదేరాడు. ఖడ్గవర్మ తెచ్చిన బందిపోటును చూసి జీవదత్తుడు చాలా సంతోషించి, "అనాయాసంగా శత్రువును పట్టినట్టున్నావు! స్వర్ణాచారిని గురించిన సమాచారం ఏమైనా చెప్పాడా?" అని అడిగాడు.

"నేనింతవరకూ వాణ్ణి ఎలాంటి ప్రశ్నా అడగలేదు. ఆ చుట్టుపక్కల యింకా కొందరు వీడి అనుచరులు తిరుగుతున్నారు. అందుకని వీణ్ణి సరాసరి నీ దగ్గిరకు తెచ్చాను." అన్నాడు ఖడ్గవర్మ.

"ఒరే, కొండవాగు దగ్గిర మీరు పంట పొలాలు దోచుకున్నారు గదా, ఆసమ



యంలో అక్కడ మీరు పట్టుకున్న స్వర్ణాచారి అనే అతన్ని ఏం చేశారు?" అని అడిగాడు జీవదత్తుడు, బందిపోటును.

"నిజం చెపితే నన్ను ప్రాణాలతో వదిలేస్తారా?" అన్నాడు బందిపోటు వణుకుతూ.

"తప్పకుండా వదులుతాం. కాని, అబద్ధాలు చెప్పి మమ్మల్ని మోసగించ చూశావో, నిన్ను ముక్కలు ముక్కలుగా నరుకుతాం. తెలిసిందా?" అన్నాడు జీవదత్తుడు కోపంగా.

"అయ్యా, ఆ ఆచారి దారిపొడుగునా 'రక్షించండి!' అంటూ కేకలు పెట్టసాగాడు. మా నాయకుడికి అతన్ని చంపటం యిష్టంలేదు. అందుకని వాణ్ణి కొన్ని రంధ్రాలున్న గోతాంలో గొంతు వరకూ దూర్చి, గోతాం మూతి బిగించాము. ఇప్పుడు వాడు నది ఒడ్డున మేం దించిన సామానుల్లో పడి వున్నాడు," అని చెప్పాడు బందిపోటు.

"ఈ రాత్రికి మీరుండబోయే చోటు యిదే గదా! తెల్లవారి తిరిగి ప్రయాణం ప్రారంభిస్తారు, అవునా?" అని అడిగాడు జీవదత్తుడు.

"అవును. ఇక నాకు ప్రాణహాని కలిగించరు గదా? అంతా నిజం చెప్పాను." అన్నాడు బందిపోటు.

"నువ్వు చెప్పిన దాంట్లో వున్న నిజానిజాలు తెలుసుకునే వరకూ నిన్నిక్కడే ఒక చెట్టుకు కట్టివేసి వుంచుతాం. నోరెత్తి అరవకుండా వుండేందుకు యిన్ని చెట్ల ఆకులు నీ నోట కుక్కక తప్పదు!" అని జీవదత్తుడు పక్కన వున్న ఒక ఖడ్గజాతి వాడికి సౌంజ్ఞ చేశాడు.

ఖడ్గజాతి వాడు, బందిపోటును దూరంగా తీసుకుపోయి ఒక చెట్టు బోదెకు గట్టిగా అడవి తీగతో కట్టివేశాడు. ఆ సరికి బాగా చీకటి పడిపోయింది. ఖడ్గ జీవదత్తులు ఒక చెట్టు మీదికి పోయి బందిపోట్లు విడిది చేసిన ప్రాంతాన్ని పరీక్షగా చూడసాగారు. ఒక చోట చిన్న నెగడు వెలిగింది. దాని ముందు బందిపోట్ల నాయకుడు కూర్చుని. చుట్టూ చేరిన నలుగురైదుగురు అనుచరు

లతో ఏదో మాట్లాడుతున్నారు. తతిమ్మా బందిపోట్లు తిండి తిని నిద్రించేందుకు దావలూ, గోతాలూ నేల మీద పరుచుకుంటున్నారు.

"ఖడ్గా, మరి కాస్త పొద్దు పోనిచ్చి మన దాడి ప్రారంభిద్దాం. ముందుగా స్వర్ణాచారిని బంధవిముక్తుణ్ణి చేయాలి. ఆ తరవాత మన ఖడ్గజాతి వాళ్ళను పంపి ఒంటెలను యిక్కణ్ణించి తరిమి వేయాలి. తరవాత ఖడ్గమృగాలను ఎక్కి, మనం బాణాలు కొడుతూ బందిపోట్ల మీద పడి, వాళ్ళు నిద్ర నుంచి లేచే లోపలే అందిన వాళ్ళను నరికి, మిగతా వాళ్ళను చెల్లా చెదురు చేద్దాం," అన్నాడు జీవదత్తుడు.

"బావుంది. అన్నిటికన్న ముఖ్యం స్వర్ణాచారిని విడిపించటం. ఆ తరవాత ..." ఖడ్గవర్మ మాట మధ్యలోనే ఆగిపోయి, ఎక్కడ లేని ఆశ్చర్యంతో బందిపోట్లు విడిది చేసిన చోటుకు దాపులనున్న కొండ కేసి చేయి చూపుతూ, "జీవా, అదేమిటి? ఆ కొండ గుహలో కాగడా వెలుగు చూశావా? శరీరమంతా జడల మయంగా వున్న ఆ వికృతాకారు డెవడు? వాడిని మంత్రదండంతో కొడుతున్నవాడు అంతకన్న కూడా వికృతంగా వున్నాడే!" అన్నాడు.

జీవదత్తుడు, ఖడ్గవర్మ చెప్పిన గుహ కేసి దృష్టి సారించాడు. ఖడ్గవర్మ చెప్పిన విధంగా గుహలో ఒక కాగడా వెలుగుతున్నది. దాని వెలుగులో శరీరమంతా పొడవాటి జడలు వేలాడుతున్న వికృతాకారు డొకడూ, నల్లని వస్త్రం ధరించి చేత గల మంత్ర దండాన్ని బందిపోట్ల కేసి వూపుతున్న మాంత్రికు డొకడూ కనిపించారు.

ఖడ్గ జీవదత్తులు ఆమితాశ్చర్యంతో ఆ వింత మానవుల కేసి చూస్తూండగానే శరీరమంతా జడలు గల వికృతాకారుడు, కొండలూ, అరణ్యం మార్మోగేలా పెద్దగా ఒక కేక పెట్టి, గుహలో నుంచి బయటికి దూకి బందిపోట్ల కేసి పరిగెత్తుకు రాసాగాడు. అతడి నుదుటి మీద నిప్పుకణంలా ఏదో వెలుగుతూ ఆరిపోతున్నది. చేతిలో తెల్లని గద వున్నది. —(ఇంకావుంది)





# యక్షపర్వతం

## 5

[ఖడ్గజాతి వాళ్ళు చెప్పిన మార్గం వెంట పోయి ఖడ్గ జీవదత్తులు బందిపోట్లను ఒక నదీ తీరం దగ్గిర కలుసుకున్నారు. రాత్రి బాగా పొద్దుపోయిన తర్వాత ఖడ్గ జీవదత్తులు వాళ్ళ పైకి దాడి పోబోయేంతలో, దాపుల నున్న ఒక కొండగుహలో నుంచి శరీరమంతా జడలు కప్పిన వికృతాకారు డొకడు బందిపోట్ల కేసి పరిగెత్తుకురాసాగాడు. తరవాత—]

నెగడు ముందు కూర్చుని తన అనుచరులతో కబుర్లాడుతున్న బందిపోట్లనాయకుడు గుహ వైపు నుంచి వచ్చిన వికృతమైన అరుపులూ, కేకలూ వింటూనే చప్పున తల తిప్పి అటు కేసి చూశాడు. అతడి దృష్టికి నిలువెత్తున వున్న నల్లని ఆకారం ఒకటి తమ కేసి పరిగెత్తుకు రాపటం కనిపించింది. ఆ ఆకారం చేతిలో భగ భగ మండుతున్న కాగడా ఒకటి వున్నది.

"ఏమిటీ భీతికొల్పే రూపం? ఏదైనా రాక్షసా, లేక కొండ పిశాచమా?" అంటూ బందిపోట్లనాయకుడు లేచి నిలబడ్డాడు.

"దొరా, యిక్కడ జాగు చేయటం ప్రాణాంతకం అవుతుంది. ఇదేదో మనుషుల్ని పీక్కుతినే రాక్షసే! సందేహం లేదు," అంటూ నెగడు ముందున్న బందిపోట్లనాయకుడి అనుచరులు నలుగురూ నదీ తీరం కేసి పరిగెత్తసాగారు.




"పిరికి వెధవల్లారా, ఆగండి! మనం యింతమందిమి వుండగా యీ రాక్షసి ఏం చెయ్యగలదు? ఈటెలు ఎత్తి గుంపుగా పోయి మీదపడి పొడుద్దాం, రండి," అంటూ బందిపోట్లనాయకుడు గావు కేకలు ప్రారంభించాడు.

అతడి అనుచరులెవరూ ఆ హెచ్చరిక వినిపించుకోకుండా బతికుంటే బలుసాకు తినవచ్చుననుకుంటూ తమ వాహనాలైన ఒంటెలు కట్టివేసి వున్న చెట్లకేసి కొందరూ, నది వైపుకు కొందరూ పారిపోసాగారు. ఈలోపల వికృతాకారం యింకా నిద్రపోతున్న కొందరు బందిపోట్ల మీద హఠాత్తుగా వచ్చిపడి, వాళ్ళను కాళ్ళతోతన్నుతూ, చేతిలోని కాగడాతో వాళ్ళు ధరించిన దుస్తులకు నిప్పుపెట్టి నానా భీభత్సమూ చేయసాగింది.

చెట్టు మీద వున్న ఖడ్గ జీవదత్తులు యీ భయంకర దృశ్యాన్ని చూసి ఒక క్షణ కాలం నిశ్చేష్టులై పోయారు. చెట్టు కింద వున్న ఖడ్గజాతి వాళ్ళు నలుగురూ ప్రాణ భయంతో గడగడ వణికిపోతున్నారు.

"ఖడ్గా, యీ వికృతాకారం రాక్షసీ కాదు, పిశాచమూ కాదు. ఆ గుహలో వున్న మాంత్రికుడు ఏవో మంత్రాలు వల్లించి, వాటి ద్వారా శివమెక్కించి పంపిన ఏదో శక్తి అయివుంటుంది," అన్నాడు జీవదత్తుడు.

"ఏమైతేనేం, మనం చేయాలనుకున్న పని ఆ మాంత్రికుడు చేస్తున్నాడు. మనం చూస్తూ వూరుకుందాం. బందిపోట్లంతా యీ ప్రాంతాల నుంచి పారిపోయిం తరవాత జొన్నకంకుల గోతాంలో వున్న స్వర్ణాచారిని విడిపించుకుని, మన దారిన మనం పోదాం," అన్నాడు ఖడ్గవర్మ.

జీవదత్తుడు కొంచెంసేపు నదీ తీరంలో వికృతాకారుడు చేస్తున్న కల్లోలం కేసి చూసి, "బందిపోట్లనాయకుడు కొంత ధైర్య సాహసాలున్న వాడిలా కనిపిస్తున్నాడు. అటు చూడు! వాడు కొందరు అనుచరుల్ని కూడ గట్టుకుని వికృతాకారుణ్ణి వెనక వైపు నుంచి దెబ్బ తీసేందుకు పొంచి పొంచి మరీ నడుస్తున్నాడు," అన్నాడు.

జీవదత్తుడు చెప్పినట్టే బందిపోట్లనాయకుడు పారిపోతున్న పదీ పన్నెండు మంది అనుచరుల్ని ఈలె చూపి బెదిరించి ఆపి, వాళ్ళను వెంట బెట్టుకుని వికృతాకారుడి మీద హఠాత్తుగా వెనక నుంచి పడి దెబ్బ తీసేందుకు పోతున్నాడు.

"ఈ దెబ్బతో గుహలోని మాంత్రికుడూ వాడు సృష్టించిన మహాశక్తీ హఠాన్మరణం పాలవుతాయి. ఆ వికృతాకారుణ్ణి చంపిన తరవాత, బందిపోట్లనాయకుడు కొండగుహలన్నీ గాలించి ఆ మాంత్రికుణ్ణి కూడా హతమారుస్తాడు. మనం ఏదో ఒకటి చేయాలి. స్వర్ణాచారి యీ గొడవలో ఏ ఒంటెల కాళ్ల కిందో పడి చావకుండా చూడాలి," అన్నాడు ఖడ్గవర్మ.

ఖడ్గవర్మ మాట ముగించే లోపలే మాంత్రికుడున్న కొండ గుహ మధ్య పెద్ద మంట లేచింది. మాంత్రికుడు ఆ మంటలో బాగా నూనెతో తడిపి వుంచిన కాగడాలను ఒక్కొక్కదాన్నే ముట్టించి, "శాంభవీ! భైరవీ!" అని అరుస్తూ, దిగువ నున్న బందిపోట్ల మీదికి విసరసాగాడు.

భగభగమని మండుతున్న కాగడాలు బందిపోట్ల మీదికి వచ్చి పడసాగాయి. ఈ కొత్త దాడిని చూస్తూనే బందిపోట్లనాయకుడు అదిరిపడి, తన అనుచరులతో, "ఒరే, ఉష్ట్రవీరుల్లారా! ఈ కనబడే వికృతి పిశాచం




లాంటివి, ఆ పైనున్న కొండ గుహలో మరి కొన్ని వున్నట్టుంది. ఇక లాభం లేదు. మీలో కొందరు జొన్నకంకులున్న గోతాలను నదిలోకి తోయండి. నది వాలు వెంట తేలి వచ్చే వాటిని, దిగువ నెక్కడైనా పట్టుకుని ఒడ్డుకు చేర్చుదాం. మిగిలిన వాళ్ళు చెట్ల నుంచి ఒంటెలను విప్పి సవారీ అయి నది దిగువకు బయలుదేరండి," అని కేక పెట్టాడు.

ఆ కేక వింటూనే నది కేసి పరిగెత్తి పోతున్న బందిపోట్లూ, చెట్ల చాటున చీకట్లో దాక్కున్న వాళ్ళూ ముందుకు వచ్చి, కొందరు ఒంటెలను చెట్ల నుంచి విప్పనారంభించారు. మరి కొందరు జొన్నకంకు



లున్న గోతాలను ఎత్తుకుని నదిలో వేసేం దుకు బయలుదేరారు. ఇంతలో గుహలో వున్న మాంత్రికుడు ఒక చేతితో కాగడా పట్టుకుని అటూ యిటూ ఊపుతూ, "ఒరే, జడలభూతం! ఇక ఆ బందిపోటు నరాధ ముల్ని వెంట తగిలి, జొన్నకంకుల గోతా ముల్ని నదిలో వేసేవాళ్ళను పట్టుకుని, నదీభూతానికి ఆహారంగా వెయ్యి," అని కేక వేశాడు.

అప్పటివరకూ దొరికిన బందిపోటు నల్లా కాళ్ళతో, చేతుల్తో ఎడా పెడా బాదుతూ ఆ ప్రదేశాన్నంతా అల్లకల్లోల పరుస్తున్న వికృతాకారుడు, మాంత్రికుడి హెచ్చరిక వింటూనే జొన్నకంకుల గోతాలున్న ప్రాంతానికి పరిగెత్తాడు. ఆ సరికే కొందరు బందిపోట్లు గోతాలను భుజాల కెత్తుకుని నది కేసి పరిగెత్తుతున్నారు. వికృతాకారుడు వాళ్ళల్లో దొరికిన వాడినల్లా నడుం పట్టు కుని నదిలోకి విసిరివేయసాగాడు.

ఈసారి నదీ తీరాన మరింత అల్లకల్లోలం లేచింది. బెదిరి కట్టు తాళ్ళను తెగ కొట్టిన ఒంటెలు కొన్ని గుడ్డి చీకట్లో దారీ తెన్నూ లేకుండా పరుగులు తీస్తూ, బందిపోట్లను కాళ్ళతో తన్ని, అందిన వాళ్ళను నోటితో పట్టుకుని దూరంగా విదిలించి వేయసాగినై. వాటిల్లో కొన్ని చెవులు చిల్లులు పడేలా కీచు మని అరుస్తూ నదీ ప్రవాహంలోకి పోయి పడి, నీటి వాలు వెంట కొట్టుకు పోసాగినై.

ఆ సమయంలో హఠాత్తుగా ఒక మానవ కంఠం, "రక్షించండి! రక్షించండి! నన్ను నదిలో పడవెయ్యకండి!" అంటూ గగ్గోలు ప్రారంభించింది. అంతలోనే దభీమంటూ ఒక జొన్నకంకుల గోతాం నీట పడిన శబ్దం అయింది.

"ఖడ్గా, ఆ కంఠస్వరాన్ని పోల్చు కున్నావా? ఆ కేకలు పెట్టినవాడు స్వర్ణా చారి. అతణ్ణి బందిపోట్లు నదిలో పార వేశారు. జొన్నకంకుల గోతాం నీట మున గదు కనక, అందులో గొంతు వరకూ కుక్కబడి వున్న స్వర్ణాచారి నీటి వాలున కొట్టుకుపోయి, ఎక్కడో ఒక చోట నది

ఒడ్డుకు చేరే అవకాశం వుంది. కాని, మనం ఒక పొరబాటు చేశాం. కొంచెం ముందుగా పూనుకున్నట్టయితే అతణ్ణి యిక్కడే రక్షించి వుండేవాళ్ళం," అన్నాడు జీవదత్తుడు చెట్టు మీదినుంచి దిగబోతూ.

ఖడ్గవర్మ అతడి భుజం పట్టుకు ఆపి, "ఇప్పుడు ఏం చేయబోతున్నావ్?" అని అడిగాడు.

"ఖడ్గజాతి వాళ్ళల్లో ఒకణ్ణి నదీ తీరం వెంట దిగువకు పొమ్మని చెబుతాను. బహుశా వాడికి స్వర్ణాచారి కేకలు వినబడే అవకాశం వుంది. తతిమ్మా ముగ్గుర్నీ ఖడ్గ మృగా లెక్కి పోయి, అందిన బందిపోటు నల్లా ఈటెకు బలిపెట్టమంటాను," అన్నాడు జీవదత్తుడు.

"అయితే మనం యిక్కడ చేతులు కట్టుకుని యీ వింత చూస్తూ కూర్చోవట మేనా?" అన్నాడు ఖడ్గవర్మ కొంచెం కోపంగా.

"తొందరపడకు, ఖడ్గా! బందిపోట్లు యిప్పటికే చెల్లాచెదురుగా అటూ యిటూ పరిగెత్తుతున్నారు. కాని, వాళ్ళ నాయకుడు యింకా తాను దొంగిలించుకు వచ్చిన జొన్న పంటను కాపాడుకునే ప్రయత్నంలో జడల భూతాన్ని ఎదిరించే ప్రయత్నం చేస్తున్నాడు. వాడు తన అనుచరులకు చేస్తున్న హెచ్చరి కలు నీకు వినబడటం లేదా? మన ఖడ్గ



జాతి వాళ్ళకు వాడు దొరక్కుండా తప్పించు కునే ప్రయత్నం చేస్తే, అప్పుడు వాణ్ణి మనం బాణాలతో కొట్టి హతమార్చాలి. ముందు యీ జడలభూతం, మాంత్రికుడీ సంగతేమిటో మనం చూడాలిగదా?" అన్నాడు జీవదత్తుడు.

"బావుంది. నువు ఖడ్గజాతి వాళ్ళకు చెప్పవలసిందేదో చెప్పిరా. నే నిక్కడే వుంటాను," అని ఖడ్గవర్మ విల్లంబులు చేతికి తీసుకున్నాడు.

జీవదత్తుడు చెట్టు దిగి పోయి ఖడ్గజాతి వాళ్ళకు వాళ్ళు చేయవలసిన పనుల సంగతి చెప్పాడు. ఆ వెంటనే ఒక ఖడ్గ జాతివాడు ఖడ్గమృగాన్నెక్కి నది దిగువకు



బయలుదేరాడు. కాని, మిగిలిన ముగ్గురు ఖడ్గజాతివాళ్ళూ కాసేపు తటపటాయించి, "దొరా, యీ బందిపోట్లన్నా, వాళ్ళ వింత మృగాలైన ఆ ఒంటెలన్నా మాకు భయం పోయింది. కాని, ఆ జడల భూతం మాటేమిటి? అది మమ్మల్ని నిలువునా విరుచుకు తినదా?" అన్నారు.

"ఆ భూతం సంగతీ, దాన్ని బందిపోట్ల మీదికి ఉసికొల్పినవాడి సంగతీ మేం చూస్తాం. మీరు మాత్రం అందిన బందిపోటునల్లా మీ ఈటెలకు బలిపెట్టండి. వాళ్ళు నోటికి అక్కరకు వచ్చిన మీ జొన్న పంట అంతా కోసుకుపోయారు. ఆ సంగతి బాగా గుర్తుంచుకోండి," అన్నాడు జీవదత్తుడు.

తమ పంటపొలాల మాట వింటూనే ఖడ్గజాతి వాళ్ళు కోపంతో గట్టిగా పళ్ళు కొరికి, "దొరా, యీ దుర్మార్గుల్ని మేం ప్రాణాలతో పోనియ్యం!" అంటూ తమ వాహనాలెక్కి, "జై, అరణ్యమాతా!" అంటూ బందిపోట్ల కేసి దూకారు.

జడలభూతం ధాటికే తట్టుకోలేక చెల్లాచెదురై తమ నాయకుడి హెచ్చరికలవల్ల తిరిగి అక్కడక్కడా గుంపుగూడుతున్న బందిపోట్లు, ఖడ్గమృగాల మీద వస్తున్న వాళ్ళను చూస్తూనే గుండెలవిసి, "ఖడ్గ జాతి వాళ్ళ మంద వచ్చి మీద పడుతున్నది, దొరా! యిక లాభం లేదు, పారిపోదాం!" అంటూ కాలిసత్తువ కొద్దీ చెట్ల కేసీ, నది ఒడ్డు వెంటా పరిగెత్తసాగారు.

ఈ కొత్త దాడిని చూస్తూనే బందిపోటు నాయకుడికూడా తారెత్తిపోయింది. ఒక వైపున జడల భూతం! రెండవ వైపున ఈటెలెత్తి వస్తున్న ఖడ్గజాతి వాళ్ళు! ఇక అక్కడ నిలబడి లాభంలేదనుకుని అతడు పెద్దగా గొంతెత్తి, "అందరూ నది ఒడ్డు వెంట దిగువకు పరిగెత్తండి. మనం నదిలో వేసిన జొన్నకంకుల మూటలను ఎక్కడో ఒక చోట ఒడ్డుకు చేర్చాలి," అంటూ పరిగెత్తసాగాడు.

"ఆహాఁ, తెలివి తక్కువ కొద్దీ ఆలశ్యం చేశాను. దుర్మార్గుడు ప్రాణాలతో తప్పిం

చుకు పోయేట్టున్నాడు," అంటూ చెట్టు మీద వున్న ఖడ్గవర్మ బందిపోటు నాయకుడి కేసి బాణం వెంట బాణం వదిలాడు. కాని, ఆ సరికే వాడు బతికి వున్న తన అనుచరులతో పాటు ఖడ్గవర్మ బాణం వేటుకు అందనంత దూరం పరిగెత్తి పోయాడు.

బందిపోట్ల మీదికి పోయిన ఖడ్గజాతి వాళ్ళు ఇద్దరు ముగ్గురు బందిపోట్లను మాత్రం తమ ఈటెలతో పొడవగలిగారు. అంతలో ఆ దుర్మార్గులందరూ తమ నాయకుడి ఆజ్ఞ విని మూక ఉమ్మడిగా అక్కణ్ణించి పారిపోయారు. ఇప్పుడా ప్రదేశమంతా పెద్ద జడివాన హఠాత్తుగా ఆగిపోయినట్టు ఒక్క క్షణకాలం నిశ్శబ్దమై పోయింది.

గుహలో వున్న మాంత్రికుడు గుహ ముందుకు వచ్చి కాగడాను పైకెత్తి పట్టుకుని తల అటూ యిటూ తిప్పిచూస్తూ, "ఒరే, జడల భూతం! నువ్వెక్కడ? జొన్నగింజల మూటలు కొన్నయినా మన చేత బడినయ్యా?" అని కేకవేశాడు.

జడలభూతం పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ నదీ తీరం నుంచి గుహకేసి బయలుదేరేంతలో దాని దృష్టి ఖడ్గజాతి వాళ్ళ మీద పడింది. వెంటనే అది భీతిగొన్నట్టు కీచుమనే కంఠస్వరంతో, "యమకింకరులు! ఒంటి కొమ్ము మహిషాలెక్కి వచ్చారు!" అని కేక పెట్టింది.

ఆ కేక వింటూనే మాంత్రికుడు గుహలోంచి మరి కాస్త ముందుకు వచ్చి కాగడా



వెలుగులో ఖడ్గమృగాలనూ, వాటిని ఎక్కి వున్న వాళ్ళనూ చూసి, ఒక్కక్షణం నివ్వెరపోయి, అంతలోనే తేరుకుని, "ఒరే, జడల భూతం! వాళ్ళు యమకింకరులూ కాదు, అవి ఒంటికొమ్ము మహిషాలూ కావు. ఖడ్గజాతివాళ్ళూ, ఖడ్గమృగాలూ! తెలిసిందా? వెళ్ళి మీదపడి, ముందు మనుషుల్ని విరుచుకుతిను. తరవాత మృగాలను తిందువుగాని," అన్నాడు.

మాంత్రికుడు యిలా అనగానే జడల భూతం ఒక వికటాట్టహాసం చేసి, "అహహ్హా, పారిపోకండి!" అంటూ చేతులుచాచి ఖడ్గజాతివాళ్ళ కేసి బయలుదేరింది.

ఆ భూతం మీదికి రావటం చూస్తూనే ఖడ్గజాతి వాళ్ళు ముగ్గురూ, "దొరా!" అంటూ చావుకేక పెట్టారు.

ఖడ్గజాతి వాళ్ళకు రానున్న ప్రమాదాన్ని గుర్తించిన ఖడ్గజీవదత్తులు అంతకు ముందే చెట్టు దిగి వాళ్ళున్న చోటుకు పరుగు పరుగున వస్తున్నారు. ఖడ్గజాతి వాళ్ళ ఆక్రందనం వింటూనే ఖడ్గవర్మ ఒక బాణాన్ని గురిచూసి జడలభూతాని కేసి వదిలాడు. అది పోయి భూతాన్ని తాకింది. కాని, దాని శరీరం మీద ఒత్తుగా వున్న జడలవల్ల భూతం ఏ మాత్రం గాయపడలేదు.

"గురూ! ఎవడో నా మీద దూరాన్నుంచే కొయ్యములికి కొట్టాడు," అంటూ కేక పెట్టింది భూతం.

మాంత్రికుడు నిర్ఘాంతపోతూ, యీ సారి రెండు చేతులతో రెండు కాగడాలు పట్టుకుని పైకెత్తి, వాటి వెలుగులో ముందుకు పరిగెత్తుకొస్తున్న, ఖడ్గజీవదత్తులను చూసి, కళ్ళెర్రచేసి, పళ్ళు కొరుకుతూ, "ఒరే, జడల భూతం! నీ శరీరాన్ని తాకింది కొయ్యములికి కాదు, బాణం! ఆ కొట్టిన వాడు క్షత్రియుడిలా వున్నాడు. వెంట వున్న రెండవవాడు సగం క్షత్రియుడూ, సగం మంత్రవేత్తలా వున్నాడు. ఆగు, నా మంత్రదండాన్ని విసిరి యిద్దర్నీ యిప్పుడే చితా భస్మంగా మార్చిపారేస్తాను!" అంటూ ఎగిరి గంతేసి గుహ లోపలికి వెళ్ళాడు. —(ఇంకావుంది)





# యక్షపర్వతం

## 6

[జడలభూతాన్ని చూస్తూనే బందిపోటుదొంగలు పారిపోసాగారు. వాళ్ళల్లో కొందరు, దొంగిలించుకు వచ్చిన బొమ్మకంటుల గోతాలను నదిలో పడవేశారు. ఖడ్గ జీవదత్తులు గుహ ముందుకు రాగానే, జడలభూతం చేసిన హెచ్చరిక విని, మాంత్రికుడు కాగడాలను విసిరివేసి, వాళ్ళిద్దర్నీ భస్మం చేస్తానంటూ గుహ లోపలికి పరిగెత్తాడు. తరవాత—]

ఇప్పుడు తాము గుహలోకి పోయి మాంత్రికుణ్ణి పట్టుకోవటమా లేక అతడు తన మంత్రదండంతో తిరిగి వచ్చేవరకూ గుహ ముందు వేచి వుండటమా అని జీవదత్తుడు ఆలోచిస్తున్నంతలో, ఖడ్గవర్మ గుహ కేసి అనుమానంగా ఓసారి చూసి జీవదత్తుడితో, "జీవా! నీ వేషం ఆ మాంత్రికుణ్ణి కొంచెం హడల గొట్టినట్టున్నది. నీకూ మంత్రతంత్రాలు తెలుసునని అతడు గ్రహించే, హడావిడిగా గుహ లోపలికి పరిగెత్తాడు. ఇప్పుడేం చేయడం?" అన్నాడు.

జీవదత్తుడు తల తిప్పి, ఖడ్గజాతి వాళ్ళకు దొరక్కుండా పారిపోయేందుకు జడల భూతం అటూ యిటూ పరిగెత్తుతూ కేకలు పెడుతూవుండటం చూసి చిరునవ్వు నవ్వి, "క్షత్రియుణ్ణి కాదు, మంత్రవిద్యలు నేర్చిన వాణ్ణని నలుగురికీ తెలియగలందులకే, నేను నెత్తిన శిఖ కట్టి, చేతిలో దండం పట్టు



కున్నాను. కనక ఆ సంగతి మాంత్రికుడు తేలిగ్గానే గ్రహించగలిగాడు. ఇక ఇప్పుడు మనం ఏం చేయాలన్నది ముఖ్యసమస్య! మన దారిన మనం పోయే ముందు, ఈ మాంత్రికుడి సంగతేమిటో తేల్చుదాం, సరేనా?" అన్నాడు జీవదత్తుడు.

"అలా అయితే ఇక ఆలస్యమెందుకు? గుహలో దొరబడదాం," అంటూ ముందు కడుగు వేశాడు ఖడ్గవర్మ.

జీవదత్తుడు కూడా ఖడ్గవర్మతో పాటు గుహ కేసి నడుస్తూ చుట్టూ ఓ మారు కలయ చూశాడు. ఇప్పుడు ఆ ప్రాంతంలో జడల భూతాన్ని ఎదిరించే బందిపోట్లెవరూ లేరు. గాయపడిన వాళ్ళూ, భూతం దుస్తులకు నిప్పు పెట్టగా శరీరం కాలి, కింద పడి దొర్లుతున్న వాళ్ళూ కొద్ది మంది తప్ప, మిగతా వాళ్ళంతా నది దిగువకు పారిపోయారు. జడలభూతాన్ని మాత్రం ధైర్యంగా ఖడ్గజాతివాళ్ళు ముగ్గురూ చుట్టుముట్టి ఈటెలతో పొడిచే ప్రయత్నం చేస్తున్నారు. కాని, భూతం వాళ్ళ దెబ్బలు తప్పించుకుంటూ, "గురో! గురో!" అని అరుస్తూ గుహ కేసి పరిగెత్తుతున్నది.

"నిజంగా అది భూతమంటావా, లేక మాంత్రికుడు ఎవడో మనిషికి ఆ వికృత వేషం వేసి నాటకం ఆడుతున్నాడంటావా?" అని అడిగాడు ఖడ్గవర్మ.

"మనిషైనా అలా భూతం లాగా ప్రవర్తించటం మొదలు పెట్టాక—దాన్ని భూతమనే మనం అనుకోవాలి. అరె! అది మన ఖడ్గజాతివాళ్ళ నుంచి తప్పించుకుని గుహ ముందుకు పరిగెత్తుతున్నదే!" అంటూ జీవదత్తుడు భూతాన్ని పట్టుకునేందుకు గుహ కేసి పరిగెత్తసాగాడు.

ఇద్దరూ గుహ దిగువ భాగాన్ని చేరేంతలో జడలభూతం కొండముచ్చులా అక్కడ వున్న బండరాళ్ళ మీది నుంచి గుహ కేసి గబగబా ఎక్కి, పోసాగింది. దాన్ని వెంబడించి వస్తున్న ఖడ్గజాతివాళ్ళు ముగ్గురూ తమ వాహనాల మీద నిలబడి, దాన్ని ఈటెలతో పొడవాలని చూశారు. వాళ్ళల్లో ఒకడు

ఈటెను గురి చేసి భూతం వీపుకు తగిలేలా విసిరాడు. ఈటె వేగంగా పోయి దాని వీపుకు తగిలి, జారి దభీమంటూ కింద పడి, రాళ్ళ మీది నుంచి దిగువకు దొర్లుకు వచ్చింది.

ఖడ్గజాతి వాళ్ళల్లో ఒకడు తానెక్కి వున్న ఖడ్గమృగాన్ని దిగి జీవదత్తుడి దగ్గిరకు వచ్చి, "దొరా, పెద్ద పొరపాటు జరిగి పోయింది. మన దగ్గిర బలమైన తాడు ఏదైనా వున్నట్టయితే భూతాన్ని పట్టుకునే వని. మా ఈటె పోట్లు దాని కేమీ గాయ పరిచినట్టు లేదు, శరీరాన్ని నిండుగా కప్పి వున్న జడలు దాన్ని కాపాడినై." అన్నాడు.

"ఈసారి ఆ భూతాన్ని నువ్వన్నట్టు తాడు విసిరి పట్టుకుని బంధిద్దాం! మీరిక్కడే వుండండి. మేము గుహలోకి పోయి, ఆ భూతాన్ని, దాని యజమాని అయిన మాంత్రికుణ్ణి అందితే పట్టుకుని, దిగువకు గిరవాటు వేస్తాం." అన్నాడు జీవదత్తుడు.

జీవదత్తుడూ, ఖడ్గవర్మా బండరాళ్ళ మీదుగా ఎక్కి పోయి గుహ ద్వారాన్ని సమీపించే సమయానికి కొంచెం ముందు గానే, జడలభూతం అక్కడికి చేరి, "గురో! ఆ ఒంటి కొమ్ము మహిషా లెక్కి వచ్చిన యమకింకరులకు మరిద్దరు మనుషులు తోడయారు. అందరూ మన గుహలోకి వస్తున్నారు. తొందరగా వాళ్ళను భస్మం చెయ్యండి!" అంటూ కేకలు పెట్టసాగింది.



గుహ లోపలి నుంచి ఎలాంటి జవాబూ రాలేదు. జడలభూతం భయంతో కంపించి పోతూ వెనక్కు తిరిగి చూసింది. దానికి గుహను సమీపిస్తున్న ఖడ్గ జీవదత్తులు కనిపించారు. వెంటనే ఒక్క ఎగురు ఎగిరి, కీచుమని పెద్దగా అరిచింది, భూతం.

"ఓ, జడలభూతం, పారిపోకు! మీగురువు గారి గురువులం వస్తున్నాం. అతణ్ణి కూడా బయటికి రమ్మని కేక వెయ్యి." అంటూ జీవదత్తుడు దండాన్ని ఎత్తి పట్టుకుని భూతం కేసి వేగంగా నడిచాడు. అంతలో గుహ లోపలి నుంచి ఏవో మాటలు వినిపించినై. ఆ వెంటనే భూతం, "చిత్తం, గురో!" అంటూ గుహ లోపలికి పరిగెత్తింది.



ఖడ్గ జీవదత్తులు మరుక్షణాన గుహ లోపలికి వెళ్ళారు. గుహ మధ్యభాగంలో నాలుగైదడుగుల వెడల్పున్న ఒక గుంటలో నుంచి భగభగమంటూ మంటలు లేస్తున్నవి. దానికి కొంచెం ఎడంగా బాగా నూనెలో తడిపి వున్న కాగడాలు కొన్ని పడివున్నవి. ఆ మంటల వెలుగులో ఖడ్గజీవదత్తులు బడలభూతం కోసం, మాంత్రికుడి కోసం గుహ అంతా వెతికి చూశారు. పది పన్నెండడుగుల వెడల్పూ, దాదాపు ఇరవై అడుగుల పొడవూ వున్న ఆ గుహలో మరొక ద్వారం ఎక్కడా వాళ్ళకు కనిపించలేదు. అయితే ఆ గురు శిష్యులు గుహలో ఎక్కడ దాక్కున్నట్టు?

"జీవా, ఈ దుర్మార్గులిద్దరికీ మాయమయిపోయే శక్తులేమైనా వున్నవంటావా?" అన్నాడు ఖడ్గవర్మ ఆశ్చర్యపడుతూ.

"ఊహుం, అంత గొప్ప శక్తులు సాధించిన వాళ్ళయితే, బందిపోట్లు దొంగిలించుకు వచ్చిన జొన్నపంటను తాము తిరిగి దొంగిలించుకు పోయేందుకు ఆ మాంత్రికుడూ, వాడి భూతం అంతగా హైరాన పడిపోరు. ఈ గుహనుంచి బయటికి పోయేందుకు మరేదో రహస్య మార్గం వుండి వుంటుంది. జాగ్రత్తగా రాయి రాయినీ కదిపి చూద్దాం," అన్నాడు జీవదత్తుడు.

ఆ తరవాత ఖడ్గ జీవదత్తులు గుహ గోడల్లోని ప్రతి ఒక్క రాయినీ బలంగా పట్టుకుని వెనక్కు నెట్టి చూడసాగారు.

ఒక అరగంట కాలం వాళ్ళలా శ్రమపడిన తరవాత ఒకచోట వున్న నలుచదరపు రాయి ఒకటి కొద్దిగా వెనక్కు కదిలింది. అది నేలకు నాలుగైదడుగుల ఎత్తులో వున్నది.

రాయి కొంచెం కదిలి వెనక్కు జరగగానే జీవదత్తుడు ఖడ్గవర్మను తొందరపడకు అని హెచ్చరించి, చిన్న గొంతుతో, "ఖడ్గా, మాంత్రికుడూ, వాడి భూతం పారిపోయిన మార్గమేదో తెలుస్తున్నది గదా? వాళ్ళు ఈ రాతిని పక్కకు నెట్టి బయటకు పోయి, తిరిగి దాన్ని ఎప్పటిలా అమర్చారు.

నా అనుమానం వాళ్ళు మనకోసం దాని వెనక వున్న మరో గుహలాంటి దానిలో ఎక్కడో కాచుకుని వుంటారని,'' అన్నాడు.

''నువ్వనేది మనం రాతిని పక్కకు నెట్టి, అవతలికి దిగబోయే సమయాన, మన మీద వాళ్ళు ఏ కత్తినో, ఈటెనో ప్రయోగిస్తారనేనా?'' అని అడిగాడు ఖడ్గవర్మ.

''అవును, అదే నా అనుమానం,'' అన్నాడు జీవదత్తుడు.

''అప్పుడు నువ్వొక పనిచెయ్యి. ఇద్దరం రాతిని బలంగా పట్టుకుని వెనక్కు నెట్టగానే, నువ్వు కొంచెం పక్కకు తప్పుకో. నేను మండుతున్న కాగడాలను అవతలికి విసిరి, ఏమవుతుందో చూస్తాను. వాళ్ళు మన మీదికి రాకపోతే, ఆ కాగడాల వెలుగులో అక్కడ ఏమున్నదో ముందుగా చూసి, జాగ్రత్తగా అవతలికి దిగవచ్చు. ఏమంటావ్?'' అన్నాడు ఖడ్గవర్మ.

''అంత గొప్ప తెలివైన ఉపాయం ఏమీ కాదుగాని—యిప్పటి పరిస్థితిలో అదే వున్న ఒక్క మార్గంగా కనబడుతున్నది,'' అన్నాడు జీవదత్తుడు.

జీవదత్తుడు యిలా అనగానే ఖడ్గవర్మ గుహ మధ్య మండుతున్న కొలిమి దగ్గరకు పోయి, ఆ పక్కన పడివున్న కాగడాలు రెండు తీసుకుని, ముట్టించాడు. అవి భగ భగమంటూ మండసాగాయి. ఖడ్గవర్మ



వాటిని తెచ్చి, తాము వెనక్కు నెట్టవలసిన రాయికి దిగువగా నేలమీద ఆనించాడు.

ఖడ్గ జీవదత్తులు కలిసి యీసారి మరింత బలంగా ఒక పట్టు పట్టి నలుచదరపు రాతిని గట్టిగా వెనక్కు నెట్టారు. రాయి చిన్న శబ్దం చేస్తూ కదిలి వెనక్కు పడిపోకుండా, కిటికీ రెక్కలాగా పక్కకు జరిగి నిలబడింది. జీవదత్తుడు పక్కకు తప్పుకున్నాడు. ఖడ్గవర్మ చప్పున వెలుగుతున్న కాగడాలు రెంటినీ కంతలోకుండా అవతలికి విసిరి వేశాడు.

ఒక నిమిష కాలం ఖడ్గజీవదత్తు లిద్దరూ ఊపిరి బిగబట్టి ఏం జరుగుతుందా అని ఆత్రపడుతూ గుహ వారగా నిలబడ్డారు.



అవతలి నుంచి ఎలాంటి శబ్దమూ లేదు. మరొక నిమిషం అలాగే నిలబడి చివరకు ఖడ్గవర్మ పెద్దగా నవ్వి, ''జీవా! ఆ దుర్మార్గులు మననుంచి చాలా ఒడుపుగా తప్పించుకు పోవటమేగాక, మనల్ని మూర్ఖుల్ని చేశారు. వాళ్ళు పారిపోయేందుకు అవతల మరేదో గుహామార్గం వున్నదని నాకు తోస్తున్నది.'' అన్నాడు.

''అంతే కావచ్చు. లేకపోతే మనం ఆ కంత నుంచి ఎప్పుడు కిందికి దిగుతామా అని వాళ్ళు ఆయుధాలతో సిద్ధంగానూ వుండొచ్చు!'' అన్నాడు జీవదత్తుడు.

''ఎంతసేపీ జాగ్రత్త? అవతల తెల్లవారబోతున్నది!'' అంటూ ఖడ్గవర్మ కత్తి దూసి కంత దగ్గరకు పోయి, అవతలికి తలపెట్టి చూశారు. అదే సమయంలో జీవదత్తుడు అతడి వెనక నిలబడి ఈటె నొకదాన్ని బలంగా లోపలికి విసిరాడు.

ఖడ్గవర్మకు తాను విసిరి వేసిన కాగడాల వెలుగులో ఒక చిన్న సొరంగ మార్గం తప్ప, మనుషులున్న జాడలే కనిపించ లేదు. జీవదత్తుడు కూడా పరీక్షగా చూసి, ''ఖడ్గా, ఇక మనం ఈ కంతలో నుంచి ఆ సొరంగ మార్గంలోకి దిగవచ్చు. ఆ దుర్మార్గులు అవతల ఎక్కడో దాక్కుని వుంటారు. వాళ్ళు మనకు అనవసరమైన శ్రమ చాలా కలిగించారు. వాళ్ళను ఎలా అయినా సరే వేటాడి తీరవలసిందే!'' అంటూ చప్పున సొరంగ మార్గంలోకి దిగాడు. ఖడ్గవర్మ కూడా అతడికి వెనకగా దిగాడు.

ఆ ఇద్దరికీ ఆ ప్రదేశాన రాళ్ళూ రప్పలూ తప్ప మరేం కనబడలేదు. ఖడ్గవర్మ కత్తి దూసి, ఒక కాగడా చేతికి తీసుకుని సొరంగ మార్గం వెంట బయలుదేరాడు. జీవదత్తుడు సొరంగం గోడలను రహస్య ద్వారం ఎక్కడైన వున్నదేమో తెలుసుకునేందుకు మంత్ర దండంతో పొడిచి చూస్తూ, ఖడ్గవర్మను అనుసరించాడు.

వాళ్ళిద్దరూ సొరంగం మార్గాన రెండు మూడు నిమిషాలు నడిచే సరికి దాని ముఖప్రదేశాన్ని చేరారు. ఎదురుగా వాళ్ళకు విశాల

మైన బయలు ప్రదేశం, అక్కడ శిథిలావస్థలో వున్న చిన్నా పెద్ద భవనాలూ, వాటి పైన మరింత శిథిలావస్థలో వున్న ఎత్తయిన బురుజూ కనిపించాయి.

జీవదత్తుడు ఆ శిథిల భవనాలను చూస్తూనే ఎక్కడ లేని ఆశ్చర్యంతో, "ఖడ్గా, సూర్యోదయ కాలం సమీపిస్తున్నది. మనం గుహలోనుంచి సొరంగంలో పడి, అక్కడినుంచి ఎలాంటి శిథిల నగరాన్ని చేరామో చూశావా?" అన్నాడు.

"ఇది శిథిల నగరమా? ఏముందిక్కడ, కొద్దిపాటి శిథిలమైన భవనాలు తప్ప?" అన్నాడు ఖడ్గవర్మ.

"ఏమో, ఒకప్పుడివే నగరంలోని ముఖ్య భాగమై వుండొచ్చు. మన మాంత్రికుడూ, వాడి జడలభూతం యీ శిథిలాల్లోని ఏదో కలుగులో ఎలుకల్లా దాగి వుంటారు. వాళ్ళను బయటికి లాగటం ఎట్లా?" అన్నాడు జీవదత్తుడు.

జీవదత్తుడు అనుకున్నట్టు మాంత్రికుడూ, వాడి భూతం అక్కడి శిథిల భవనాల్లోని ఏ నేలమాళిగలోనో దాక్కొని లేరు. వాళ్ళు ఆ భవనాలలోని ఒక పెద్ద మంటపంలో, ఉన్నతాసనం మీద కూర్చుని వున్న ఒక పూజారిణి ముందు మోకరిల్లి వున్నారు. వాళ్ళ పక్కన కొందరు భయంకరాకారులు నిలబడి వున్నారు.



పూజారిణి కళ్ళెర్రచేసి, పళ్ళు పట పట కొరికి, "ఒరే, మాంత్రిక భూతాధములారా, యిక లేచి నిలబడండి! మీ యిద్దరి తెలివి తక్కువ వల్ల యీ పవిత్ర నగర రహస్యం కాస్తా నరమానవులకు తెలిసి పోయింది," అన్నది.

"మహాశక్తీ! ఆ మానవులిద్దర్నీ మీ ఆజ్ఞ అయితే యిప్పుడే పట్టి తెచ్చి జడలభూతానికి ఆహారంగా వేస్తాను," అన్నాడు మాంత్రికుడు గడగడ వణికిపోతూ.

పూజారిణి వికటంగా నవ్వి, "ఆహారాన్ని నోటి దగ్గిరకు తెచ్చి పెడితే తప్ప తినలేనంత మందమతి అయిపోయింది, నీ జడలభూతం. మహాభూతం దయవల్ల ఆ మానవులిద్దరూ

మన ప్రయత్నం లేకుండానే, యీ ప్రదేశానికి వచ్చి చేరారు. వాళ్ళెవరో, ఎక్కడి నుంచి వచ్చారో, ఆ వివరాలన్నీ తెలుసుకోకుండా మహాభూతానికి వాళ్ళను బలి చేయటం ప్రమాదం, తెలిసిందా?'' అన్నది చేతిలో వున్న శూలాన్ని ఝళిపిస్తూ.

''ఆఁ, తెలిసింది మహాశక్తీ, తెలిసింది!'' అన్నారు అక్కడ వున్న భృత్యులందరూ ఏకకంఠంగా.

పూజారిణి అందరి కేసీ ఓసారి పరీక్షగా చూసి, ''ఇప్పుడు చెప్పేది జాగ్రత్తగా వినండి. శుంఠల్లారా! ఆ మానవులిద్దరికీ ఎలాంటి హానీ కలిగించకుండా పట్టుకుని నా దగ్గిరకు తీసుకు రావాలి. సూర్యోదయం అయింది. వాళ్ళు ఈ శిథిల భవనాల్లో ఎక్కడ ఏమున్నదో చూసేందుకు బయలు దేరతారు. మీలో కొందరు రహస్యంగా వాళ్ళను అనుసరించి వాళ్ళు ఏం మాట్లాడు కుంటారో వినండి. సూర్యుడు నడి నెత్తి మీదికి వచ్చినప్పటి శుభముహూర్త సమయంలో వాళ్ళను నా దగ్గిరకు తీసుకు రావాలి. ఈ లోపల వాళ్ళను, స్వేచ్ఛగా తిరగనివ్వండి,'' అన్నది.

''చిత్తం, మహాశక్తీ, చిత్తం!'' అంటూ నలుగురు పూజారిణి భృత్యులూ, మాంత్రికుడూ, ఆతడి జడలభూతం పూజారిణికి నమస్కరించి మంటపం నుంచి బయటికి వచ్చారు.

''గురో! వెనక నుంచి పోయి మీద పడి, ఆ మానవులిద్దర్నీ విరుచుకు తింటాను. వాళ్ళ కారణంగా మహాశక్తి పూజారిణి వల్ల నేను చాలా మాటలు పడ్డాను,'' అన్నది జడలభూతం.

''నే నంతకన్న ఎక్కువ అవమానం పాలయాను!'' అంటూ మాంత్రికుడు ఒక పొట్టి కత్తిని బలంగా గుప్పెట బిగించి పట్టుకుని, ''అదుగో, వాళ్ళు పారంగ ద్వారం ముందు కూర్చుని వున్నారు. మనం యిద్దర్నీ హతం చేసి, అరణ్యంలోకి పారిపోదాం. ఊఁ, పద!'' అంటూ చిరుతపులిలా వంగి పొంచి నడుస్తూ ఖడ్గ జీవదత్తుల కేసి బయలు దేరాడు.

—(ఇంకా వుంది)





# యక్షపర్వతం

## 7

[మాంత్రికుణ్ణి, జడలభూతాన్ని తరుముకుంటూపోయిన ఖడ్గ జీవదత్తులకు, గుహలో వాళ్ళు కనిపించలేదు. ఆ ఇద్దరూ ఒక రహస్యద్వారం వెంటపోయి పెద్ద పెద్ద శిథిల భవనాలున్న చోటుచేరారు. ఆ భవనాల్లో వున్న పూజారిణి,, ఖడ్గ జీవదత్తులను బంధించ మని మాంత్రికుణ్ణి ఆజ్ఞాపించింది. వాడు శక్తి తీసుకుని బయలుదేరాడు. తరవాత—]

తమ ముందున్న శిథిల భవనాల కేసి కన్నార్పకుండా చూస్తూ జీవదత్తుడు, అవి ఏ కాలం నాటివై వుండవచ్చు. ఏ కారణం చేత జనశూన్యమై పోయి యిలాంటి శిథిల స్థితికి వచ్చివై: అని ఆలోచించసాగాడు. ఖడ్గవర్మకు మాత్రం ఆ మాంత్రికుణ్ణీ, జడల భూతాన్నీ పట్టుకుని ఎంత త్వరగా హత మార్చి అక్కడి నుంచి బయిటికి పోదామా అని ఆత్రంగా వున్నది.

ఒకటి రెండు నిమిషాల కాలం ఖడ్గ జీవ దత్తులు మౌనంగా ఎవరి ఆలోచనల్లో వారు న్నారు. అంతలో వాళ్ళు కూర్చున్న చోటుకు దాపుల నున్న ఒక రాతి గోడను ఏదో బలమైన వస్తువు గట్టిగా తాకినట్టు శబ్దం అయింది.

ఆ శబ్దం వింటూనే ఖడ్గవర్మ చప్పున లేచి నిలబడి, "జీవా, ఏమిటా శబ్దం? ఆ దుర్మార్గులిద్దరూ మన మీద దొంగదెబ్బ



తీయాలని బయలుదేరి రావటం లేదు గదా?" అన్నాడు.

"ఆ మాంత్రికుడికీ, జడలభూతానికీ పట్టపగలు మన మీద దాడి చేసేటంత ధైర్యం వున్నదనుకోను. అయినా మన జాగ్రత్తలో మనం వుండాలి," అంటూ జీవదత్తుడు గోడ దగ్గిరకు బయలుదేరాడు.

ఖడ్గ జీవదత్తులిద్దరూ శిథిలావస్థలో వున్న రాతి గోడను సమీపించి అవతలికి చూడబోయేంతలో, మాంత్రికుడు ఎగిరి గోడ మీదికి వచ్చి, "నరమానవుల్లారా! మీ యిద్దర్నీ యిప్పుడే మహాభూతానికి బలి చేస్తున్నాను!" అంటూ కత్తిని జీవదత్తుడి కంఠం కేసి విసిరాడు.

ఖడ్గవర్మ తన కత్తితో మాంత్రికుడి కత్తిని పక్కకు నెట్టి, "మాంత్రికకుంకా! ఆ బలి ఏదో చేయక వాచాలత కొద్దీ ముందుగానే మమ్మల్ని హెచ్చరించి ప్రాణం మీదికి తెచ్చుకున్నావు." అంటూ వాడి చెయ్యి పట్టుకుని ముందుకు గుంజాడు. మాంత్రికుడు దభీమంటూ గోడ మీది నుంచి కిందికి పడిపోయాడు.

ఈ సంఘటన జరుగుతున్న సమయంలోనే గోడ అవతల నుంచి కొన్ని కంఠాలు, "ఒరే, వెర్రి మాంత్రికుడా, వాళ్ళను చంపకు! పూజారిణి వాళ్ళను ప్రాణాలతో గదా పట్టుకు రమ్మన్నది," అంటూ అరిచినై.

ఈ లోపల, "బలి! బలి! బలి!" అంటూ జడలభూతం తన గురువుకు పట్టిన గతి కానక ఆవేశోత్సాహంలో గోడ మీదికి కొంత మనుష్యులా గెంతి నిలబడింది.

భూతం కిందికి చూసి తన గురువు నేల కరిచివుండటం గమనించి కీచుమని అరవబోయేంతలో జీవదత్తుడు దాని కాలుపట్టుకుని బలంగా లాగి, అది కిందపడబోయే సమయంలో నడుంమీద గట్టిగా ఒక్క తన్ను తన్ని, "ఖడ్గా, మనం యిక యిక్కడ నిలబడటం క్షేమం కాదు. ఈ ప్రదేశమంతా మాంత్రిక వెధవల పుట్టలావుంది. గోడ అవతల అరుపులు విన్నావా? మనం ఆ కనబడే భవనాల్లో దేనిలోకైనాపోయి వాళ్ళు

మనను చుట్టుముట్టకుండా చూసుకుందాం," అన్నాడు.

ఆ వెంటనే యిద్దరూ శిథిల భవనాల కేసి పరిగెత్తి, ఒక గదిద్వారం ముందు నిలబడి మాంత్రికుల గుంపు గోడదూకి తమ కేసి వస్తున్నారేమో అని వెనక్కు తిరిగి చూశారు. వాళ్ళకు గోడపక్కన రెండు చేతులతో నడుం పట్టుకుని మూలుగుతున్న జడల భూతం, బెణికిన మోచేతిని అటూ యిటూ తిప్పే ప్రయత్నం చేస్తూ, అబ్బా, అబ్బా, అంటున్న మాంత్రికుడూ తప్ప ఎవరూ కనిపించ లేదు.

"గోడ అవతలి నుంచి వచ్చిన హెచ్చరిక విన్నావా? ఆశ్చర్యంగా లేదూ?" అన్నాడు ఖడ్గవర్మ.

"ఆశ్చర్యం ఎందుకు? ఆ దుర్మార్గులు తమ మిత్రులకు చేసిన హెచ్చరిక వల్ల మనకు ఈ శిథిల భవనాల్లో రాణివాసం వెలిగిస్తున్న పూజారిణి, ఆవిడ మనిద్దర్నీ ప్రాణాలతో పట్టుకు రమ్మనటం తెలిసిపోయింది. ఇక మన జాగ్రత్తలో మనం వుండి, ఆ పూజారిణినే పట్టుకుని సంగతి సందర్భాలేమిటో తెలుసుకుందాం!" అన్నాడు జీవదత్తుడు నవ్వుతూ.

ఆ తరవాత యిద్దరూ శత్రువులు తమ మీదికి ఎటునుంచి దాడివస్తారో అని ఒకటి రెండు నిమిషాలు ఊపిరి బిగబట్టి నిలబడ్డారు. కాని ఎక్కడా శత్రువుల అజూకీ లేదు. జడలభూతం, మాంత్రికుడూ మొండిగోడ పక్కన కూర్చుని బాధతో మూలిగే మూలు





గులు తప్ప, ఆ ప్రదేశాన మరెలాంటి శబ్దమూ లేదు.

ఖడ్గవర్మ తాము నిలబడివున్న ద్వారం కేసి ఒకసారి పరీక్షగా చూసి, "జీవా! ఈ బలమైన కొయ్య తలుపులు చూశావా? వీటివెనక భవనాల్లో దేనిలోకో పోయే మార్గం వుండి వుంటుంది. తెరిచి చూద్దామా?" అన్నాడు.

"ఇక అంతకన్న చేసేదేముంది? ఎంత సేపని యిక్కడ నిలబడగలం. ఆ మాంత్రిక భూతాలను వాళ్ళ కర్మకు వదిలి, తతిమ్మా వాళ్ళ వ్యవహారం తేలుద్దాం. తలుపులు మాత్రం జాగ్రత్తగా తెరవాలి. మాంత్రికుల మంద వాటి వెనక మనకోసం ఆయుధాలు పుచ్చుకుని కాపేసుకు వున్నావుండొచ్చు!" అన్నాడు జీవదత్తుడు.

ఖడ్గవర్మ ఒక చేతిలో కత్తి సిద్ధంగా పట్టుకుని రెండవ చేత్తో తలుపులను బలంగా నెట్టాడు. అవి కిర్రుమంటూ కొంచెం కదిలి నవే తప్ప తెరుచుకోలేదు.

"తలుపులకు వెనక గడివేసి వున్న దేమో అన్న అనుమానం మనకెందుక్కలగ లేదు!" అంటూ జీవదత్తు వాటిని బలంగా రెండు చేతులతో పట్టుకుని వెనక్కు నెట్టాడు. తలుపులు కిర్రుమనే రణగొణ ధ్వనులతో ఒక్కసారిగా తెరుచుకున్నవి.

ఖడ్గ జీవదత్తులిద్దరూ గడపదాటి లోపలికి వెళ్ళారు. అది చాలా విశాలమైన గది. అంతా ఖాళీగా వున్నది. అందులో మనుషులు ఎన్నడైనా నివసించిన సూచనలే లేవు. గది అన్ని మూలలా పెద్ద పెద్ద సాలెగూళ్ళూ, గోడల నుంచి వేలాడుతున్న గబ్బిలాలూ వాళ్ళ కంట బడినై. ఆ గది చివర తలుపులు విరిగి, పక్కకు ఒరిగిపోయి వున్న ఒక ద్వారం కనిపించింది.

"ఇక జాగు చేయటం ఎందుకు? నిండా మునిగిం తర్వాత చలేమిటి! పద, ఈ శిథిల భవనాల్లోని అన్ని గదులూ వెతుకుదాం. ఏ గదిలోనైనా మాంత్రికుల నాయకుడు కాలు పూజారిని కనిపించక పోదు!" అన్నాడు జీవదత్తుడు.

ఇద్దరూ జాగ్రత్తగా నడుస్తూ పోయి రెండవ గదిలో ప్రవేశించారు. అది మొదటి దానికన్న బీభత్సంగా వున్నది. వాళ్ళు రావటం చూస్తూనే బాగా బలిసి వున్న పంది కొక్కులు నాలుగైదు 'బొక్, బొక్' అని అరుస్తూ గదిలో అటూ యిటూ పరిగెత్త సాగినై. గద్ద ప్రమాణంలో వున్న గుడ్ల గూబ ఒకటి పై నుంచి కిందికి బాణంలా ఎగిరి వచ్చి వాటిల్లో ఒకదాన్ని పట్టుకుని, అంత ఎత్తులో వున్న ఒక కిటికీ గుండా బైటికి ఎగిరిపోయింది.

"ఆహా, ఏం పందికొక్కులు, ఏం గుడ్ల గూబలు! అన్నీ వాటి మామూలు ప్రమాణా నికి రెండింతలు మూడింతలుగా వున్నవే! ఈ శిథిల భవనాల ప్రాంతాన ఏం తిని యివి యింతగా దుక్క బలిసిపోయినట్టు?" అన్నాడు ఖడ్గవర్మ.

"బహుశా, పూజారిణి వాటికి అప్పు డప్పుడూ తన శిష్యుల్లో దుక్క బలిసిన వాళ్ళను మేతగా వేస్తున్నదేమో!" అంటూ జీవదత్తుడు పెద్దగా నవ్వి. "ఊఁ, పద, ముందు ముందు మరేం వింతలు వున్నవే చూద్దాం!" అన్నాడు.

ఖడ్గ జీవదత్తులు ఆ విధంగా మరికొన్ని గదుల్లో ప్రవేశించారు. కొన్ని చోట్ల మెట్లెక్కి భవనాల్లోని పై భాగాలు చూశారు. వాళ్ళకు ఎక్కడా మనిషిగాని లేక మనిషి నివసిం చిన జాడలున్న ప్రదేశం గాని కనిపించలేదు.

"ఖడ్గా, మాంత్రిక వెధవలు వాళ్ళ నాయకురాలి ఆజ్ఞను మహా తెలివిగా అమలు





చేయు చూస్తున్నట్టున్నది: నా అనుమానం వాళ్ళు మనను రహస్యంగా వెన్నంటి వస్తున్నారని. ఆ పూజారిణి మనను ప్రాణాలతో గదా తన దగ్గరకు పట్టుకు రమ్మన్నది. మనం ఏ భవనంలో ప్రవేశించి, మరే భవన ప్రాంతానికి చేరామో కూడా తెలియటం లేదు!'' అన్నాడు జీవదత్తుడు.

''మనం తిరిగి పోదామంటావా ఏం?'' అని అడిగాడు ఖడ్గవర్మ.

''అంతకన్న చేసేదేముంది? ఈ గది లోంచి మళ్ళీ వెలుగులోకి పోవాలంటే గుహలో నుంచి వున్నదారే శరణ్యం గదా. అక్కడికి చేరగలమేమో చూద్దాం!'' అన్నాడు జీవదత్తుడు.

''ఇక్కడ నుంచి బయటపడి గాయపడిన భూతాన్ని, మాంత్రికుణ్ణి పట్టుకుని నాలుగు తన్ని ఆ పూజారిణి కథ ఏమిటో తెలుసుకుందాం,'' అన్నాడు ఖడ్గవర్మ.

వాళ్ళిద్దరూ అంతకు ముందు తాము వచ్చిన గదిద్వారం కేసి నడిచి, అందులోకి అడుగు పెట్టేంతలో హఠాత్తుగా వాళ్ళ తలల మీద రెండు బలమైన కర్రదెబ్బలు పడినై. ఆ దెబ్బలకు యిద్దరికళ్ళూ బైర్లు కమ్మి కిక్కురుమనకుండా ముందుకు పడిపోయారు. వెంటనే నలుగురు పూజారిణి భృత్యులు ముందుకు వచ్చి, ఆదుర్దాగా వాళ్ల తలలు పరీక్షించి చూశారు. ఎక్కడా నెత్తురు బయటికి చిమ్మిన జాడ కనబడలేదు.

''అదృష్టవంతులం! ఈ యిద్దరు మానవ ప్రాణుల తలలూ పగిలిపోయ్యేమో అనుకున్నాను. వీళ్ళు చస్తే, మహాశక్తి పూజారిణి చేతుల్లో మనం చచ్చేవాళ్ళం.'' అన్నాడొక భృత్యుడు.

''చావకుండా దిమ్మతిరిగి పడేందుకే గదా, దుడ్డుకర్రలకు మెత్తని గొంగళి పీలికలు చుట్టాం. ఎందుకైనా మంచిది వీళ్ళ కాళ్ళూ చేతులూ కట్టి భుజానవేసుకొంది, పూజారిణి దగ్గరకు తీసుకుపోదాం.'' అన్నాడు మరొక భృత్యుడు.

స్పృహతప్పి పడివున్న ఖడ్గ జీవదత్తుల్ని పూజారిణి భృత్యులు కాళ్ళూ చేతులూ



తాళ్ళతో బంధించి భుజాల మీద వేసుకుని అనేక చీకటి గదులు దాటి ఒక విశాలమైన మంటపంలోకి తీసుకుపోయారు.

మంటపం మధ్య మెత్తని తివాసీలు పరిచివున్న ఒక ఉన్నతాసనంమీద పూజారిణి కూర్చుని వున్నది. ఎడంగా కొందరు భృత్యులు చేతులు కట్టుకుని నిలబడి వున్నారు. తన భృత్యులు తెచ్చిన ఖడ్గ జీవదత్తుల కేసి పూజారిణి ఒకసారి ఓర కంటితో చూసి, అంతలోనే గతుక్కుమని కళ్ళింతచేసి, "అరెరె, మహాభూతా! వీళ్ళల్లో ఒకడు మంత్రవేత్తలా కనబడుతున్నాడే!" అన్నది.

"అయివుంటాడు, మహాశక్తి పూజారిణీ! వాడిచేతిలో దండం కూడా వున్నది. ఈ రెండవ వాడి దగ్గర యింత పాతవాటి ఖడ్గం వున్నది." అన్నాడొక భృత్యుడు.

"అవేమయినై? ఎక్కడైనా పారేసి వచ్చారా?" అన్నది పూజారిణి.

"వీళ్ళను పట్టిన చోటునే వదిలివచ్చాం," అన్నాడొక భృత్యుడు.

"పోయి తీసుకురండి, వెధవల్లారా. ఎలాంటి మందమతులు!" అంటూ పూజారిణి కళ్ళెర్ర చేసింది.

పూజారిణి ఆజ్ఞవింటూనే యిద్దరు భృత్యులు పరిగెత్తిపోయి క్షణాల మీద దండాన్ని, కత్తినీ తెచ్చి ఆమె ముందుంచారు. పూజారిణి వాటిని శ్రద్ధగా కొద్ది సేపు పరీక్షించి, "వీటిల్లో ప్రత్యేక శక్తి లేవీ వున్నట్టు కనిపించటం లేదు. వీళ్ళను చీకటి గదిలో బంధించి, వీటిని పక్కనే పడవేసి రండి. తరవాత ఏం జరుగుతుందో చూద్దాం," అన్నది.

యింకా స్పృహ తెలియని స్థితిలోవున్న ఖడ్గ జీవదత్తుల్ని నలుగురు భృత్యులు భుజాలమీద వేసుకుపోయి ఒక చీకటిగదిలో పడవేసి, బయట గడిపెట్టారు.

ఒక పావుగంట తరవాత ఖడ్గ జీవదత్తులకు స్పృహ వచ్చింది. ముందుగా స్పృహ తెలిసిన జీవదత్తుడు ఖడ్గవర్మను తట్టి లేపి, "ఖడ్గా, ఆశ్చర్యం! యింకా మనం బతికే

వున్నాం. మన ఆయుధాలు కూడా మన పక్కనే వున్నవి,'' అన్నాడు.

ఖడ్గవర్మ గది నలుమూలలా ఒకసారి పరీక్షగా చూసి, ''మన నిలా ప్రాణాలతో వదలటంలో పూజారికి ఎత్తుగడ ఏమై వుంటుంది?'' అన్నాడు.

''ఆ పూజారిని పురుగును చూస్తే తప్ప దాని ఎత్తుగడల సంగతి చెప్పటం కష్టం. మనం ముందు బయటపడాలి,'' అంటూ జీవదత్తుడు లేచి నిలబడ్డాడు.

''ఆ దుర్మార్గులు పొంచివుండి మనకు మూంచి బడితపూజ చేశారు. యిక వాళ్ళను దొరికితే మాత్రం ప్రాణాలతో.......''

ఖడ్గవర్మ మాట పూర్తి చేసేలోపలే గోడ అవతలి నుంచి సింహం గర్జించిన ధ్వని వినబడింది. అది వింటూనే ఖడ్గవర్మ ఎగిరి నిలబడి, ''ఆ వెధవలు మనమీద సింహాన్ని ప్రయోగించాలని చూస్తున్నారా ఏం?'' అంటూ నవ్వాడు.

''ఇదీ ఒకందుకు మంచిదే. మనం ఆ సింహాన్ని వాళ్ళమీదనే ప్రయోగించి, యీ శిథిల భవనప్రాంతాలను బీభత్సం చేద్దాం!'' అంటూ జీవదత్తుడు తనదండంతో బలంగా గోడను ఒక పోటుపొడిచాడు. గోడలో కొంతభాగం పిడుగుదెబ్బ తిన్నట్టు పెద్ద శబ్దంతో విరిగి వెనక్కు పడిపోయింది. పక్కగదిలోవున్న సింహం బెదిరి చిన్నగా గర్జిస్తూ గోడ వారగాపోయి నిలబడింది.

''సింహరాజా, నీకు విముక్తి, ఆహారం కూడా దొరకబోతున్నది,'' అంటూ జీవదత్తుడు తామున్న గదితలుపులను దండంతో బలంగా రెండు పోట్లుపొడిచాడు. తలుపులు పెళపెళ మంటూ విరిగి దభీమంటూ ముందుకు పడిపోయినై.

ఆ మరుక్షణం పది పన్నెండు మంది పూజారికి భృత్యులు, ''బందీలు పారిపోతున్నారు, పట్టుకోండి!'' అని అరుస్తూ ముందుకు వచ్చారు. వెంటనే జీవదత్తుడు సింహాని కేసి పరిగత్తి, దాన్ని దండంతో పూజారికి భృత్యుల కేసి తరిమాడు. అది గర్జిస్తూపోయి వాళ్ళమీద పడింది.

—(ఇంకావుంది)





# యక్షపర్వతం

## 8

[మాంత్రికుణ్ణి, జడలభూతాన్ని నడుం విరిగేలా తన్ని కింద పడవేసి, ఖడ్గజీవదత్తులు శిథిలభవనాల్లోకి పోయారు. అక్కడ వాళ్ళను పూజారిణి భృత్యులు పట్టుకున్నారు. పూజారిణి ఆ యిద్దర్నీ చీకటిగదిలో బంధించమన్నది. ఖడ్గజీవదత్తులు తమ పక్క గదిలో వున్న సింహాన్ని అక్కడికి వచ్చిన పూజారిణి భృత్యుల పైకి ఉసికొల్పారు. తరవాత—]

ఆకలిగొని వున్న సింహం భయంకరంగా గర్జిస్తూ వచ్చి మీద పడగానే, పూజారిణి భృత్యులు భయంతో వణికిపోయి, చావు కేకలు పెడుతూ సింహానికి అందకుండా పారిపోవాలని చూశారు. కాని సింహం వాళ్ళ మధ్యపడి నోటికి అందినవాడినల్లా పట్టి చిదిలించసాగింది.

ఖడ్గ జీవదత్తులు కూలిపోయిన గది ద్వారం వద్ద నిలబడి పెద్దగా నవ్వుతూ, "ఒరే, పూజారిణి శిష్యుల్లారా! సింహానికి మీరు నాలుగైదు రోజులుగా ఆహారం వేసినట్టు లేదు. అందుకే అది అంతగా రెచ్చిపోయి మీ ప్రాణాలు తీస్తున్నది. మీలో ఒకరు ముందుకు వచ్చి దానికి ఆహారం కండి. అప్పుడు తతిమ్మా వాళ్ళయినా బతుకుతారు." అన్నారు.

పూజారిణి భృత్యులు యీ మాట లేవీ వినిపించుకునే స్థితిలో లేరు. వాళ్ళల్లో



నలుగురైదుగురు అనేరికే సింహం పంజా దెబ్బలకు బాగా గాయపడి నేల కొరిగారు. మరొకడు దాని నోటికి చిక్కి లబలబలాడు తున్నాడు. గాయపడకుండా ఇక మిగిలిన అయిదారుగురూ పక్కన వున్న పదిపన్నెం డడుగుల శిథిలమైన గోడ మీది కెక్కి, కూర్చుని ప్రాణభయంతో నిలువెల్లా వణికి పోతున్నారు.

సింహం ఒకసారి చుట్టూ కలయ చూసింది. దానికి తాను గాయపరిచిన మనుషుల్లో ఎవర్నీ తినాలని వున్నట్టు లేదు. ఆ ప్రదేశం నుంచి త్వరగా పారిపోయి, ఏ అరణ్యమో చేరాలన్నట్టుగా వుంది దాని వాలకం.

జీవదత్తుడు తన చేతిలోని దండాన్ని సింహం కేసి గురి చేసి, "సింహరాజా! ఇంతమంది చూస్తూండగా ఆహారం తినటం వల్ల దిష్టి తగులుతుందేమో అని భయ పడుతున్నావా?" అంటూ నవ్వి, "అలా అయితే యిదిగో, ఈ పక్కనే భవనం కిందికిపోయే మెట్లున్నవి. ఆ దారినపోయి యీ శిథిలభవనాల్లో నుంచి బయటపడి, నది దాటి అరణ్యం చేరు!" అంటూ సింహం కేసి రెండడుగులు వేసి, దాన్ని మెట్లున్న వైపుకు మళ్ళించేందుకు దండాన్ని ముందుకు చాచి ఝళిపించాడు.

సింహం కళ్ళెంత చేసి, పెద్దగా నోరు తెరిచి చెవులు దిబ్బళ్ళు పడేట్టు పెద్దగా గర్జించి, జీవదత్తుడి కేసి దూకబోయింది. అది ముందు రెండు కాళ్ళూ ఎత్తి, వెనక కాళ్ళ మీద నిలబడి కుప్పించి దూకబోయే సమయంలో, జీవదత్తుడు దాని పొట్ట కింద దండాన్ని ఆనించి బలంగా పక్కకు తోశాడు. ఆ ఊపుకు సింహం నేల మీద పడి దొర్లు కుంటూ పోయి మెట్లున్న గది ద్వారానికి అడ్డంగా పడింది.

"సింహరాజా, యిక లేచి నిలబడు! పూజారిణి తన బంట్లతో స్వయంగా యిక్క డికి వచ్చే ముందే త్వరగా మెట్లు దిగి పారిపో," అన్నాడు జీవదత్తుడు, దండం ఎత్తి సింహం కేసి నడుస్తూ.



మొండి గోడ మీద కూర్చుని యిదంతా చూస్తున్న పూజారిణి భృత్యులకు జీవదత్తుడు సింహాన్ని ఎదుర్కొన్న తీరూ, దాన్ని ఒక్క దండం దెబ్బతో నాలుగైదు పల్టీలు కొట్టించిన నేర్పూ ఎంతో ఆశ్చర్యాన్నీ, అబ్బురపాటునూ కలిగించింది. వాళ్ళల్లో ఒకడు రెండు చేతులా ఎత్తి జీవదత్తుడికి నమస్కరిస్తూ, "మహామాంత్రిక శిరోమణీ, నమస్కారం! మీ మంత్రశక్తి మామూలు మనుషులకు అలవడేది కాదు. ఈ మహాశక్తి పూజారిణిని హతం చేసి తమరే యీ శిథిలనగరాన్ని ఎందుకు ఏలగూడదు? అప్పుడు మేమంతా మీ శిష్యులమై మీకు సేవలు చేస్తూ హాయిగా బతుకుతాము!" అన్నాడు.

వాడు మాట ముగించే లోపలే పక్కన వున్న అతడి తోటి వాళ్ళు, "గురుద్రోహం! గురుద్రోహం!" అని కేకలు పెడుతూ వాడి మీద కలియబడ్డారు. మొండి గోడ మీద కుస్తీపట్లు ప్రారంభమయినై. ఆ రద్దీలో గోడ మీద కాలిపట్లు తప్పి యిద్దరు భృత్యులు దభీమంటూ కిందపడ్డారు. మెట్ల కేసి దిగబోతున్న సింహం ఒక్కసారిగా అదురుకుని తల తిప్పి చూసి, చిన్నగా గర్జిస్తూ వాళ్ళ కేసి రాబోయింది.

జీవదత్తుడు దండం పైకెత్తి సింహాన్ని అదిలిస్తూ, "ఇక మెట్లు దిగి నీ దారిన నువ్వు పో. అనవసరంగా పూజారిణి శిష్యుల పోట్లాటలో తల దూర్చి చిక్కుల పాల పడకు." అన్నాడు.

సింహానికి అసరికి జీవదత్తుడి చేతిలోని దండం అంటే భయం పట్టుకున్నది. ఇంత వరకు రెండుసార్లు దాని దెబ్బతిని వుండటంతో అది చిన్నగా గుర్రుమంటూ తిరిగి తిరిగి చూస్తూ, మెట్లున్న గది ద్వారం దాటి పోయింది.

అప్పటివరకూ జరుగుతున్నదంతా మౌనంగా చూస్తూ వున్న ఖడ్గవర్మ, "జీవా! ఇక మనం మాత్రం యిక్కడెందుకు? పూజారిణి శిష్యులు సిగపట్లు పట్టుకుని కిందా మీదా పడుతున్నారు. అప్పుడు



మనను అడ్డగించేవాళ్లెవరూ లేరు. ఈ దిక్కుమాలిన శిథిల భవనాలను వదిలి తిరిగి అరణ్యం చేరుదాం," అన్నాడు.

"అలాగే చేద్దాం. మనం కూడా సింహం వెళ్ళిన దారినే పోయి, మనం యిక్కడికి వచ్చిన గుహ ద్వారాన్ని చేరగలమేమో చూద్దాం." అంటూ జీవదత్తుడు బయలు దేరాడు.

ఆ శిథిలభవన ప్రాంతాల్లో యిక తమను ఎదిరించే వాళ్ళు ఎవరూ లేరనుకోవటంలో ఖడ్గవర్మ పెద్ద పొరబాటు చేశాడు. అతడూ, జీవదత్తుడూ బంధ విముక్తులు కావటం, సింహం పెద్దగా గర్జిస్తూ పూజారిణి భృత్యుల్లో కొందరిని గాయపరచటం అంతా పూజారిణికి బతికి బయటపడి పారిపోయి వచ్చిన ఒక భృత్యుడి ద్వారా తెలిసింది.

ఆ వార్త వింటూనే పూజారిణి కళ్ళెర్ర చేసి, చేతిలోని శూలాన్ని ఝుళిపిస్తూ, "మహాభూతా! ఇదేమి వింత? ముసలి పూజారి అంత వాణ్ణి నా మంత్ర బలంతో ఓడించి చీకటి కొట్లో బంధించానే! అటువంటి నా మీదికే యిద్దరు మానవులు దండెత్తి రావటమా? నా రాజ్యంలోనే బొరబడి నా శిష్యుల్ని కొట్టి గాయపరిచి నన్ను అవమానించటమా! ఇది సహించను. ఒరే, శిష్యాధముల్లారా! బయలుదేరి, ఆ ఇద్దరు మానవ పురుగులూ ఎక్కడున్నారో చూడండి." అన్నది.

ఖడ్గ జీవదత్తులు సింహాన్ని వదల గొట్టిన తీరూ, అంతకు ముందు మాంత్రికుణ్ణీ, జడలభూతాన్నీ పెట్టిన బాధలూ చూసిన శిష్యుల్లో యిద్దరు గడగడలాడి పోతూ, "మహాశక్తి పూజారిణీ! ఆ మానవులిద్దరూ మహాసత్వుల్లాగా, గొప్ప మంత్రవేత్తల్లాగా కనబడుతున్నారు. వాళ్ళు మన అస్థాన మాంత్రికుణ్ణీ, జడలభూతాన్నీ..."

భృత్యులు మాట ముగించే లోపలే పూజారిణి వాళ్ళల్లో ఒకణ్ణి శూలంతో వెన్ను మీద పొడిచి, "నోరు ముయ్యండి, పారుబోతు వెధవల్లారా! వాళ్ళిద్దర్నీ యిప్పుడే పట్టి మహాభూతానికి బలి చేయబోతున్నాను.

ముందుంది దారి తియ్యండి!" అన్నది పళ్ళు కొరుకుతూ.

భృత్యులు ప్రాణం బితుకు బితుకు మంటూండగా ముందు బయలుదేరారు. వాళ్ళందరికన్నా కొంచెం ముందుగా మాంత్రికుడూ, వాడి జడలభూతం పెద్ద పెద్ద అంగలు వేస్తూ నడవసాగారు.

"గురో! వాళ్ళిద్దర్నీ పట్టుకుని ఒక్కసారిగా విరుచుకు తింటాను." అన్నది జడలభూతం మాంత్రికుడితో.

"అలాంటి పొరపాటు పని చెయ్యకుమా, శిష్యా! మన శిథిల నగరంలో జొరబడిన ఆ యిద్దరు క్షుద్రకుంకలూ, పూజారిణీ ఒకళ్ళకొకళ్ళు ఎదురుపడితే, మన పూజారిణే ఓడిపోతుందన్న నమ్మకం నాక్కలుగుతున్నది. అప్పుడు మనమే యీ శిథిలనగరానికి రాజూ, మంత్రీ అయిపోతాం. ముసలి మాంత్రికుణ్ణి చీకటి కొట్టులో నుంచి బయటికి తీసి, అతడి దగ్గిర మరికొన్ని మంత్ర విద్యలు నేర్చుకుందాం," అన్నాడు మాంత్రికుడు చిన్న గొంతుతో.

జడలభూతం ఆ మాటలకు ఎంతో సంతోషించి, "రాజూ, మంత్రీ! బావున్నది గురో." అంటూ వెనక్కు తిరిగి చూసింది.

పూజారిణీ, ఆమె తతిమ్మా శిష్యులూ చాలా దూరాన వున్నారు. పూజారిణి తన



భృత్యుల్ని శిథిల భవనాలన్నీ నగరం ప్రవేశించిన యువకులిద్దరి కోసం గాలించమని ఆజ్ఞాపించింది. కాని ఆ సమయంలో ఖడ్గజీవదత్తులు శిథిల భవనాల్లోని మరొక ప్రాంతం చేరి, అక్కడి నుంచి బయటపడి, తిరిగి అరణ్యం చేరేందుకు మార్గం ఏమైనా కనబడుతుందా అని చూడసాగారు. వాళ్ళు సొరంగ మార్గాన వచ్చిన దారి మాత్రం కనుక్కోలేకపోయారు.

"ఖడ్గా, మనం లోపలికి వచ్చిన దారి వెంట బయటపడే అవకాశం కనబడటం లేదు. పూజారిణి శిష్యుల్లో ఎవణ్ణయినా ఒంటరిగా దొరక పుచ్చుకుని, వాడి ద్వారా ఆ మార్గం ఎక్కడున్నదో తెలుసుకోవటం



తప్ప మరో ఉపాయం లేదు," అన్నాడు జీవదత్తుడు.

"ఆ శిమ్మల మూక నుంచి కూడా మనం చాలా దూరం వచ్చినట్టుంది. సింహం ఏమైనట్టు? అది అరణ్యం చేరినట్టేనా?" అన్నాడు ఖడ్గవర్మ.

"అది మనలాగే యిక్కడ చిక్కుపడినట్టుంది. మధ్య మధ్య దాని గర్జనలు వినబడటం లేదా, నీకు?" అంటూ జీవదత్తుడు ఒక శిథిల భవనంలోని గది లోపలికి తొంగి చూసి, "ఖడ్గా, ఇటురా! అమ్మ, దుర్మార్గులు! దారేపోయే వర్తకుల్నీ, ప్రయాణీకుల్నీ దోచి ఎన్ని ధాన్యం బస్తాలు యీ గదిలో దాచారో చూడు!" అన్నాడు.

ఖడ్గవర్మ కూడా గదిలోకి తొంగి చూశాడు. అతడికి గదిలో ఎత్తుగా పేర్చిన ధాన్యం బస్తాలు కనిపించినై. వాటిలో కొన్నిటి కుట్లు పిగిలి, వడ్లూ, జొన్నలూ, గోధుమలూ కిందికి కారి పోగులుగా పడివున్నవి.

"జడలభూతాన్ని ముందు ప్రయోగించి జనాన్ని భయపెట్టి మాంత్రికుడూ, అతడి స్నేహితులూ యీ విధంగా దారే పోయేవాళ్ల నుంచి తమ కవసరం అయిన తినుబండారాలు అపహరిస్తున్నారన్నమాట! మొత్తం మీద పూజారిణి తెలివి గలది లాగే కనిపిస్తున్నది. ఈ ఎత్తుగడలన్నీ దాని ఆలోచనలే అయి వుంటాయి," అన్నాడు ఖడ్గవర్మ.

"ఈ ధాన్యంలో ఒక్క గింజ కూడా పూజారిణి ముఠా నోటికి అందకుండా చేస్తే ఎలా వుంటుందంటావు? అప్పుడు కడుపు కాలి, వాళ్ళు బతుకు తెరువు కోసం యీ శిథిల భవనాల నుంచి బయటికి వస్తారు," అన్నాడు జీవదత్తుడు.

"మన ఇద్దరికీ ఒకే ఆలోచన కలిగిందే!" అంటూ ఖడ్గవర్మ నవ్వి, దుస్తుల్లో నుంచి చెకుముకిరాయి తీసి కొట్టి దూది ముట్టుకునేలా చేసి, అది కాస్త మంట కాగానే గదిలోని ధాన్యం బస్తాలలో ఒక దానికి అంటించాడు.

ఖడ్గ జీవదత్తులు గది ముందు నిలబడి క్రమంగా మంట పెద్దదై, ధాన్యం బస్తాలు

ఒకటొకటిగా అంటుకోవటం చూడ సాగారు. నాలుగైదు నిమిషాల్లో గదిలో పెద్ద మంట లేచింది. ధాన్యం కాలి టపటప మంటూ కొంత పేలాలుగా మారి, గాలికి లేచి వాకిటి వరకూ వచ్చి పడసాగినై.

"ఈ పేలాలు తిని యీ దుర్మార్గులు మరి కొంతకాలం యీ శిథిల భవనాలను అంటి పెట్టుకుని వుండే అవకాశం వుంది. ఏం చేయటం?" అన్నాడు ఖడ్గవర్మ.

"కొంచెం ఆగు. మంటలు మరి కాస్త లేస్తే అంతా మాడి, బుగ్గి బూడిదా అయి పోతుంది. కాని, అసలు ప్రమాదం, యీ మంటలు చూసి పూజారివీ, దాని శిష్యగణం యిక్కడికి వస్తారు! అప్పుడు..."

జీవదత్తుడు మాట ముగించే లోపలే ధాన్యం బస్తాలు కాలుతున్న గది పక్కగల మరో గది నుంచి ఏదో మానవ కంఠం ఆర్తనాదాలు చేయటం వినిపించింది.

"ఖడ్గా, ఈ పక్క గది తలుపులు మూసి వున్నవి. లోపలి నుంచి ఎవరో కేకలు పెడుతున్నారు!" అంటూ జీవదత్తుడు గదిని సమీపించి, తలుపులను బలంగా నెట్టి చూశాడు.

ఖడ్గవర్మ అతడి దగ్గరకు పోయి నవ్వుతూ, "జీవా! హడావిడిలో నువ్వు తలుపులకు బయట వేసి వున్న అంత పెద్ద తాళాన్ని కూడా చూసినట్టు లేదు! నీ మంత్ర దండంతో తలుపులు విరగ్గొట్టు," అన్నాడు.

ఆ వెంటనే జీవదత్తుడు దండం ఎత్తి తలుపులకు వేసి వున్న తాళం మీద బలంగా కొట్టాడు. తాళం పగిలి కింద పడిపోయింది. గొళ్ళెం పక్కకు లాగి తలుపులను వెనక్కు నెట్టాడు ఖడ్గవర్మ.

గదిలో అంతగా చీకటి లేదు. గోడపైన అంత ఎత్తులో వున్న ఒక చిన్న కిటికీ నుంచి లోపలికి వెలుగు వచ్చి పడుతున్నది. ఆ వెలుగులో వాళ్ళకు గోడలో వున్న ఇనప మేకులకు, గొలుసుతో కట్టబడి వున్న వృద్ధు డొకడు కనిపించాడు. అతడు అజాను బాహువు. బక్కచిక్కి వున్నాడు. పొడవాటి తెల్ల గడ్డం గాలికి రెపరెపలాడుతున్నది.

—(ఇంకా వుంది)





# యక్షపర్వతం

## 9

[ ఖడ్గ జీవదత్తులు సింహాన్ని మరొక శిధిల భవనంలోకి తరిమి, ఆ ప్రాంతం నుంచి బయటపడేందుకు దారి వెతుక్కుంటూ బయలుదేరారు. వాళ్ళకు ఒక గదిలో చాలా ధాన్యం బస్తాలు కనిపించినై. వాటికి వాళ్ళు నిప్పుపెట్టారు. అంతలో పక్కగది నుంచి అరుపులు వినిపించినై. వాళ్ళు వెళ్ళి చూడగా ఒక వృద్ధుడు కనిపించాడు. తరవాత—]

ఖడ్గ జీవదత్తుల్ని చూస్తూనే ఆ వృద్ధుడు, "ఎవరు మీరు? ఆ దొంగ పూజారిణి శిష్యుల్లా లేరే? ఎవరైతే నేం, నన్ను రక్షించండి. పక్క గదిలో ధాన్యం కాలిపోతున్నదిలా వుంది! ఆ వేడికి నేను బంధించబడి వున్న గోడ వేడెక్కి నా శరీరం కాలుతున్నది," అన్నాడు.

"కొంచెం వుంటే మొత్తం గది కప్పే, లోపలికి కూలి పడుతుంది!" అంటూ జీవదత్తుడు వృద్ధుణ్ణి సమీపించి, దండంతో అతడికి కట్టి వున్న ఇనపగొలుసులను విరగ్గొట్టి, అతణ్ణి బయటికి తీసుకువచ్చాడు.

వృద్ధుడు ఆత్రంగా చుట్టూ ఓ మారు కలయ చూసి, "ఎన్నాళ్ళ తర్వాత నాకు తిరిగి స్వేచ్ఛ కలిగింది! ఆ దొంగ పూజారిణి యింకా యీ శిధిలనగరంలో అధికారం చెలాయిస్తున్నదా? మీ రెవరు?" అని అడిగాడు.



"మే మెవరం అయితేనేం, నువు చెప్పే ఆ పూజారిణి శిష్యులం మాత్రం కాదు. వింధ్యపర్వత ప్రాంతాలకు ఒక గొప్ప పని మీద బయలుదేరి దారిలో చిన్నా పెద్ద ఆటంకాల్లో, ఆపదల్లో చిక్కుకుని, యిక్కడికి చేరాం. నీ మాటలు వింటూంటే నువ్వే యిక్కడి అసలు పూజారివనీ, యిప్పుడు గద్దె ఎక్కి కూర్చున్న పూజారిణే నిన్నీ చీకటి గదిలో బంధించిందనీ తెలుస్తున్నది, అవునా?" అని ప్రశ్నించాడు జీవదత్తుడు.

"జరిగిందదే! ఆ నీచురాలు యిప్పటికి యిరవైఏళ్ళ క్రితం యింత బాలికగా నాకు అరణ్యంలో దొరికింది. తెచ్చి సాకాను. ఎన్నో విద్యలూ – మంత్రశాస్త్రం అంతా బోధించాను. కాని, ఏ మాత్రం కృతజ్ఞత లేకుండా రెండేళ్ళక్రితం, ఒక భయంకర కాళరాత్రి వేళ, పెద్ద ఉరుములూ, మెరుపులతో కుండపోతగా వర్షం కురుస్తున్న సమయంలో...."

జీవదత్తుడు వృద్ధ మంత్రవేత్త మాటలకు అడ్డు వచ్చి, "మీ గత చరిత్ర అంతా వినే తీరుబాటు మాకు లేదు. పూజారిణి బారి నుంచి బయటపడి అరణ్యం చేరాలని చూస్తున్నాం. ఆవిడ మమ్మల్ని పట్టుకునేందుకు శిష్యగణంతో బయలుదేరే వుంటుంది! మీ రిక్కడే వుంటారా లేక యీ కూలిపోతున్న కొంపల్లో నుంచి విశాల ప్రపంచంలోకి పోయే మార్గం చూపి, మా వెంట అరణ్యం చేరుతారా? ముందు ఆ సంగతి చెప్పండి," అన్నాడు.

"పగ తీర్చుకోకుండా – ఆ దొంగ పూజారిణిని హతం చెయ్యకుండా నే నిక్కణ్ణుంచి కదలను. నన్ను యీ స్థితిలో చూస్తే, నా పాత శిష్యులు కొందరు తప్పక నా పక్షం అవుతారు. వాళ్ళ సాయంతో ఆ కృతఘ్నురాల్ని పట్టుకుని ముక్కలు ముక్కలుగా నరికి కాకులకూ, గద్దలకూ ఆహారంగా వేస్తాను," అన్నాడు ముసలి మాంత్రికుడు పళ్ళు కొరుకుతూ.

ఆ మాటలకు ఖడ్గవర్మ అయిష్టంగా తలాడిస్తూ, "జీవా! ఇక మన దారిన మనం

పోవటం మంచిది. ఈ మాంత్రికుల్నీ, పూజారుల్నీ ఒకళ్ళగొంతు ఒకళ్ళు కోసుకోనీ!" అంటూ బయలుదేరాడు.

జీవదత్తుడు అతడితోబాటు కదిలి వృద్ధ మాంత్రికుడితో, "ఆ దొంగ పూజారిణిని పట్టుకుని ముక్కలుగా నరికి కాకులకూ, గద్దలకూ వేయటం ఎందుకు! ఈ ప్రాంతాల ఎక్కడో ఆకలిగొన్న సింహం ఒకటి తిరుగుతున్నది. దానికి వెయ్యి. ఇంత పుణ్యమైనా నీకు దక్కుతుంది," అన్నాడు.

వృద్ధ మాంత్రికుడు ఏదో మాట్టాడబోయాడు. కాని, అంతలో ఒక శిథిలభవనం వెనక నుంచి పూజారిణి మాంత్రికుడూ, జడలభూతంతోపాటు, అయిదారు-గురు శిష్యుల్ని వెంట బెట్టుకుని హఠాత్తుగా ముందుకు వచ్చి, ముసలి మాంత్రికుణ్ణీ, ఖడ్గ జీవదత్తుల్నీ చూసి, కళ్ళెర్ర చేసి, చేతిలోని శూలాన్ని పైకెత్తి, "ఆహాఁ, ముసలి వెధవ చీకటికొట్లో నుంచి బయటపడ్డాడా? దొంగల్లా నగరం ప్రవేశించిన మనుషులు కూడా యిక్కడే వున్నారు! అందర్నీ పట్టుకుని మహా భూతానికి బలి చేస్తాను," అంటూ ముందుకు రాసాగింది.

ఖడ్గవర్మ చప్పున నాలుగడుగులు వెనక్కు వేసి బాణం పూజారిణి కేసి ఎక్కుపెట్టి, "పూజారిణీ! మరొక్క అడుగు ముందుకు వేశావంటే, యీ వాడి అంబు నీ కంఠాన్ని



ఛేదిస్తుంది, జాగ్రత్త!" అని హెచ్చరించాడు.

ఆ హెచ్చరిక వింటూనే పూజారిణి వున్న చోటునే కదలకుండా నిలబడింది. మాంత్రికుడూ, జడలభూతం కొంచెం పక్కగా వెళ్ళి నిలబడ్డారు. ఒకటి రెండుక్షణాల నిశ్శబ్దం తరవాత పూజారిణి భృత్యులో ఒకడు తన చేతగల శూలాన్ని గాలిలో గిరగిరా తిప్పి, "మహాశక్తి పూజారిణీ! ఇంకా ఆలశ్యం ఎందుకు? ముసలి పూజారినీ, ఈ కొత్త వాళ్ళిద్దర్నీ నీ మంత్రశక్తితో భస్మం చేసెయ్యి," అన్నాడు.

"ఉహుఁ, అలా భస్మం చేయదలచుకోలేదు. ముగ్గుర్నీ ప్రాణాలతో పట్టుకుని మహా




భూతానికి బలి పెట్టాలి,'' అంటూ పూజారిణి పక్కకు తిరిగి మాంత్రికుడూ, జడల భూతాలతో, ''ఒరే, అలా నిలబడి నేల చూపులు చూస్తారేం? ముందు ఆ యువకు లిద్దర్నీ పట్టి బంధించండి. ఈలోపల ముసలి మాంత్రికుడి సంగతి నేను చూస్తాను,'' అన్నది పళ్ళు కొరుకుతూ.

ఆ మాటలకు ఖడ్గ జీవదత్తులు పెద్దగా నవ్వారు. జీవదత్తుడు జడలభూతం కేసి ఒకడుగు వేసి, ''ఏరా, వికృత భూతం! నువ్వు ఆడభూతానివో, మగభూతానివో కూడా మాకు తెలియటం లేదు. ఏం, మీ గురువు ఆజ్ఞాపించినట్టు, మమ్మల్ని పట్టుకోక, అలా నిలబడి వున్నావేం?'' అని అడిగాడు.

జడలభూతం ఆ మాటలకు కొంచెంగా బెదిరి మాంత్రికుడికి దగ్గరగా పోయి నిలబడి, ''గురో, యిప్పుడేం చేయటం? ఆ ఇద్దర్నీ పట్టుకుని విరుచుకు తినేదా?'' అన్నది.

''తప్పురా, శిష్యా. తప్పు! మహాశక్తి పూజారిణి వాళ్ళను ప్రాణాలతో పట్టుకుని మహా భూతానికి ఆహారం చేయబోతున్నది, మనం తొందర పడకూడదు!'' అన్నాడు.

మాంత్రికుడు యిలా అనగానే పూజారిణి కళ్ళెర్రచేసి, శూలం ఎత్తి అతడి కేసి వెళ్ళబోయింది. ఖడ్గవర్మ వెంటనే, ''ఆగు, పూజారిణీ! నా హెచ్చరిక గుర్తుందా? కదిలావంటే నీ కంఠంలో యీ బాణం వచ్చి గుచ్చుకుంటుంది. కదలకుండా అక్కడే నిలబడి నీ మంత్రశక్తితో, నీ శత్రువులను హతమార్చు. మా అభ్యంతరం ఏమీలేదు,'' అన్నాడు.

అప్పటివరకూ జరుగుతున్న దంతా కన్నార్పకుండా చూస్తున్న వృద్ధ పూజారి పెద్దగా గొంతెత్తి, ''ఇప్పుడా గురుద్రోహిణికి ఎలాంటి మంత్రశక్తులూ లేవు. లోగడ నేను దాని కిచ్చిన మంత్ర బలాన్నంతా ఉపసంహరించేశాను,'' అన్నాడు.

''అబద్ధం. ఈ ముసలివెధవ మాటలు నమ్మకండిరా, శిష్యుల్లారా! చూడండి, యిప్పుడే వాణ్ణి నా శూలానికి గుచ్చి పైకెత్తు

తాను," అంటూ పూజారిణి అరిచి, వృద్ధ పూజారి కేసి కదిలింది.

"ఆగు!" అంటూ ఖడ్గవర్మ బాణాన్ని ఆమె శూలం పట్టుకున్న చేతికి గురిచేసి కొట్టాడు. పూజారిణి "అబ్బా!" అంటూ బాధతో ఒక్కసారి కేక పెట్టింది. శూలం ఆమె చేతినుంచి జారి కిందబడిపోయింది.

"పూజారిణీ, నువ్వు నా హెచ్చరికలను పాటించనందున, తప్పనిసరై బాణం నీమీద ప్రయోగించవలసి వచ్చింది. ఇకనైనా జాగ్రత్త!" అన్నాడు ఖడ్గవర్మ.

శూలం పూజారిణి చేతి నుంచి జారి పడటం చూస్తూనే, ఆమె శిష్యుల్లో యిద్దరు ఎగిరి గంతులేస్తూ, "మహా పవిత్రమైన త్రిశూలాన్ని నేలకు జార్చి పూజారిణి దాన్ని అపవిత్ర పరిచింది. ఇక మా గురువు వృద్ధ పూజారే!" అంటూ కేకలు ప్రారంభించారు.

"ఖడ్గా, మనం దారితప్పి ఎలాంటి మందమతుల మధ్యకు వచ్చి పడ్డాం. ఈ పాడుబడ్డ నగరంలో వీళ్ళంతా పడివుండటమే అందరికీ మేలు. వీళ్ళు యిక్కణ్ణించి బయిటికి వచ్చి మామూలు జనంలో కలిశారో, వాళ్ళూ బుద్ధిహీనులైపోతారు," అన్నాడు జీవదత్తుడు.

తన పక్షానికి యిద్దరు పూజారిణి శిష్యులు రాగానే వృద్ధపూజారి పరమానందంచెంది, "ఆహాహాఁ, మహాభూతా! ఎన్నాళ్ళ



కెన్నాళ్ళకు నా శిష్యగణం సత్యం తెలుసుకుని, అంధకారం నుంచి వెలుగులోకి వచ్చేలా చేశావు! ఇక నీకు గతకాలంలో లాగే ప్రాణులబలిని యితోధికంగా చేస్తాను!" అన్నాడు.

"ఖడ్గా, ఈ ముసలిపీనుగా క్రౌర్యంలో పూజారిణికి ఏ మాత్రం తీసిపోయేవాడిలా లేడు," అని జీవదత్తుడు అక్కడ చేరిన వాళ్ళందరినీ ఉద్దేశించి, "మీ నాయకత్వపు తగాదాల్లో మేము ఎవరిపక్షానా కల్పించుకోబోవటం లేదు. మీలో ఎవరైనా ఒకరు మా వెంట వచ్చి, యీ శిథిలగరాన్నుంచి బయట వున్న అరణ్యంలోకి పోయేమార్గం చూపండి!" అన్నాడు.



"మీరు యిక్కడ నుంచి పారిపోయేందుకు మార్గం చూపటమా? ఎలాంటి కోరిక! ఆగండి, యిప్పుడే మిమ్మల్నిద్దర్నీ నా శూలానికి గుచ్చి, మహాభూతం ముందు పడవేయబోతున్నాను," అంటూ పూజారిణి వంగి కింద పడివున్న శూలాన్ని చేతిలోకి తీసుకోబోయింది.

"ఒకసారి అనుభవం అయినా, యీ బుద్ధిహీనురాలికి జ్ఞానోదయం అయినట్టులేదు," అంటూ ఖడ్గవర్మ మరొక బాణాన్ని పూజారిణి చేతికేసి గురిచేసి వదలబోయేంతలో జీవదత్తుడు అతడి చేయిపట్టుకుని వారించాడు.

"ఖడ్గా, ఎంత దుర్మార్గురాలైనా ఆడదాన్ని హింసించటం, చంపటం మనం చేయరానిపనుల్లో ఒకటి. ఆ వృద్ధ పూజారినీ, ఆవిణ్ణీ యీ శిధిలనగర సామ్రాజ్యం కోసం ఒకరి గొంతు లొకరు కోసుకోనీ, మన కెందుకు?" అని జీవదత్తుడు దండం పైకెత్తి, మాంత్రికుణ్ణీ, జడలభూతాన్నీ సమీపించి, "మీ యిద్దరూ ముందు కదిలి అరణ్యం వైపుకు వున్న ఆ గుహామార్గం కేసి బయలుదేరండి. ఊఁ, కదలండి!" అన్నాడు తీవ్రస్వరంతో.

మాంత్రికుడు వృద్ధపూజారికీ, పూజారిణికీ చేతులెత్తి నమస్కరిస్తూ, "గురువుల్లారా! ఏదో శాపకారణంగా గత ఇరవైనాలుగ్గంటల నుంచీ నా మంత్రశక్తులు పని చేయటం లేదు. ఈ మానవ మాత్రులకు లొంగిపోయి వాళ్ళకు దారి చూపమంటారా, లేక మీ మంత్ర బలంలో నన్ను కాపాడతారా?" అని అడిగాడు.

వృద్ధ పూజారీ, పూజారిణీ ముఖముఖాలు చూసుకుని మాటాపలుకూ లేకుండా మూగవాళ్ళల్లా తలలు పక్కకు తిప్పుకుని వూరుకున్నారు.

ఖడ్గవర్మ ఓ త్రుటికాలం వాళ్ళకేసి చూసి, ఒరలో నుంచి కత్తిదూసి, మాంత్రికుణ్ణీ, జడలభూతాన్నీ అదిలిస్తూ, "ఇక యీ చచ్చు కబుర్లూ, హాస్య నాటకం కట్టిపెట్టి నడవండి, ఆ గుహ ఎక్కడున్నదో చూపండి," అన్నాడు కోపంగా.

కత్తి చూస్తూనే మాంత్రికుడూ, జడల భూతం అదిరిపడి, "మహాసత్వ శేఖరుల్లారా. మమ్మల్ని చంపకండి! ఇదుగో, మీరు అరణ్యం చేరే గుహాసారంగం చూపుతాము, దయచేయండి!" అంటూ బయలుదేరారు.

ఆ ఇద్దరూ, కొంచెం ఎడంగా ఖడ్గ జీవ దత్తులూ బయలుదేరి కొద్ది దూరం వెళ్ళే లోపలే, వెనక వృద్ధ పూజారి పక్షం వాళ్ళూ, పూజారిణి పక్షం వాళ్ళూ పెద్ద రణగొణ ధ్వనిగా అరుస్తూ కలబడి కొట్టుకోసాగారు. జీవదత్తుడు తల తిప్పి వాళ్ళకేసి ఓసారి చూసి నవ్వుతూ, "ఖడ్గా, మహాభూతానికి ఎవరు ప్రధాన పూజారి కావాలన్న సంగతి తేల్చబోయి, ఈ దొంగ మాంత్రికులూ, శిష్యగణం చచ్చేలావున్నారు," అన్నాడు.

"చచ్చువెధవ లందర్నీ, చావనీ! ఈ శిథిలాల్లో చిక్కివున్న ఆ సింహానికైనా కొంతకాలం పాటు ఆకలితో డొక్కమాడే అవస్థ తప్పుతుంది," అన్నాడు ఖడ్గవర్మ.

ఆ మాటలు వింటూనే జడలభూతం నిలువెల్లా వణికిపోతూ, మాంత్రికుడితో, "గురో, ఆ పొగరుబోతు సింహం మనం వెళ్ళే గుహలో ఎక్కడైనా పొంచివుండి మీద పడితే ఏం చేయాలి?" అన్నాడు.

"విరుచుకు తిను! ఊఁ, పిరికివెధవా, ఆట్టేవాగక పద," అన్నాడు ఖడ్గవర్మ కత్తి ఝుళిపిస్తూ.



"భయపడకురా, శిష్యా! ఆ సింహం గుహలో కనబడాలేగాని, దాన్ని నా మంత్ర శక్తితో క్షణాలమీద పిల్లిగా మార్చుతాను. ఎందుకైనా మంచిది, యిదుగో గుహామార్గం దగ్గరకొచ్చాం. మహాభూతాన్ని తలుచుకుని నువ్వే ముందు గుహలో ప్రవేశించు," అన్నాడు మాంత్రికుడు.

ఆ గురుశిష్యుల వెంట ఖడ్గజీవదత్తులు గడిచిన రాత్రి శిథిలనగరంలోకి ప్రవేశించిన సారంగం వెంటపోయి, అరణ్యం కేసివున్న గుహద్వారాన్ని చేరారు. తరవాత వాళ్ళు ఆ గుహనుంచి కిందికి దిగి, చుట్టూ ఓమారు కలయచూసి, మాంత్రికుడూ, జడలభూతా లతో, "ఇక మీరు మీ శిథిలభవనాలకు

తిరిగిపోయి, మహాభూతాన్ని భక్తితో ఆరాధిస్తూ తరించండి!'' అన్నారు అవహేళనగా.

మాంత్రికుడు, ఖడ్గజీవదత్తులకు నమస్కరించి, ''మహాసత్వ్యల్లారా! ఇక మేము ఆ శిథిలనగరానికి పోము. ఇక్కణ్ణించి ఆ కనబడే దూరపుకొండలకుపోయి, అక్కడ ఏదో విధంగా జీవయాత్ర సాగిస్తాము,'' అన్నాడు.

''ఆ సాగించబోయే జీవయాత్రలో దాష్టీ కొట్టటం మాత్రం చేయకండి. చిక్కుల్లో పడిపోతారు. ఆ దూరపు కొండల్ని చేరే లోపల ఖడ్గజాతి వాళ్లెవరి కంటా పడకుండా జాగ్రత్త పడండి. వాళ్ళు మీ మీద పగబట్టి వున్నారు,'' అన్నాడు జీవదత్తుడు.

మాంత్రికుడూ, జడలభూతం వెళ్ళిపోగానే, ఖడ్గ జీవదత్తులు నదికి పోయి హాయిగా స్నానం చేసి, దాపుల నున్న అరణ్యంలోకి వెళ్ళి పళ్లూ ఫలాలూ కోసుకుతిని, ఒక చెట్టు కింద ఒక గంటకాలం విశ్రమించి, నది దిగువకు బయలుదేరారు. స్వర్ణాచారిని పట్టుకు పోయిన బందిపోట్లు ఆ ప్రాంతాల ఎక్కడో వుంటారన్న నమ్మకం వాళ్ళకు కలిగింది. ఎలాగైనా స్వర్ణాచారిని బందిపోట్ల నుంచి కాపాడితీరాలని వాళ్ళు నిశ్చయించుకున్నారు.

ఖడ్గ జీవదత్తులు ఒక గంటకాలం ప్రయాణించే సరికి, వాళ్ళకు నదీ తీరం వెంట కొన్ని చిన్నా పెద్ద కొండలు కంటబడినై. ఆ కొండల్లో ఒక దాని మీద ఒంటెల చేత, కొందరు మనుషులు పెద్ద పెద్ద బండ రాళ్ళను లాగించుకు పోతున్నారు.

''ఖడ్గా, వీళ్ళు బందిపోటు ముఠా అయి వుంటారు. ఇసుక ఎడారుల్లో, మైదానాల్లో తిరిగే ఒంటెలను, కొండల పైకి ఎక్కించి, వాటిచేత రాళ్ళు లాగించటం ఎంత ప్రమాదమో వాళ్ళకు తెలిసినట్టు లేదు,'' అన్నాడు జీవదత్తుడు.

జీవదత్తుడు మాట ముగించే లోపలే ఒక ఒంటె, దాని నెక్కి వున్న మనిషితో సహా కొండ అంచు నుంచి జారి తలకిందులుగా దిగువ నున్న పల్లంలోకి పడిపోయింది.

—(ఇంకా వుంది)






# యక్షపర్వతం

## 10

[ఖడ్గ జీవదత్తులు, వృద్ధపూజారిని ఖైదు నుంచి విడిపించి, శిథిలభవన ప్రాంగణాల నుంచి బయలుదేరారు. దారిలో వారికి పూజారిణి ఎదురుపడింది. ఆమెను ఖడ్గవర్మ బాణంతో కొట్టాడు. తరవాత వాళ్ళు మాంత్రిక జలభూతాల వెంట అరణ్యం చేరారు. అక్కడ వాళ్ళకు కొండ మీది నుంచి ఒంటె ఒకటి కింద పడటం కనిపించింది. తరవాత—]

ఒంటె కొండ మీది నుంచి పడిపోవటం చూస్తూనే ఖడ్గ జీవదత్తులు అటు కేసి పరిగెత్తారు. వాళ్ళు వెళ్ళేసరికి ఒంటె కాళ్ళు విరిగి గిలగిల తన్నుకుంటూ నేల మీద పొర్లుతున్నది. దానితోపాటు కింద పడిన వాడు మాత్రం మోకాలును రెండు చేతులతో పట్టుకుని పళ్ళు బిగువున బాధను సహిస్తూ, చిన్నగా మూలుగుతున్నాడు. వాడు బందిపోటు ముఠాలోని వాడని, వాడి దుస్తుల తీరు చూసి ఖడ్గ జీవదత్తులు పోల్చుకున్నారు.

జీవదత్తుడు, బందిపోటు వాణ్ణి సమీపించి, "ఒరే, బందిపోటు బాబూ! నీ దెలాంటి మొండి ప్రాణం! అంత ఎత్తు కొండ మీది నుంచి పడి ఒంటె కాళ్ళువిరిగి చావుబతుకుల మధ్య ఉన్నది గాని, నువ్వు మాత్రం చెక్కు చెదరక పిడిరాయిలా వున్నావు!" అన్నాడు.



ఖడ్గవర్మ కత్తి దూసి, దాని మొనను బందిపోటు వాడి గుండెల మీద పెట్టి, "ఒరే, యిప్పుడు నిజం చెప్పు. లేకపోతే యీ ఒంటెతోపాటు నువ్వూ ఏ నక్కలకో ఆహారం అయిపోతావు. ఖడ్గజాతివాళ్ళ పంట పొలాలు దోచుకున్న బందిపోట్ల మందలో నువ్వు లేకపోతే, ఆ సంగతి దోచుకున్న నీ మిత్రుల ద్వారా విని వుంటావు. కనక నీ మాటలు నమ్మదగినవే! కాని, మమ్మల్ని చూస్తూనే, ఆ ఖడ్గజాతివాళ్ళ తరపు మనుషులని నువ్వెలా గుర్తించావు?" అని అడిగాడు.

జీవదత్తుడు, ఖడ్గవర్మకు కత్తిని ఒరలో పెట్టమని చెప్పి, "ఖడ్గా, అసలే ప్రాణభయంతో చస్తున్న వాణ్ణి యింకా ఎందుకు హడల కొడతావు? పైగా ఆ ఖడ్గజాతివాళ్లూ, ఆ పంటపొలాల దోపిడీ....అదంతా ఏనాటి మాట!" అని బందిపోటు వాడితో, "ఒరే, నా మిత్రుడడిగిన ఆఖరి ప్రశ్న అడుగుతున్నాను, మమ్మల్నెలా గుర్తించావు?" అన్నాడు.

"అయ్యా, మిమ్మల్ని అరణ్యంలో చూసిన నా మిత్రుల ద్వారా మీ వస్త్రధారణా, పట్టిన ఆయుధాల సంగతి విని, యిప్పుడు మిమ్మల్ని చూస్తూనే గుర్తించాను. ఇందులో అబద్ధం లేదు." అన్నాడు బందిపోటువాడు.

అంతవరకూ బందిపోటు వాడు తన మోకాలు బెణికిన బాధలో వుండి, ఖడ్గ జీవదత్తులు తనను సమీపించటం చూడ లేదు. ఇప్పుడు వాడు తల ఎత్తి ఖడ్గ జీవదత్తుల్ని చూస్తూనే కళ్ళింత చేసి వణికి పోతూ, "అయ్యా, నన్ను చంపకండి! ఖడ్గజాతివాళ్ళ పంట పొలాలు దోచిన వాళ్ళల్లో నేను లేను. నిజానిజాలు స్వర్ణాచార్యులు గారి నడిగి మీరు తెలుసుకో వచ్చు," అన్నాడు.

వాడి మాటలు వింటూనే ఖడ్గ జీవదత్తులు పొందిన ఆశ్చర్యం అంతా యింతా కాదు. వాళ్ళకు స్వర్ణాచారి సజీవుడేనని, అతను బందిపోట్ల దగ్గిరే వున్నాడని తెలిసిపోయింది.



"ఆహాఁ, నువ్వు బుద్ధికి బృహస్పతివి! ఎక్కడైనా గురుకులం పెట్టి శిష్యులకు విద్యాబోధ చెయ్యక, యీ దారి దోపిడి ముఠాలో ఎందుకు చేరావు?" అంటూ ఖడ్గవర్మ పెద్దగా నవ్వి, "ఆ రాయీ రప్పలూ ఒంటెల చేత కొండ మీద లాగించుకు పోతున్నారే, అవి ఎందుకు? ఎక్కడికి?" అని అడిగారు.

"అయ్యా, స్వర్ణాచార్యులవారు మా నాయకుడు స్థాపించబోయే రాజ్యానికి రాజధాని నగరం. పెద్ద కోటా కట్టబోతున్నారు. వారి ఆజ్ఞ ప్రకారం మేమంతా కొండ రాళ్ళు లోయ పైనున్న ఒక సమతల ప్రదేశానికి చేరుస్తున్నాం," అన్నాడు బందిపోటు వాడు మూలుగుతూ.

ఖడ్గ జీవదత్తులు కాలు విరిగిన బందిపోటు వాడితో మాట్లాడుతూ కొండ మీద ఏం జరుగుతున్నదో చూడలేదు. అక్కడ బందిపోటు వాడి స్నేహితులు, ఒంటెలతోపాటు తమ వాడు కింద పడటం చూస్తూనే, తమ తమ ఒంటెలను ఆపి, కొండ అంచుకు వచ్చి, దిగువకు చూశారు. వాళ్ళకు యింకా ప్రాణాలతో వున్న తమ తోటివాణ్ణి సమీపిస్తూ, ఖడ్గ జీవదత్తులు కనిపించారు.

వాళ్ళను చూస్తూనే బందిపోటు వాళ్ళు అదురుకు పోయారు. వాళ్ళల్లో కొందరికి అరణ్యంలో ఖడ్గ జీవదత్తులు తమ నెదుర్కొని బాణాల దెబ్బలతో, కత్తి పోట్లతో చికాకుపరిచి పారదోలటం యింకా గుర్తున్నది. ఒకరిద్దరు ఖడ్గ జీవదత్తులు మాంత్రికుణ్ణి, జడలభూతాన్ని అదరగొట్టి గుహలో దూరబడటం కూడా చూశారు.

"మన నాయకుడిక్కడలేడు. ఆ క్షత్రియ యువకులు మనను చూశారు. వాళ్ళు కొండ పైకి వచ్చి మన ప్రాణాలు తీయటం ఖాయం!" అన్నాడొక బందిపోటు.

"రానున్న ఆపద నుంచి మనం బయటపడాలంటే, యిప్పుడే పోయి స్వర్ణాచార్యులు గారితో సంగతంతా చెప్పుకుని, వారు ఏమి చేయమంటారో అలా చేయటం ఒక్కటే మార్గం. ఆయినా, యీ క్షత్రియ యువకులూ



లోగడ మిత్రులన్న సంగతి మనం ఎరిగిందే గదా!" అన్నాడు మరొక బందిపోటు.

ఆ వెంటనే పది పన్నెండుమంది బందిపోట్లు పరుగు పరుగున స్వర్ణాచారి దగ్గిరకు పోయారు. ఆ సమయంలో స్వర్ణాచారి ఒక ఎత్తయిన రాతి మీద కూర్చుని, తాను బందిపోటు నాయకుడికి కట్టనున్న కోటకు సంబంధించిన వాస్తుపటం పరిశీలిస్తున్నాడు.

బందిపోట్లు దగ్గిరకు రావటం చూస్తూనే స్వర్ణాచారి పటం మీది నుంచి దృష్టి వాళ్ళ మీదికి తిప్పి కోపంగా, "పని మాని అందరూ కట్టకట్టుకుని ఏదో రాక్షసుడి బారి నుంచి పారిపోయి వస్తున్నట్టు యిక్కడికి పరిగెత్తుకొస్తున్నారేం? వేటకు పోయిన మీ నాయకున్ని తిరిగి రానివ్వండి. మీ తాట ఒలిపిస్తాను," అన్నాడు.

బందిపోట్లలో ఒకడు వణుకుతున్న గొంతుతో, "అయ్యా, స్వర్ణాచార్యులుగారూ! మా నాయకుడు యిక్కడ లేని సమయాల్లో మీరేగదా మాకు నాయకులు! మన ఒంటె ఒకటి పైనున్నవాడితో పాటు కాలుజారి కొంత కింది పల్లంలోకి పడిపోయింది. అది చూస్తూనే దారేపోయే మీ పాత మిత్రులైన క్షత్రియ యువకులిద్దరూ, కత్తులూ, బాణాలూ తీసుకుని యింకా ప్రాణాలతో వున్న మనవాడి దగ్గరకు వచ్చి ఏవో ప్రశ్నలడుగుతున్నారు. వాడి ద్వారా మనం వున్న చోటు తెలుసుకుని, ఆ ఇద్దరూ మనను హతం చేయటానికి త్వరలోనే యిక్కడికి వస్తారని, మాకు భయంగా వుంది," అన్నాడు.

క్షత్రియ యువకులు అన్న మాట వింటూనే స్వర్ణాచారి అదిరిపడి ఆ మరుక్షణానే సంతోషం పట్టలేక, రాతి మీది నుంచి లేచి నిలబడ్డాడు. బందిపోటు వాడు చెప్పిన తతిమ్మా సంగతులు విన్న తర్వాత, అతడికి తన మిత్రులిద్దరూ అక్కడికి వచ్చారన్న దాంట్లో ఎలాంటి అనుమానం లేకుండా పోయింది.

స్వర్ణాచారి కొంత అంచుకేసి బయలుదేరుతూ, "ఒరే, ఒంటెవాడా! క్షత్రియ

యువక యోధులు యిక్కడికి వచ్చారని ఒక మాటలో చెపితే సరిపోయేదానికి, ఎంత గ్రంథం పెంచి మాట్లాడావురా? ఇక నోరు మూసుకుని, నా వెంట రా!'' అన్నాడు.

"ఆచార్యులుగారూ! అలాగే వస్తాం. వారి వల్ల మాకేం ప్రాణహాని జరగదు గదా?'' అన్నారు బందిపోట్లు.

"అలాంటి దేమీ వుండదు. మీ ప్రాణాలకు నా ప్రాణం అడ్డువేస్తాను. మీరు మాత్రం ముచ్చువేషాలు వేయక వాళ్ళతో మర్యాదగా ప్రవర్తించండి,'' అన్నాడు స్వర్ణాచారి.

స్వర్ణాచారి కొండ అంచుకు వచ్చి ఖడ్గ జీవదత్తుల్ని పెద్ద కేక వేసి పిలిచాడు.

ఆ కేక వింటూనే ఖడ్గ జీవదత్తులు తలలు ఎత్తి చూసి స్వర్ణాచారిని గుర్తించారు. అతడి వెనకగా కొందరు బందిపోట్లు నిలబడి వుండటం చూసి ఖడ్గవర్మ, ''జీవా, ఈ పద్మపుర వాస్తుశాస్త్రజ్ఞుడూ, మర ఏనుగుల్ని తయారు చేసే యీ స్వర్ణాచారి బందిపోట్ల ముఠాలో ఒకడైపోయాడేమో అని నాకు అనుమానం కలుగుతున్నది. మన జాగ్రత్తలో మనం వుండాలి,'' అన్నాడు.

ఖడ్గవర్మ యిలాంటి అనుమానాన్ని వెల్లడించిన తరవాత జీవదత్తుడికి కూడా కొంచెం సంశయం కలిగింది. స్వర్ణాచారిని బలవంతంగా బందిపోట్లు ఎత్తుకు వచ్చినా, ఆ తరవాత అతడు వాళ్ళతో స్నేహం కలిపినా కలిసి వుండవచ్చు....





"ఖడ్గా, మనం వింధ్యపర్వతాలు చేరే వరకూ అన్ని వేళలా మన జాగ్రత్తలో మనం వుండవలసిందే, సందేహం లేదు. మనం యిటు వచ్చింది స్వర్ణాచారిని బంది పోట్ల నుంచి బంధ విముక్తి చేయటానికి గదా? చూద్దాం, మనిషి ధోరణి ఎలా వుందో!" అన్నాడు జీవదత్తుడు.

ఖడ్గ జీవదత్తులు యిలా మాట్లాడు కుంటున్నంతలో స్వర్ణాచారి నలుగురు బంది పోట్లను వెంటబెట్టుకుని వాళ్ళ దగ్గిరకు వచ్చి ఎంతో భక్తితో నమస్కరించాడు. అతడి వెంట వున్న బందిపోట్లు నలుగురూ ఖడ్గ జీవదత్తులకు సాష్టాంగ పడి, లేచి నిలబడ్డారు.

జీవదత్తుడు నవ్వుతూ, స్వర్ణాచారి భుజం తట్టి, "స్వర్ణాచారి, ఎలా వున్నావు? బంది పోట్ల నాయకుడికి మాయమినుగుల్నీ, గుర్రాలనూ ఏమైనా తయారు చేస్తున్నావా? నువ్వు వీళ్ళ చేతుల్లో చాలా కష్టాలనుభవిస్తూంటావని అనుకున్నాం. చూడగా నువ్వు కూడా బందిపోట్లకు ఒక చిన్న నాయకుడివైపోయినట్టుంది!" అన్నాడు.

ఆ మాటలకు స్వర్ణాచారి ఒక్క క్షణ కాలం నిశ్చేష్టుడైపోయి, చేతులు రెండూ జోడించి, "మీరొకసారి నాకు ప్రాణదానం చేశారు. మీకు జీవిత కాలమంతా కృతజ్ఞుడనై వుంటాను. నేను తప్పనిసరై బంది పోట్ల నాయకుడికి కోట కట్టి పెడుతున్నాను. అది పూర్తి కాగానే నా దారిన నేను పోయి విఘ్నేశ్వరపూజారిని కలుసుకుని, తరవాత యిద్దరం ఏ అరణ్యంలోనో తపస్సు చేసుకుంటాం," అన్నాడు.

"విఘ్నేశ్వరపూజారి, ఖడ్గజాతి వాళ్ళ అరణ్యపుర ప్రాంతాల్లోనే సుఖంగా వున్నాడు. నువ్విక్కడ సుఖంగా వున్నావు గదా? ఇక మా దారిన మేం పోతాం," అన్నాడు జీవదత్తుడు.

ఆ జవాబుకు స్వర్ణాచారి గడబిడపడి పోతూ, "ఖడ్గ జీవదత్త ప్రభువులు ఒక రోజైనా నా ఆతిథ్యం స్వీకరించకుండా వెళ్ళటమా? అది కుదరదు. మీరు

ఈ పగలూ, రాత్రీ నాకూ, సమరబాహు డికీ అతిథులుగా వుండాలి," అన్నాడు.

"ఎవరా సమరబాహు?" అన్నాడు జీవదత్తుడు ఆశ్చర్యపోతూ.

"ఓహో!, మీరు లోగడ బందిపోట్ల నాయకుడి పేరు వినలేదన్నమాట? సింధు ఎడారుల నుంచి ఒంటెల మీద యీ ప్రాంతాలకు వచ్చిన, యీ బందిపోట్ల నాయకుడి పేరది. ఇప్పుడతడు ఇంటి దగ్గిర లేడు, వేటకై ఇద్దరు అనుచరులతో కలిసి అరణ్యానికి వెళ్ళాడు. ఇక వెళదాం, రండి!" అంటూ ముందుండి దారి తీశాడు స్వర్ణాచారి.

ఖడ్గ జీవదత్తులు బయలుదేరుతూ, ఒంటెతో పాటు కింద పడి గాయపడిన బందిపోటు వాణ్ణి, వాడి అనుచరులకు చూపి, "వీణ్ణి మీరు భుజాల మీద మోసుకుపోవలసిందే!" అన్నారు.

ఆ వెంటనే ఇద్దరు బందిపోట్లు గాయపడిన వాణ్ణి భుజాలకెత్తుకున్నారు. అందరూ కలిసి కొద్ది సేపటికల్లా కొండ మీద వున్న బందిపోట్ల నివాస స్థానాలు చేరేసరికి, అక్కడ ఎలుగుబంటి చర్మాలు ధరించిన ఒకడి చుట్టూ కొందరు బందిపోట్లు చేరి గొడవగొడవగా మాట్లాడుతున్నారు. ఖడ్గ జీవదత్తుల్నీ, స్వర్ణాచారినీ అంత దూరాన చూస్తూనే, అందరూ పరిగెత్తుతూ వాళ్ళ దగ్గిరకు వచ్చారు.



"ఈ గొడవంతా ఏమిటి? నువ్వు యీ ఎలుగుబంటి వేషం వేసి తైతక్కలాడుతున్నావెందుకు?" అని స్వర్ణాచారి వాణ్ణి గట్టిగా కోప్పడ్డాడు.

ఎలుగుబంటి చర్మాలు కట్టుకున్నవాడు స్వర్ణాచారికి వంగి నమస్కారం చేసి, "స్వర్ణాచార్యులుగారూ, ఈ చర్మాలు నేను కావాలని కట్టుకున్నవి కావు. నేను యివాళ ఉదయం నాయకుడితో వేటకై అరణ్యంలోకి వెళ్ళిన యిద్దరిలో ఒకణ్ణి. నాయకుణ్ణి అక్కడ ఎవరో బహు క్రూరులైన అటవికులు పట్టుకుని తీసుకుపోయారు. నేను వాళ్ళకు దొరక్కుండా, తప్పించుకు పారిపోయి వచ్చాను," అన్నాడు.

"బందిపోట్ల నాయకుడైన సమరబాహుణ్ణి ఆటవికులు పట్టుకుపోయూరా? అంత గొప్ప సమరశూరుణ్ణి పట్టగలిగిన ఆటవికులీ ప్రాంతాల ఎక్కడున్నారు?" అన్నాడు ఖడ్గ వర్మ చిరునవ్వు నవ్వుతూ.

"ఖడ్గా, వాడెంత దుర్మార్గుడైనా, వాడి కన్న దుర్మార్గుల చేతుల్లో చిక్కినట్టుంది. నవ్వకు. పాపం!" అన్నాడు జీవదత్తుడు.

బందిపోట్ల నాయకుడు ఆటవికులకు బందీ అయూడన్న వార్త వింటూనే స్వర్ణాచారి నిలువెల్లా కంపించిపోయూడు. అతడు మొదట్లో బందిపోట్లకు ఖైదీగా చిక్కినా తరవాత తరవాత వాళ్ళు అతణ్ణి ఎంతో గౌరవాదరాలతో చూడసాగారు. నాయకుడు సమరబాహుకూ, స్వర్ణాచారికీ మంచి మైత్రి స్నేహాలు కూడా ఏర్పడినై.

"ఖడ్గ జీవదత్త ప్రభువుల్లారా! భయంకర సంఘటన యిది. మీరు శక్తిమంతులు. ఎలాగైనా సమరబాహును ఆ ఆటవికుల నుంచి విడిపించే ప్రయత్నం చేయాలి," అన్నాడు స్వర్ణాచారి దీనంగా ముఖం పెట్టి.

జీవదత్తుడు, ఖడ్గవర్మ కేసి చూశాడు. ఖడ్గవర్మ అయిష్టంగా తలాడిస్తూ, "జీవా, యీ సహాయపరో విషయమై నీవే ఏదో ఒక నిర్ణయం చేయాలి. మన మిత్రుడైన స్వర్ణాచారి అడుగుతున్నాడు గనక ఆ దుర్మార్గుణ్ణి రక్షిద్దామంటావా? అంతా నీ యిష్టం!" అని ఊరుకున్నాడు.

జీవదత్తుడు ఒక క్షణం ఆలోచించి, ఎలుగుచర్మాలవాడితో, "ఒరే, మీ నాయకుణ్ణి, నీ తోటివాళ్ళే, ఆ ఆదిమవాసులు ఎలా పట్టుకున్నారు? అసలు అరణ్యంలో ఏం జరిగింది? ఆ సంగతంతా ముందు చెప్పు," అన్నాడు.

ఎలుగుచర్మాల బందిపోటువాడు, గట్టిగా ఓ మారు గొంతు సవరించుకుని, "అయ్యా, జరిగిందంతా కొద్ది మాటల్లో చెప్పేస్తాను. మీరు త్వరగా సాయం వచ్చి రక్షించక పోతే మా నాయకుణ్ణి క్రూరులైన ఆ నర భక్షకులంతా కలిసి కాల్చుకు తిన్నా తినవచ్చు," అన్నాడు.

—(ఇంకా వుంది)






## 11

[కొండప్రాంతాన్ని చేరిన ఖడ్గ జీవదత్తులకు, బందిపోటు వాళ్ళ వెంటవున్న స్వర్ణాచారి కనిపించాడు. అతడి వెంట వాళ్ళు కొండపైకి పోయారు. ఆ సమయంలో ఒక బందిపోటు వాడు వాళ్ళ దగ్గరకు పరిగెత్తుకుంటూ వచ్చి, అరణ్యంలో వేటకుపోయిన వాళ్ళనాయకుడు సమరబాహుణ్ణి నరమాంసభక్షకులు పట్టుకున్నారని చెప్పాడు. తరవాత—]

బందిపోటు వాడు చెప్పిన మాటలు వింటూంటే, ఖడ్గ జీవదత్తులకు ఎక్కడ లేని ఆశ్చర్యం కలిగింది. ఇన్ని రోజులుగా వాళ్ళు అరణ్యాల్లో ఎంతో దూరం ప్రయాణించారుగాని, ఎక్కడా వాళ్ళకు నరమాంసభక్షకులు తారసపడలేదు.

జీవదత్తుడు ఒక క్షణకాలం వూరుకుని బందిపోటువాడితో, "మీ నాయకుణ్ణి వాళ్ళు కాల్చుకు తింటారో లేక పచ్చి పచ్చిగానే తినేస్తారో అదంతా తరవాత చూద్దాం. నువ్వు ముందు కాలయాపన చెయ్యకుండా జరిగిందేమిటో చెప్పు!" అన్నాడు.

"అయ్యా, మేం పెందరాళే అరణ్యానికి వేటకు పోయి, అదృష్టం కొద్దీ ఒక లేడి దొరకగా దాన్ని చంపి ఇళ్ళకు తిరిగి వస్తున్నాం. దారిలో ఒక చోట పులి గాండ్రింపూ, ఒక మనిషి కేకపెట్టిన ధ్వనీ వినిపించింది. మేము ముగ్గురం అటుకేసి



వెళ్ళాం. ఒక చోట ఒక ఆదిమవాసుడూ, పులీ కనిపించినై. ఆదిమవాసుడు పులి కాళ్ళ కింద చచ్చిపడి వున్నాడు. పులి గుండెల్లో వాడు గుచ్చిన ఈటె వున్నది. పులీ చచ్చిందన్నమాట! కాని సమీపంలో ఒక పులి పిల్ల గోలగా అరుస్తూ తిరుగుతున్నది," అన్నాడు బందిపోటువాడు.

"బహుశా, అది ఆ చచ్చినపులి పిల్ల అయి వుంటుంది! ఆ తరవాత ఏం జరిగింది?" అన్నాడు జీవదత్తుడు.

"మా నాయకుడు ఆ పులిపిల్లను తీసుకుపోయి పెంచుదాం అన్నాడు. నేను నక్కుతూ పోయి దాన్ని పట్టుకున్నాను. ఇంతలో పదీ పన్నెండు మంది ఎలుగుబంటి చర్మాలు ధరించిన వాళ్ళు చెట్ల చాటునుంచి హఠాత్తుగా వచ్చి మీద పడి మామ్మల్ని పట్టుకున్నారు. వాళ్ళ నాయకుడు మాత్రం ముఖం కనిపించకుండా ఒక ఎలుగు బంటి తల తగిలించుకుని వున్నాడు. వాడు నన్ను చూసి తన అనుచరులతో, 'ఒరే, వీడు పులిపిల్లను చాలా ఒడుపుగా పట్టాడు, తెలివీ, సాహసం వున్న వాడిలా కనిపిస్తున్నాడు. మనలో కలుపుకుందాం, ఎలుగు చర్మాలు కట్టండి!' అన్నాడు. ఆ వెంటనే వాడి అనుచరులిద్దరు నాకు ఎలుగుచర్మాలు కట్టారు. మా నాయకుడికీ, దొరికిన నాతోటి వాడికీ మాత్రం చేతులకు తాళ్ళుకట్టి, నన్ను పులిపిల్లతో వెంటరమ్మన్నారు. నేను...."

బందిపోటువాడి మాటలకు అడ్డొస్తూ జీవదత్తుడు, "నువ్వు అదృష్టవంతుడివిరా! పారిపోకుండా వాళ్ళతో నే వున్నట్టయితే, ఏదో ఒకనాడు ఆ ఆదిమవాసులకు నాయకుడివయేవాడివి!" అన్నాడు.

ఆ మాటలకు ఖడ్గవర్మతోపాటు, స్వర్ణాచారీ పక్కనవున్న వాళ్ళూ—అంతా పెద్దగా నవ్వారు. బందిపోటువాడు కూడా చిరునవ్వు నవ్వి, "కొంతదూరం పోయింతరవాత నా చేతుల్లో వున్న పులిపిల్లను ఎలుగు బంటితల పెట్టుకున్న వాడి మీదికి విసిరివేశాను. అది వాడి భుజాల మీద పడుతూనే, వాడి గొంతు పట్టుకున్నది. వాడు

దానితో పెనుగులాడే సమయాన, సహాయం కోసం వాడి మిత్రులంతా వాడి దగ్గిరకు పోయారు. నేను అదే అదననుకుని యిక్కడికి పారిపోయి వచ్చాను,'' అన్నాడు.

''ఘనకార్యమే చేశావ్! స్వర్ణాచారీ, మనం ఆ ఆదిమవాసుల స్థావరానికి పోయి, బందిపోట్ల నాయకుడు సమరబాహును బంధ విముక్తుణ్ణి చేద్దామంటావా?'' అని అడిగాడు జీవదత్తుడు.

స్వర్ణాచారి జవాబివ్వబోయేంతలో, అప్పటివరకూ ఒక ఎత్తయిన రాతి మీద నిలబడి అరణ్యం కేసి చూస్తూన్న బందిపోటు వాడొకడు, రాతి మీది నుంచి ఎగిరి కిందికి దూకి, ఖడ్గ జీవదత్తులున్న చోటుకు పరిగెత్తుకుంటూ వచ్చి, ''అయ్యా, మన కొండ కింది అరణ్యంలో చాలామంది ఆదిమవాసులు డప్పులూ, తప్పెట్లూ వాయిస్తూ, ఎలుగుబంట్లతో నాట్యం చేయిస్తూ వస్తున్నారు,'' అని చెప్పాడు.

''మనకేసి వస్తున్నారా లేక అరణ్యంలో వాళ్ళ దారిన వాళ్ళు పోతున్నారా?'' అంటూ ఖడ్గ జీవదత్తులు వెళ్ళి అరణ్యం కేసి చూశారు.

బందిపోటువాడు చెప్పినదాంట్లో అబద్ధం ఏమీలేదు. తప్పెట్లూ, డప్పులూ మోగిస్తూ, పెంపుడు ఎలుగుబంట్లతో పాటు తామూ చిందులువేస్తూ అరణ్యానికి అడ్డం పడిపోతున్న ఆదిమవాసులు పదీ పన్నెండు మంది కన్న ఎక్కువలేరు. వాళ్ళకు ముందుగా బందీ అయిన సమరబాహుణ్ణీ, అతడి అను





చరుస్తో ఒక ఆదిమవాసుడు తాడుకట్టి తీసుకుపోతున్నాడు.

"ఖడ్గా, ఈ ఆదిమవాసులు మనం వున్న కొండ కేసికాక, అరణ్యంలో ఎక్కడోవున్న వాళ్ళ స్థావరానికేసి పోతున్నట్టున్నది. వీళ్ళు నరభక్షకులైతే మాత్రం సమర బాహును మనం రక్షించలేం," అన్నాడు జీవదత్తుడు.

స్వర్ణాచారి అక్కడికి వచ్చి తలవంచి కొండ దిగువనున్న అరణ్యంకేసి చూసి, ఆదిమవాసుల్నీ, వాళ్ళవెంట బందీగావున్న సమరబాహుణ్నీ గుర్తించి ఆదుర్దాగా, "ఖడ్గ జీవదత్త ప్రభువుల్లారా! మీరు ఎలా అయినా సమరబాహుణ్ని ఆ దుర్మార్గుల బారినుంచి కాపాడాలి. ఎలుగుబంట్లతో నాట్యం చేయిస్తూ, తాము వాటితోపాటు గెంతుతూ అరణ్యాల్లో తిరిగే యీ భయంకరుల చేతుల్లో అతడు ఎంతోకాలం జీవించి వుండటం కష్టం," అన్నాడు.

"స్వర్ణాచారీ, నువ్వు కోరుతున్నావు గనక, మేం సమరబాహుణ్ని రక్షించే ప్రయత్నంచేస్తాం. మేము ఆ ఆదిమవాసుల్ని వెంబడించిపోయి అతణ్ణి విడిపించటానికి కొంతకాలం పట్టుతుందిగదా. ఈ లోపలే వాళ్ళు అతణ్ణి చంపటం జరిగితే, అది మీ నాయకుడి ఆయుష్కాలం తీరినందున జరిగిన దైవసంఘటనగా భావించాలి," అన్నాడు జీవదత్తుడు.

"ప్రభువుల్లారా! అందుకే ఆలశ్యం కాకుండా సమరబాహుడి అనుచరు లందర్నీ మీకు సాయంగా పంపుతాను. మీరు ఆ క్రూరుల్ని యిక్కడే పట్టుకుని సంహరించి, సమరబాహుణ్ణి బంధవిముక్తుణ్ణి చేయండి," అన్నాడు స్వర్ణాచారి.

స్వర్ణాచారి ముందు వెనుకలు ఆలోచించకుండా ఉద్రేకపడిపోతూ అన్నమాటలకు జీవదత్తుడు నవ్వి, "స్వర్ణాచారీ, నువ్వనే ఆ క్రూరుల్ని అంత తేలిగ్గా సంహరించటం సాధ్యం అవుతుందనుకోకు. మనం దాడి కొచ్చాం అని తెలియగానే వాళ్ళు పారిపోవచ్చు లేకపోతే సమరబాహును

అక్కడికక్కడే చంపినా చంపవచ్చు.... ఎందుకీ అనవసర కాలయాపన! మేము యిప్పుడే బయలుదేరి పోతున్నాం," అన్నాడు.

ఆ తరవాత ఖడ్గ జీవదత్తులు కొండ దిగి అరణ్యంలో ప్రవేశించారు. వాళ్ళకు ముందు పోతున్న ఆదిమవాసులు కంటికి కనిపించక పోయినా, వాళ్ళు తప్పెట్లూ, కొమ్ముబూరలూ ఊదుతూ చేస్తున్న గోల మాత్రం వినిపిస్తూనే వున్నది.

ఒక పావు గంటకాలం ఖడ్గ జీవదత్తులు సాధ్యమైనంత వేగంగా నడుస్తూ, ఆదిమ వాసులను కలుసుకుని, హఠాత్తుగా వాళ్ళను వెనకనుంచి బాణాలతో కొట్టి చెల్లాచెదురు చేయాలని ప్రయత్నించారు. కాని, వాళ్ళు అరణ్యవృక్షాల చాటున యిప్పుడు కనబడి, అంతలోనే కనబడకుండా మాయంకాసాగారు.

"ఖడ్గా, మనం యీ ఎలుగుబంటి చర్మాలవాళ్ళను వాళ్ళ నివాసస్థానంలోనే పట్టుకుని హతమార్చవలసిందే తప్ప మరో మార్గం లేనట్టున్నది. ఈ కీకారణ్యంలో మనం వాళ్ళను త్వరగాపోయి కలుసుకోవటం ఎట్లా?" అన్నాడు జీవదత్తుడు నిరుత్సాహంగా.

ఖడ్గవర్మ ఏదో జవాబివ్వబోయేంతలో, అంతవరకూ దూరంగా వినబడుతున్న తప్పెట్లూ, డప్పులమోతలూ హఠాత్తుగా ఆగి




పోయినై. అరణ్య ప్రాంతమంతా ఒక్కసారిగా నిశ్శబ్దమైపోయింది.

"ఖడ్గా, ఏం జరిగివుంటుంది? ఆదిమ వాసులందర్నీ ఒక్కసారిగా ఏ రాక్షసుడో పట్టుకుని మింగలేదుగదా!" అన్నాడు జీవదత్తుడు ఆశ్చర్యపడుతూ.

"ఇదేదో వింతగానే వుంది! ఇప్పటి వరకూ మనం వాళ్ళుచేసే ధ్వనుల్నిబట్టి, ఎటుపోతున్నారో ఊహించి వెంబడిస్తున్నాం. ఇప్పుడిక వాళ్ళను వెతికిపట్టుకోవటం ఎలా?" అన్నాడు ఖడ్గవర్మ.

అంతలో దాపులనున్న చెట్ల వెనకనుంచి ఒకేసారి రెండు మూడు తోడేళ్ళు అరిచిన శబ్దం వినిపించింది. ఆ అరుపులు వింటూనే



జీవదత్తుడు, "ఇదీ వింతగానే వుంది! పట్టపగలు మనుషులు సంచరించే యీ ప్రాంతాలలో తోడేళ్ళుకూయటమా! అందుకేదో కారణం వుండివుంటుంది. పద చూద్దాం!" అంటూ గుబురు చెట్ల కేసి దారితీశాడు.

ఖడ్గ జీవదత్తులు చెట్లను సమీపించి, నేలబారుగా వున్న వాటి కొమ్మలచాటున నిలబడి ముందుకు చూశారు. అక్కడ చాలా విశాలమైన పంటపొలం ఒకటి కనిపించింది. అందులో కొంత భాగాన రకరకాల కూరగాయల మొక్కలు ఏపుగా పెరిగివున్నవి. మిగిలిన ప్రదేశం అంతా ఫలవృక్షాలతో కంటికి యింపుగా కనబడుతున్నది. కాని ఖడ్గజీవదత్తుల దృష్టిని మాత్రం యివేమీ అంతగా ఆకర్షించలేదు. వాళ్ళు అక్కడ పళ్ళచెట్లకూ, కూరపాదులకూ నీళ్ళుతెచ్చి పోస్తున్న నలుగురు అనాగరిక మనుషుల్నీ, చెట్లకింద తోడేళ్ళను పెట్టుకుని కూర్చునివున్న ఇద్దరు ఎలుగుబంటి చర్మాలు ధరించిన వాళ్ళనూ చూసి చాలా వింతపడ్డారు. తోడేళ్ళ అరుపులకు కారణం ఏమిటో వాళ్ళకు యిప్పుడు అర్థమైపోయింది.

"ఖడ్గా, ఈ ఎలుగుబంటు జనం యిక్కడ అరణ్యంలో కొంతభూమి దున్ని వ్యవసాయం చేస్తున్నారు. వాళ్ళు పని చేయిస్తున్న మనుషులు మరొక జాతివాళ్ళలా కనిపిస్తున్నారు. వాళ్ళు వీళ్ళకు బానిసలైవుంటారు," అన్నాడు జీవదత్తుడు.

"అందులో సందేహంలేదు. ఆ బానిసలు పారిపోకుండా కాపలాకే యీ తోడేళ్ళను వీళ్ళు ఉపయోగిస్తున్నట్టున్నది. పానకంలో పుడకలాగా వీళ్ళు మనకు అడ్డపడ్డారేం? సమరబాహును బంధించిన ముఠా అయిపూ అజాలేకుండా పోయింది," అన్నాడు ఖడ్గవర్మ.

ఖడ్గ జీవదత్తులు యిలా మాట్లాడుకుంటున్నంతలో కూరపాదులకు నీళ్ళు తెస్తున్న బానిస ఒకడు అటూయిటూ తలతిప్పి చూస్తూ, పాదుల వెనగ్గా నక్కినడుస్తూ ఒక చెట్టు కింద కూర్చుని కునికిపాట్లుపడుతున్న

ఎలుగుబంటి చర్మాలవాణ్ణి సమీపించ సాగాడు. వాడు నడుస్తున్నతీరు ఖడ్గ జీవదత్తులకు చాలా అనుమానం కలిగించింది.

"ఖడ్గా, ఆ బానిసవాడు, ఎలుగుబంటు మనిషిని హతమార్చే ప్రయత్నమేదో చేస్తున్నట్టు కనబడుతున్నది. అరెరె! వాడు ..." అంటూ ఆగిపోయాడు జీవదత్తుడు.

బానిసవాడు, తనకు కాపలావున్న ఎలుగుబంటి వాడి వెనక్కుపోయి నీళ్ళ కుండలో నుంచి చప్పున ఒక పెద్ద రాయిని బయిటికి తీసి, దానితో కాపలావాడి తలమీద గట్టిగా ఒక బాదుబాదాడు. దెబ్బతింటూనే కాపలావాడు ఒక కేకపెట్టి ముందుకు పడిపోయాడు. అదే సమయంలో బానిసవాడు పరిగెత్తి, అరణ్యంలో ప్రవేశించాడు.

తనతోటి కాపలావాడు పెట్టిన చావుకేక వింటూనే, వాడి అనుచరుడు అటుకేసి చూసి జరిగినదేమిటో గ్రహించి పారిపోతున్న బానిసవాడి మీదికి పెంపుడు తోడేళ్ళను ఉసికొల్పాడు. తోడేళ్ళు రెండూ భయంకరంగా అరుస్తూ, బానిసవాడు పారిపోయిన వైపుకు పరిగెత్తినై. వాటి వెనగ్గా ఎలుగుబంటివాడు కేకలుపెడుతూ అరణ్య వృక్షాల్లోకి పోయాడు.

"ఖడ్గా, సమరబాహు అదృష్టంకొద్దీ మనం యిక్కడికి రావటం జరిగింది. పారిపోకుండా యిక్కడవున్న యీ ముగ్గురు బానిసల్నీ అడిగిచూస్తే, ఎలుగుబంటివాళ్ళ నివాసస్థానం మనకు తెలిసిపోతుంది," అంటూ జీవదత్తుడు చెట్లచాటు నుంచి



బయిటికివచ్చి, కూరపాదుల మధ్య నిల బడి దిక్కులు చూస్తున్న వాళ్ళను కేక వేసి పిలిచాడు.

ఆ కేక వింటూనే బానిసవాళ్ళు అదిరి పడి జీవదత్తుడి కేసి చూశారు. పక్కనేవున్న ఖడ్గవర్మ వాళ్ళను దగ్గిరకు రమ్మన్నట్టుగా చేయెత్తి సౌంజ్ఞచేశాడు. ఆ మరుక్షణం బానిసలు ముగ్గురూ కూడబలుక్కున్నట్టు చప్పున వెనుదిరిగి అరణ్యంలోకి పరిగెత్తారు.

జీవదత్తుడు పెద్దగా నవ్వుతూ, "ఖడ్గా, మనం దారితప్పి మతిమాలిన మనుషుల మధ్యకు వచ్చినట్టుంది. తమను కాపలా కాసేవాడు పారిపోతున్న బానిసవాడి వెంట అరణ్యంలోకి పోయినా, యింకా యీ ముగ్గురు బానిసలూ ఏం జరగనట్టు కూర పాదులకు నీళ్ళు పోస్తూనే వున్నారు. కాని, మనను చూస్తూనే దయ్యాల్ని చూసినట్టు పారిపోయారు!" అన్నాడు.

"ఇప్పుడు మనం ఏంచేసేట్టు? పారి పోయిన బానిసవాడి వెంటపడిన పెంపుడు తోడేళ్ళ అరుపులు వినబడుతున్నవా? పద, అరణ్యంలోకి పోతే, సమరబాహుణ్ణి పట్టుకు పోతున్న ఎలుగుబంటు ముఠా కనబడు తుందేమో!" అన్నాడు ఖడ్గవర్మ.

ఖడ్గ జీవదత్తులు తిరిగి అరణ్యంలోకి వచ్చారు. వాళ్ళు తోడేళ్ళ అరుపులు విన బడుతున్న వైపుకు బయలుదేరి కొంత దూరం వెళ్ళేసరికి, హఠాత్తుగా తప్పెట్లూ, డప్పులూ ఒక్కసారిగా మోగిన ధ్వని విన బడింది. ఖడ్గ జీవదత్తులు ఆ ధ్వనులు వచ్చిన వైపుకు తలలు తిప్పిచూశారు. దూరంగా చెట్ల చాటునుంచి నల్లనిపొగ లేచి, ఆకాశం మీదికి ఎగబాకుతున్నది.

"ఖడ్గా, ఆ పొగకు, ఎలుగుబంటు ముఠావాళ్ళు, సమరబాహుణ్ణి కాల్చుకు తినేందుకు వెలిగించిన మంట కారణం కాదుగదా?" అన్నాడు జీవదత్తుడు.

"అంతే కావచ్చు! త్వరగా అక్కడికి పోవటం మంచిది," అంటూ ఖడ్గవర్మ కత్తిదూశాడు. ఆ వెంటనే వాళ్ళిద్దరూ పొగ లేస్తున్న ప్రదేశంకేసి, అరణ్యానికి అడ్డంపడి పరిగెత్తసాగారు. —(ఇంకావుంది.)





# యక్షపర్వతం

## 12

[బందిపోట్ల నాయకుడైన సమరబాహుని రక్షించేందుకు బయలుదేరిన ఖడ్గ జీవదత్తులకు అరణ్యంలో ఒక చోట బానిసలతో పనిచేయిస్తున్న ఎలుగుబంటి చర్మాలు ధరించిన వాళ్ళు కనిపించారు. ఖడ్గ జీవదత్తులు వాళ్ళను సమీపించ బోయేంతలో, ఒక చోట ఎత్తుగా లేస్తున్న పొగ కనిపించింది. ఖడ్గ జీవదత్తులు అటుకేసి వెళ్ళారు. తరవాత—]

ఖడ్గ జీవదత్తులు పొగలేస్తున్న చెట్ల దగ్గిరకు పోయి ఒక ఎత్తయిన చెట్టు ఎక్కి, ఎలుగు బంటు ముఖా ఏమి చేస్తున్నదో చూడ సాగారు. పొగ లేస్తున్న చోటుకు పక్కనే భూమిలోకి చొచ్చుకు పోయిన బిలం ఒకటి వున్నది. అక్కడ ఎలుగుబంటు వాళ్ళు తాము అరణ్యంలో చంపి తెచ్చిన జంతువులను మంటల్లోవేసి కాల్చసాగారు. కొందరు తప్పెట్లూ, డప్పులూ వాయిస్తూ, ఎలుగు బంట్లతో నాట్యం ఆడిస్తూ వినోదించటం ప్రారంభించారు.

ఖడ్గ జీవదత్తులు ఆ ప్రదేశాన్ని చేరేసరికి సమరబాహుని ఎలుగుబంటు ముఖా నాయకుడు బిలం లోకి తీసుకుపోవటంతో, అతడు ఖడ్గ జీవదత్తులకు కనిపించలేదు. కాని, ఎత్తుగావున్న చెట్లకొమ్మల్లో వున్నందువల్ల వాళ్ళకు పైనుంచి బిలం లోపలికి వున్న రాతి మెట్లు కంటబడినై.



"జీవా, ఈ అడవి జాతివాళ్ళ నివాస స్థానం ఆ కనబడే బిలంలాగా వున్నది. బహుశా ఆ బిలంలోంచి అరణ్యంలోకి రహస్యమార్గం ఏదైనా వుండినా వుండొచ్చు. ఏది. వీళ్ళు సమరబాహును కాల్చుకు తింటున్న సూచనలేవీ కనిపించటం లేదే!" అన్నాడు ఖడ్గవర్మ.

జీవదత్తుడు ఆ ప్రదేశాన్ని కొంచెం సేపు పరీక్షగా చూసి, "ఈ ఎలుగ్గొడ్డు మనుషులు నరభక్షకులని స్వర్ణాచారి అనవసరంగా భయపడ్డాడని నాకు తోస్తున్నది. వీళ్ళు అరణ్యంలో వ్యవసాయం చేస్తున్న తీరు చూస్తే, వీళ్ళు దొరికిన మనుషులను బానిసలుగా ఉపయోగించుకునే జాతిగా కనిపిస్తున్నారు. సమరబాహునూ, అతడి అనుచరుల్నీ వీళ్ళు ప్రాణాలతో లోపలికి తీసుకుపోయి వుండాలి. వీళ్ళు నరమాంస భక్షకులు మాత్రం కాదు," అన్నాడు.

ఖడ్గవర్మక్కూడా అలాంటి అభిప్రాయమే కలిగింది. అతడు మరి కాస్త ఎత్తుగావున్న చెట్టుకొమ్మ మీదికి ఎక్కి, "వీళ్ళు కాలుస్తున్న వాటిల్లో మనుషుల్లేరు. అన్నీ, వాళ్ళు అరణ్యంలో వేటాడి తెచ్చిన జంతువులే!" అన్నాడు.

ఖడ్గ జీవదత్తులు ఇలా మాట్లాడుకుంటున్న సమయంలో ఎలుగుబంటు ముఠా నాయకుడు సమరబాహుణ్ణీ అతడి అనుచరుల్నీ తీసుకుపోయి వాళ్ళ గురువుగారి ముందు నిలబెట్టి, వంగి నమస్కరించి, "గురుభల్లూకా! ఈ ఇద్దరూ నాకు అరణ్యంలో దొరికారు. చూడబోతే ఇద్దరూ పౌరుషవంతుల్లాగే కనిపిస్తున్నారు. మాకు ఒక పట్టాన లొంగలేదు," అని చెప్పాడు.

గురుభల్లూకుడు సభామంటపంలా వున్న ఒక గుండ్రని సమతల ప్రదేశంలో ఎత్తుగా వున్న ఒక రాతి ఆసనం మీద కూర్చుని వున్నాడు. అతడు ముఖం మాత్రం కనిపించకుండా ఒక ఎలుగుబంటి తల తగిలించుకున్నాడు. ఆసనానికి రెండు పక్కలా రెండు భయంకరమైన తోడేళ్ళు నిలబడి, నోళ్ళు తెరిచి బందీల కేసి చూస్తు

న్నవి. ఈటెలు ధరించిన కొందరు సభా మంటపంలో అక్కడక్కడ నిలబడి వున్నారు.

సమరబాహుడికీ, అతడి అనుచరుడికీ యిక తమ చావు క్షణాలలో వున్నదనిపించింది. బహుశా, యీ ఆదిమవాసులు తమ మీదికి తోడేళ్ళను ఉసికొల్పి, వాటిచేత తమను భయంకర మరణం పాలు చేయిస్తారని వాళ్ళు భయపడ్డారు.

ఎలుగుబంటుల ముఖ్య నాయకుడు చెప్పిన మాటలు విని గురుభల్లూకుడు తలాడిస్తూ కొంచెం సేపు వూరుకుని తరవాత సమరబాహు కేసి తల ఎత్తి చూస్తూ, "ఒరే, నీ వేషం చూస్తూంటే నువ్వేదో పట్నవాసం మనిషిలా కనిపిస్తున్నావు. నీకీ అరణ్యంలో ఏం పనిపడి వచ్చావు?" అని అడిగాడు.

సమరబాహు ఒక్కక్షణం ఏం చెప్పాలా అని తటపటాయించి, "నేను పట్నవాసం వాణ్ణి కాను. సింధు ఎడారుల నుంచి యీ ప్రాంతాలకు వచ్చాను. నాకు వందల సంఖ్యలో అనుచరులున్నారు. వాళ్ళకు నేను బందీ అయిన సంగతి తెలిసి తీరుతుంది. అప్పుడు వాళ్ళు నిన్నూ, నీ బిలగృహాన్నీ సర్వనాశనం చేస్తారు." అన్నాడు భీకరమైన కంఠస్వరంతో.



"ఒరే, నీ కంచుకంఠం, నీ పౌరుష వాక్కులూ కూడా మెచ్చదగినవే!" అంటూ గురుభల్లూకుడు పెద్దగా నవ్వి, "నువ్వు చెప్పే, ఆ నీ అనుచరులు నా బిలదుర్గాన్ని సమీపించే లోపలే, నా భల్లూక భటులు వాళ్ళను తోడేళ్ళగుంపుకు ఆహారంగా వేసేస్తారు. నాతో బింకాలు పలకకు. నిన్నూ, నీ వెంటవున్న వాణ్ణీ ఎలా లొంగదీసి, నా తతిమ్మా బానిసలతో పాటు పొలం పనులు చేయించాలో నాకు తెలుసు," అన్నాడు.

గురుభల్లూకుడు మాట ముగించేలోపలే వాడి అనుచరులిద్దరు అక్కడికి పరుగు పరుగున వచ్చి, సమరబాహుణ్ణీ, అతడి అనుచరుణ్ణీ చూసి ఆగిపోయారు. గురుభల్లూకుడు వాళ్ళను, "ఏమిటి సంగతి?" అని ప్రశ్నించాడు.



వచ్చిన వాళ్ళిద్దరూ ఆ ప్రశ్న విని సమరబాహు కేసి చూడసాగారు. గురుభల్లూకుడు విసుగ్గా తలాడించి, "ఎలాంటి రహస్య విషయం విన్నా, ఈ బందీలిద్దరూ మనకు చేయగలిగిన హాని ఏమీ లేదు. వాళ్ళిద్దర్నీ ఇప్పుడే తోడేళ్ళబండ దగ్గిరకు పంపుతున్నాను," అన్నాడు.

"గురుభల్లూకా, ఇది చాలా ముఖ్యమైన సంగతి. తమరొక్కరే వినదగింది," అంటూ ఇద్దరూ తమ గురువును సమీపించి రహస్యంగా అతడితో ఏమో చెప్పారు.

గురుభల్లూకుడు ఒక్కక్షణం ఆశ్చర్యపోయి, సమరబాహును పట్టుకొచ్చిన ఎలుగుబంటు ముఠా నాయకుడి కేసి కోపంగా చూస్తూ, "నీ తెలివి తేటలు ఇలా అఘోరిస్తున్నవన్న మాట!" అని ఒక క్షణం ఆగి, "సరే, ఈ బంధితు లిద్దర్నీ తోడేళ్ళ బండ దగ్గిర వదిలిరండి. ముందు వాళ్ళ చేతికట్లు విప్పి, చెరొక ఈటె ఇవ్వండి," అన్నాడు.

గురుభల్లూకుడి ఆజ్ఞకాగానే అతడి అనుచరులు సమరబాహుడి కట్లూ, అతడి అనుచరుడి కట్లూ విప్పి, వాళ్ళ చేతికి ఈటెలిచ్చి, "ఇక నడవండి!" అంటూ వాళ్ళను ఆక్రమించి సభామంటపం పక్కనే వున్న ఒక సొరంగ మార్గంలోకి తీసుకుపోయారు.

వాళ్ళు అటు వెళ్ళగానే గురుభల్లూకుడు తన అనుచరుల కేసి తిరిగి, "ఆ కొత్త మనుషులు మన బిలరహస్యం తెలుసుకునే వుంటారు. ఏమైనా వాళ్ళను ఒక కంట కనిపెట్టి వుండండి. వాళ్ళు ఈ ప్రదేశాన్నుంచి పారిపోవాలని ప్రయత్నం చేస్తే మటుకు ప్రాణాలతో పట్టుకుని ఇక్కడికి తీసుకురండి," అని చెప్పాడు.

"చిత్తం, గురుభల్లూకా!" అని అతడి అనుచరులు పదీ పన్నెండు మంది వంగి నమస్కరించి సభామంటపం నుంచి బిలం పైకివున్న మెట్ల కేసి వెళ్ళిపోయారు.

చెట్టుకొమ్మల్లో వున్న ఖడ్గ జీవదత్తులకు పగటివేళ ఎలుగుబంటివాళ్ళ బిలాన్ని సమీపించటం సాధ్యం కాదని అర్థమైపోయింది.

ఎలుగుబంటు వాళ్ళు బిలం ముందు ఎలుగుబంట్లతో నాట్యాలు చేస్తూ, వేటాడి తెచ్చిన జంతువులను కాల్చుకు తింటున్నారు. ఆసరికి మిట్టమధ్యాహ్నమైంది. ఎండా వేడీ అరణ్యాన్ని భగ్గుమనిపిస్తున్నవి. జీవదత్తుడు చెట్టు మీది నుంచి కిందికి దిగుతూ ఖడ్గవర్మతో, "ఖడ్గా, మనం చూడవలసిన దంతా చూశాం. ఇక యిక్కడ కాలయాపన చేయటం వృథా. ఆకలి మండుతున్నది. యిక్కడ దాపుల నున్న ఏ కొలనులోనైనా స్నానం చేసి పళ్ళూఫలాలూ తిని, చీకటి పడిన తర్వాత బిలంలో ప్రవేశించే ఉపాయం ఏదైనా ఆలోచిద్దాం." అన్నాడు.

ఖడ్గవర్మ మారు మాట్లాడకుండా జీవదత్తుడితో పాటు చెట్టు దిగాడు. ఇద్దరూ నీటి కోసం వెతుక్కుంటూపోయి. త్వరలోనే ఒక పెద్ద కొలనును సమీపించారు. ఆ కొలను చుట్టూ గుబురుపొదలూ, ఎత్తయిన వృక్షాలూ వున్నవి. అరణ్యమృగాలు నీటి కోసం వచ్చి పోయే దారులు కొన్ని ఖడ్గ జీవదత్తులకు కనిపించినై.

"ఖడ్గా, మనం త్వరగా స్నానాలు ముగించి యిక్కడ్నించి దూరంగా పోవటం మంచిది. ఈ కొలనును అడవి జంతువులూ, ఎలుగుబంటు ముఠా వాళ్ళూ కూడా నీటి కోసం ఉపయోగించు కుంటున్నట్టున్నది," అన్నాడు జీవదత్తుడు.

జీవదత్తుడు యిలా అంటూ ఉండగానే అల్లంత దూరంలో వున్న పొదల్లో నుంచి నాలుగైదు అడవికోళ్ళు గగ్గోలుగా అరుస్తూ





బయటికి వచ్చినై. వాటిని చూస్తూనే ఖడ్గవర్మ "అడవికోడి మాంసం తిని చాలా రోజులైంది!" అంటూ వాటి కేసి బాణం ఎక్కుపెట్టి వదిలాడు.

బాణం రివ్వుమంటూ పోయింది. అది అడవి కోళ్ళలో దేనికీ తగలలేదు; అవి అరుస్తూ ఎగిరిపోయినై. కాని ఆ మరుక్షణానే, "గురుభల్లూకా! చస్తిని! చస్తిని!" అన్న మనిషి కేక వినిపించింది.

ఆ కేక వింటూనే ఖడ్గ జీవత్తులు ఒక క్షణ కాలం నివ్వెరపోయారు. "ఖడ్గా, ఏమిటీ వింత? నువ్వొదిలిన బాణం అడవి కోళ్ళను కాక, పొదలో దాగి వున్న ఎవరో మనిషికి తగిలినట్టుంది. గురుభల్లూకు డెవడు?" అంటూ జీవదత్తుడు పొదల కేసి పరిగెత్తాడు. ఖడ్గవర్మ కూడా అతణ్ణి అనుసరించాడు.

ఖడ్గ జీవదత్తులు చావుకేక వినబడ్డ పొదలను సమీపించేంతలో ఎలుగుబంటి చర్మాలు ధరించిన వాడొకడు వాటిల్లో గిలగిల తన్నుకుంటున్నాడు. ఖడ్గవర్మ వదిలిన బాణం వాడి గుండెల్లో దిగి వున్నది.

జీవదత్తుడు వాణ్ణి సమీపించి, "ఒరే బాబూ, నువ్వెవడివో తెలుస్తూనే వుంది. కాని మేం నిన్ను చంపాలని బాణం కొట్టలేదు. ఈ పొదల్లో ఏం చేస్తున్నావు?" అన్నాడు.

గాయపడిన వాడికి యీ మాటలు వినబడినవి కాని, వాడు జవాబిచ్చేస్థితిలో లేడు. వాడు పొదల్లో అటూ యిటూ పొర్లుతూ, "గురుభల్లూకా! గురుభల్లూకా!" అంటూ గొణగసాగాడు.

"జీవా, వీడు మరొకటి రెండు క్షణాల కన్న బతకడు. నా అనుమానం ఏమిటంటే, వీడు అడవి కోళ్ళను పట్టుకునేందుకు పొదల్లో పొంచి వున్నాడా లేక మన మీద వేగుచేస్తున్నాడా అని!" అన్నాడు ఖడ్గవర్మ.

"ఊహుఁ, నీ ప్రశ్నకు జవాబివ్వవలసిన వాడి ఆత్మ కాస్తా గురుభల్లూకుడిలో ఐక్యం అయినట్టుంది!" అంటూ జీవదత్తుడు వెనుదిరిగాడు.

ఖడ్గవర్మ ఎలుగుబంటి చర్మాలు ధరించిన వాడి కేసి పరీక్షగా చూసి, వాడిలో

ఎలాంటి చలనం లేకపోవటంతో, మరణిం చాడని గ్రహించి, తానూ జీవదత్తుడితో పాటు పొదల్లో నుంచి తిరిగి కొలను ఒడ్డుకు వచ్చాడు.

ఆ తరవాత ఇద్దరూ కొలనులో స్నానం చేసి, ఆ పక్కలనే వున్న వృక్షాల నుంచి పళ్ళుకోసుకు తిని, ఒక చెట్టు నీడన సూర్యాస్తమయకాలం వరకూ విశ్రాంతి తీసుకున్నారు. ఖడ్గ జీవదత్తు లిద్దరికీ బిలంలో వున్న వాళ్ళు తమను ఆ ప్రాంతాల వున్నట్టు తెలుసుకున్నారన్న అనుమానం కలిగింది. అయినా, సమరబాహుకి బంధ విముక్తిని చేయకుండా వెనక్కు తిరిగి పోవటం న్యాయం కాదని యిద్దరూ నిర్ణయించుకున్నారు.

సూర్యాస్తమయమై కొంత సేపటికి అరణ్యం అంతా చీకట్లు కమ్మినై. ఖడ్గ జీవదత్తులు బిలంకేసి బయలుదేరారు. ఎవరైనా తమను అనుసరించి వస్తున్నారేమో అన్న సంశయంతో వాళ్ళు చుట్టూ జాగ్రత్తగా కలయ చూస్తూ, కొద్ది సేపటికి బిలాన్ని సమీపించారు. బిలం పైన గాని, దిగువకున్న మెట్ల వద్దకాని కావలా వాళ్ళెవరూ లేరు.

"ఖడ్గా, పరిస్థితి అర్థమైంది గదా! ఈ బిలంలోవున్న ఎలుగ్గొడ్డు మనుషులు మనను చాలా తెలివిగా బంధించ బోతున్నా మని అనుకుంటున్నారు. మనం కావాలనే వాళ్ళకు బందీలుగా చిక్కుతున్నామనీ... ఆ తరవాత తమ ముఠా అంతా సర్వనాశనం కాబోతున్నదనీ, పాపం, వాళ్ళెరగరు!"



అన్నాడు జీవదత్తుడు, బిలంలోపలికున్న మెట్లు దిగుతూ.

ఖడ్గవర్మ కూడా అతడి వెనకగా మెట్లు దిగసాగాడు. ఇద్దరూ ఆ విధంగా కొన్ని మెట్లు దిగి కొంచెం చీకటిగావున్న మలుపును చేరేంతలో, పదీ పన్నెండుమంది ఎలుగ్గొడ్డు వాళ్ళు, చప్పున చీకట్లో నుంచి బయటికి వస్తూ, ఈటెలెత్తి, "ఆగండి! పారిపో జూశారో, మా ఈటెలకు ఎరచేస్తాం!" అన్నారు.

జీవదత్తుడు వాళ్ళను చూసి నవ్వుతూ, "ఒరే, మమ్మల్ని ప్రాణంలేని ఈటెలకు ఎరగా ఎందుకేస్తారు? తోడేళ్ళకు వెయ్యండి. ఆ వేసేముందు మీ గురుభల్లూకుడి దర్శనం యిప్పించండి," అన్నాడు.

ఎలుగ్గొడ్డు వాళ్ళల్లో ఒకడు చిన్న గొంతుతో, "అంత పెద్దగా మాట్లాడకండి! గురుభల్లూకుడు తన ఇష్టదేవత అయిన వృకేశ్వరి పూజలో వున్నాడు. మిమ్మల్ని ముందు తోడేళ్ళబండ దగ్గిర వదులుతాం. అక్కణ్ణించి బతికి రాగలిగితే, అప్పుడు మీకు గురుభల్లూకుడి దర్శనం తప్పక అవుతుంది," అన్నాడు.

"మహాప్రసాదం! ఆ తోడేళ్ళబండ ఎక్కడ?" అన్నాడు జీవదత్తుడు.

"తొందర పడకండి, అక్కడికే వెళుతున్నాం!" అంటూ ఎలుగ్గొడ్డు మనుషులు ఖడ్గ జీవదత్తులకు వెనకా, ముందూవుండి ఒక సొరంగంలోకి దారి తీశారు. దూరాన ఎక్కడినుంచో తోడేళ్ళ అరుపులూ, భీతిగొన్న మనుషుల కేకలూ ఆ సొరంగ మార్గంలో ప్రతిధ్వనించసాగినై.

"ఖడ్గా, ఆ కంఠస్వరాలు సమరబాహూ, అతడి అనుచరుడివై వుంటవి! తోడేళ్ళు వాళ్ళను చంపుకుతినే ప్రయత్నం చేయటం లేదు గదా?" అన్నాడు జీవదత్తుడు.

ఖడ్గవర్మ ఏదో జవాబివ్వబోయేంతలో, ఎలుగుబంటువాళ్ళల్లో ఒకడు ఈటె ఝుళిపిస్తూ, "నిశ్శబ్దం! ఒకటి రెండు క్షణాల్లో ఆ తోడేళ్ళు చేస్తున్న దేమిటో మీ కళ్ళతోనే చూస్తారు!" అన్నాడు.

—(ఇంకావుంది)





# యక్షపర్వతం

## 13

[సమరవాహుణ్ణీ, అతడి అనుచరుణ్ణీ ఎలుగుబంటు ముఖాలవాళ్ళు తమ బిలదుర్గంలోకి తీసుకుపోయారు. ఖడ్గ జీవదత్తులు పొగలేస్తున్న ప్రదేశాన్ని చేరి, అది బిలదుర్గం అని గుర్తించి, లోపలికి వెళ్ళారు. అక్కడ వాళ్ళను గుహలక్లూకుడి మనుషులు పట్టుకుని, ఒక సొరంగమార్గం వెంట తోడేళ్ళబండ దగ్గిరకు తీసుకుపోసాగారు. తరవాత—]

చీకటి మయంగా వున్న సొరంగ మార్గంలో ఎలుగ్గొడ్డు వాళ్ళు కొంత దూరం ఖడ్గ జీవదత్తులను నడిపించుకు పోయి, ఒక చోట ఆగారు. ముందున్న ఎలుగ్గొడ్డు వాడు తన తోటివాడితో, ''ఒరే, అన్నా! ఈ బందీలిద్దరూ తోడేలు బండ అంటే ఏదో వినోదస్థలం అనుకుంటున్నట్టున్నది. లోగడ మనం పట్టుకు వచ్చిన వాళ్ళు తోడేళ్ళ అరుపులు వింటూనే గజ గజ లాడిపోయే వాళ్ళు. వీళ్ళకు యింతవరకూ చీమ కుట్టినట్టన్నా లేదు. ఆ తోడేళ్ళ బండ ఏమిటో, ఎంత భయంకరమైనదో వీళ్ళకు కాస్త చూపిద్దామా?'' అన్నాడు.

ఆ మాటలకు రెండవ ఎలుగుబంటు భటుడు విసుక్కుంటూ, ''ఇక్కడే అనవసరంగా సమయం వృథా చెయ్యటం ఎందుకు? ఎలాగూ ఈ ఇద్దరూ అక్కడికే పోతున్నారుగదా?'' అన్నాడు.



"అలాకాదులే. ముందు ఆ భయంకర ప్రదేశం దర్శనం చేయిస్తే వీళ్ళకు వణుకు పుట్టుతుంది. తరవాత ఆ బండ ఎక్కుదాం," అంటూ మొందటి ఎలుగుబంటు వాడు చేతులెత్తి, చీకట్లో కొద్ది సేపు గుహ పైభాగాన్ని తడివి చూసి, ఏదో కొక్కెంలాంటి దాన్ని పట్టుకుని బలంగా లాగాడు. వెంటనే అక్కడ అమర్చివున్న చిన్నతలుపు ఒకటి తెరుచుకుని, సొరంగంలోకి వెన్నెల వెలుగు వెల్లువలా వచ్చి పడింది.

ఆ వెలుగులో ఖడ్గ జీవదత్తులు సొరంగ మార్గాన్ని పరీక్షగా చూశారు. అది చాలా ఎత్తూ, విశాలమూ అయిన పెద్ద సొరంగం. దానిలో సూటిగా పోయే మార్గం ఒక్కటే కాక, నది ఎడమల వైపునకూడా కొన్ని మార్గాలున్నవి.

"ఖడ్గా, ఇది మనం అనుకున్నట్టు ఏదో చిన్న బిలం కాదు. ఇందులో యీ ఎలుగ్గొడ్డు ముఖావాళ్ళు అవసరం అయితే బయటి ప్రపంచానికి తెలియకుండా బతికేందుకు వీలుగా ఒక గ్రామాన్ని నిర్మించి నట్టుంది," అన్నాడు జీవదత్తుడు.

జీవదత్తుడు యిలా అనగానే ఎలుగ్గొడ్డు ముఖావాడొకడు పెద్దగా నవ్వి. "ఆహా, ఎంతబాగా గ్రహించావయ్యా! ఈ బిలంలో మనుషులు నివసించేందుకు గదులేకాక, ఆహార పదార్థాలు నిలవవుంచేందుకు కొట్టాలు కూడా వున్నవి. ఏదో విధంగా మీ ఇద్దరూ తోడేలు బండ దగ్గిర్నుంచి వారం రోజుల్లో తిరిగి యీ సొరంగాన్ని చేరగలిగితే, మీ జీవితాలు గురుభల్లూకుడి సేవలో హాయిగా గడిచిపోతాయి," అన్నాడు.

"అదే మేమూ కోరుకుంటున్నాం," అని జీవదత్తుడు నవ్వి. "ఏదీ, ఆ తోడేలు బండ ప్రదేశం ఎంత భయంకరంగా వున్నదో మమ్మల్ని చూడనీ," అన్నాడు ఎలుగ్గొడ్డు భటుడితో.

ఎలుగ్గొడ్డు భటుడు తెరుచుకున్న తలుపు దగ్గిర్నుంచి యివతలికి వచ్చాడు. ఖడ్గ జీవదత్తులు అక్కడ ఎత్తుగా వున్న ఒక రాతి మీద కాళ్ళానించి బయిటికి చూశారు.

వెన్నెల కాంతిలో ఎలుగ్గొడ్డుముఖా భటుడు చెప్పినట్టు తోడేలు బండ భయంకరంగానే వున్నది. విశాలంగా వున్న ఒక సమతల ప్రదేశం మధ్య పన్నెండూ పదిహేనడుగుల ఎత్తున ఒక రాతి బండ వున్నది. దాని మీద ఇద్దరు మనుషులు ఈటెలు పట్టుకుని, కింది నుంచి తమ కేసి ఎగురుతున్న తోడేళ్ళను అదిలిస్తున్నారు. బాగా ఆకలి గొన్న తోడేళ్ళు వాళ్ళను చంపి తినేందుకు భీకరంగా అరుస్తూ, బండ చుట్టూ గిరికీలు కొడుతున్నవి.

"ధరించిన దుస్తుల తీరును బట్టి బండ మీద వున్న వాళ్ళిద్దర్లో ఒకడు సమర బాహులా కనబడుతున్నాడు!" అన్నాడు జీవదత్తుడు.

"ఏ బాహో గాని వాడూ వాడి అనుచరుడూ నాలుగైదు గంటల్లో తోడేళ్ళకు ఆహారమైపోతారు. మీరూ ఆ బండ మీదికే పోతున్నారు గనక మీకూ ఆ గతే పట్టుతుంది. కాని, వృకేశ్వరీదేవి కరుణ వల్ల మీరు బతికి రాగలిగారో, ఆ తరవాత గురు భల్లూకుడి సేవలో... ..."

ఎలుగ్గొడ్డు భటుడు మాట ముగించే లోపలే జీవదత్తుడు వాణ్ణి గట్టిగా కసురుతూ, "ఊరికే వసపిట్టలా ఆ గురుస్తోత్రం చెయ్యకు. మేం యిక్కణ్ణుంచే ఆ బండ దగ్గిరకు పోవాలి గదా? అలాగే వెళతాం. ఇక మీ దారిన మీరు వెళ్ళండి," అన్నాడు.

"ఆహా, ఎంత సాహసం! ఇక్కణ్ణుంచి తోడేలు బండ ప్రదేశానికి చేరాలంటే





ద్వారం అవతల పవడుగుల ఎత్తు నుంచి నేల మీదికి గెంతాలి. ఆ తరవాత తోడేళ్ళ మధ్యగా నడుస్తూ పోయి బండ మీది కెక్కాలి. ఈ లోపలే మిమ్మల్నవి చీల్చి చెండాడి పొట్టన పెట్టుకుంటవి!" అన్నా డొక ఎలుగ్గొడ్డు భటుడు.

"సరే, మమ్మల్నక్కడికి ఎలా చేర్చదలి చారు?" అని అడిగాడు ఖడ్గవర్మ.

"అక్కడికి పోయేందుకు మరొక చిన్న సొరంగమార్గం వుంది. ఆ మార్గం మిమ్మల్ని తోడేలుబండ లోపల వున్న ఒక రాతి తలుపు వద్దకు చేర్చుతుంది. మిమ్మల్ని ఆ దారి వెంట బండ మీదికి చేర్చుతాం," అన్నారు ఎలుగ్గొడ్డు భటులు.

"కానియ్యండి. ఈ కాలక్షేపం కబుర్లన్నీ ఎందుకు?" అన్నాడు జీవదత్తుడు. అతడికి తాము బండ మీదికి చేరేలోపలే తోడేళ్ళ నుంచి సమరబాహుకు ప్రమాదం కలగ వచ్చునన్న భయం కలిగింది. అలా జరిగితే యిన్ని శ్రమలకోర్చి తాము యీ బిలంలో ప్రవేశించటం వృథా ప్రయాస అయి వూరు కుంటుంది.

ఎలుగ్గొడ్డుభటు లిద్దరూ సొరంగం పైన తెరిచిన తలుపును యథా ప్రకారం మూసి వేసి, సొరంగంలో మరి కొంచెం దూరం ముందుకు పోయి, అక్కడ భూమి మీది నుంచి పైకి వున్న మెట్లు ఎక్కించి, ఖడ్గ జీవదత్తుల్ని కొంతదూరం తీసుకుపోయారు. అక్కడ వాళ్ళకొక నలుచదరపు రాతిపలక కనిపించింది. భటులు ఆ పలకలో బిగించి వున్న ఇనప కమ్మిని పట్టుకుని బలంగా కిందికి లాగారు. పలక పక్కకు జరిగి బండ మీద వున్న సమరబాహూ, అతడి అను చరుడూ ఖడ్గ జీవదత్తులకు కనిపించారు.

రాతిపలక పక్కకు జరిగేప్పుడయిన శబ్దం వింటూనే సమరబాహు, ఎగిరి ఒక గంతు వేసి, "అరే, చందూ! రాతిబండ పొట్ట లోంచి తోడేళ్ళు పైకొస్తున్నవి!" అంటూ అరిచాడు.

ఖడ్గ జీవదత్తులు బండ పైకెక్కుతూ, "మేం తోడేళ్ళం కాదు, నీ లాంటి మనుషు

లమే. భయపడకు సమరబాహూ! నీ మిత్రులం," అన్నారు.

ఖడ్గ జీవదత్తుల్ని చూసి సమరబాహు పొందిన ఆశ్చర్యం అంతా యింతా కాదు. అతడు ఏమో అనబోయాడు గాని గొంతు పెగలలేదు. ఇంతలో ఎలుగ్గొడ్డు భటులు రాతిపలకను పైకెత్తి కంతను మూసేస్తూ, "మీరందరూ మిత్రులేనా? అయితే తోడేళ్ల మందకు కలిసి కట్టుగా విందు భోజనం కండి," అన్నారు.



ఖడ్గవర్మ కోపంగా వాళ్ళ కేసి తల త్రిప్పేంతలో రాతిపలక దఢీమంటూ గట్టిగా మూసుకుపోయింది. జీవదత్తుడు, సమరబాహు భుజం తట్టి ధైర్యం చెబుతూ, "సమరబాహూ, భయపడకు. స్వర్ణాచారి ద్వారా సంగతంతా విన్నాం. అతడు మాకు పాత మిత్రుడు. మనం అందరం సురక్షితంగా ఈ తోడేళ్ళబండ మీది నుంచి మన నివాస ప్రాంతాలు చేరగలం. నా మాట నమ్ము," అన్నాడు.

"మనం ప్రాణాలతో యిక్కణ్ణించి బయటపడగలమా? అదెలా సాధ్యమవుతుంది? ఈ బండ పొట్టలోంచి సొరంగంలోకి ఉన్న ద్వారాన్ని ఆ దుష్టులు మూసేశారు. బండ దిగి పోవాలంటే చుట్టూ ఆకలిగొన్న తోడేళ్ళు!" అన్నాడు సమరబాహు నిస్పృహగా.

"ఆ తోడేళ్ళూ, వాటికి తాము బందీలుగా పట్టుకు వచ్చిన మనుషుల్ని మేపే ఎలుగ్గొడ్డువాళ్ళూ కూడా మనకు దారి యిస్తారు, మనం భూమిలో వున్న బిలంలో ప్రవేశించి, యిప్పుడు చుట్టూ కోటగోడల్లా వున్న గుట్టల్లోని రాతి ప్రదేశం మధ్య—ఈ బండ మీదికి చేరాం. పైన చంద్రుడు కనిపిస్తున్నాడు గదా? అంటే, ఆ దుర్మార్గులు నివసిస్తున్న బిలానికీ, ఈ ప్రదేశానికీ మధ్య వచ్చి పోయేందుకు ఒకటి రెండు తలుపులూ, ద్వారబంధాలూ మాత్రమే వున్నవి!" అన్నాడు జీవదత్తుడు.

"మీరు చెప్పింది నిజమే. అయినా మనం యీ తోడేళ్ళనూ, గుదుభల్లూకుడి



భటులనూ తప్పించుకుని ఎలా పారిపో గలమో నా కర్థం కావటం లేదు," అన్నాడు సమరబాహు.

జీవదత్తుడు మరేదో చెప్పబోయేంతలో బాగా ఆకలిగొన్న తోడేలొకటి కుప్పించి పైకెగిరి, రాతిబండలో వున్న పగుళ్ళలో ఒక చోట ముందుకాళ్ళతో బలంగా పట్టుకుని, బండపైకి పాకాలని చూసింది. ఖడ్గవర్మ చప్పున ముందుకు వంగి కత్తితో దాని తల మీద బలంగా కొట్టి, మెడ పట్టుకుని పైకి లాగి బండ మీద పడవేశాడు.

"ఖడ్గా, చాలా మంచి పనిచేశావు!" అని జీవదత్తుడు ఖడ్గవర్మను మెచ్చుకుని, "ఈ చచ్చిన తోడేలుతో మనకు పనిపడుతుంది. సమరబాహూ! ఎలుగ్గొడ్డు ముఖా వాళ్ళు యీ తోడేళ్ళకు ఆహారం ఏ సమయాల్లో వేస్తారో నీకు తెలుసా?" అన్నాడు.

"ఆ దుర్మార్గులు మాట్లాడుకుంటూండగా విన్నాను. ఈ క్రూరమృగాలకు వాళ్ళు సూర్యోదయ, సూర్యాస్తమయ కాలాల్లో ఏ జంతు మాంసమో తెచ్చి వేస్తారు. కాని వాళ్ళకు ఆ శ్రమలేకుండా యివి యీలోపలే మనను పీక్కు తినా తినవచ్చు." అన్నాడు సమరబాహు.

"ఖడ్గా, ముందు మనం చూసిన సొరంగంలోని ద్వారం గుండా వాళ్ళు తోడేళ్ళకు ఆహారం వేస్తారనుకుంటాను?" అన్నాడు జీవదత్తుడు.

ఖడ్గవర్మ దూరంగా భూమికి పది అడుగుల ఎత్తులో గోడకు బిగించి వున్న తలుపు కేసి చూసి, "తోడేళ్ళను మేపటానికి అదొక్కటే మార్గంలా కనిపిస్తున్నది. నీ ఆలోచన ఏమిటి? ఏమైనా మంచి పథకం వేయబోతున్నావా?" అని అడిగాడు.

"తోడేళ్ళ బండ మీది నుంచి తమ బందీ అయిన వాడెవడూ బతికి బయట పడలేడన్న ధీమాతో గురుఖడ్గాకుడు మనను ఆయుధాలతోనే యిక్కడ వదిలాడు. ఇదే వాడికీ, వాడి శిష్యగణానికీ ప్రమాద కారణం కాబోతున్నది." అన్నాడు జీవదత్తుడు చుట్టూ కలయచూస్తూ.

ఆ తరవాత వాళ్ళ మధ్య అంతగా సంభాషణ జరగలేదు. బాగా పొద్దు పోవటంతో ఒకరు మేలుకొని వుండి, తోడేళ్ళ నుంచి ప్రమాదం రాకుండా కావలి కాస్తూండగా తతిమ్మా వాళ్ళు బండ మీద పడుకుని నిద్రపోయారు.

సూర్యోదయం అవుతూండగా బండ చుట్టూ వున్న తోడేళ్ళు భీకరంగా అరుస్తూ సొరంగ మార్గం వైపున వున్న ద్వారం కింద తవ్వడసాగినై. వాటి అరుపులకు అందరూ మేలుకొన్నారు. జీవదత్తుడు ఖడ్గవర్మకు ద్వారాన్ని చూపుతూ, "మన ఊహ సరైనదే! ఎలుగ్గొడ్డు ముఖంవాళ్ళు అక్కడ వున్న తలుపు తెరిచి తోడేళ్ళకు అందులో నుంచి యువతులకి ఆహారం విసరబోతున్నారన్న మాట! ఏదీ, నీ విల్లంబులు బయటికి తీసి, ఆ ద్వారానికి గురిచేసి వుంచు." అన్నాడు.

జీవదత్తుడు చెప్పినట్టు ఖడ్గవర్మ బాణాన్ని ఎక్కుపెట్టి బండ మీద తాపీగా కూర్చున్నాడు. సమరబాహు అది చూసి భయపడిపోతూ, "అయ్యా, మనం ఆ దుర్మార్గుల్లో ఒక రిద్దరిని చంపి ప్రయోజనం ఏమిటి? మిగతా వాళ్ళు మరింతగా రెచ్చిపోయి మనను ఘోర దుర్మరణం పాలు చెయ్యరా?" అన్నాడు.

సమరబాహు మాటలకు జీవదత్తుడు నవ్వుతూ, "సమరబాహూ! ఇప్పుడు మనను ఆ దుష్టులు తోడేళ్ళ బండ మీద ఎక్కించి దుర్మరణం పాలు చేయాలనే గదా చూస్తు



న్నుడు! తోడేళ్ళ నోట పడి శరీరంలోని కండ కండా పీకించుకుని చావటంకన్న భయం కర మరణం ఏమున్నది?" అన్నాడు.

జీవదత్తుడు మాట ముగించే లోపలే సొరంగ మార్గం పైనున్న తలుపు కిర్రు మంటూ తెరుచుకున్నది. ఇద్దరు ఎలుగ్గొడ్డు వాళ్ళు అంతు మాంసంతో నిండి వున్న పెద్ద తట్ట నొకదాన్ని పైకెత్తి, మాంసాన్ని బయటికి వేయబోతున్నారు. అదే సమ యంలో జీవదత్తుడు హెచ్చరించగానే ఖడ్గవర్మ గురిచూసి వదిలిన బాణం రివ్వు మంటూ పోయి, ఎలుగ్గొడ్డు భటుల్లో ఒకడి నొసల మధ్య శబ్దమంటూ బలంగా తగి లింది. వాడు ఒక చావుకేక పెట్టి వెనక్కు విరుచుకు పడిపోయాడు. వాడితో పాటు రెండవ భటుడూ, మాంసం తట్టా కూడా సొరంగ మార్గంలో దభీమంటూ పడి పోయినై.

బిలంలో కలకలం లేచింది. వృకేశ్వరి దేవి ముందు పద్మాసనం వేసుకు కూర్చుని ధ్యానముద్రలో వున్న గురుభల్లూకుడికి ధ్యాన భంగం అయింది. అతడు కోపంగా లేచి నిలబడి, "ఏమిటా గందరగోళం? తోడేళ్ళబంద దగ్గిర ఆ అరుపులేమిటి? వాటి కింకా ఆహారం వెయ్యలేదా? లేక చిన్న దొరికిన బందీలనవి పట్టుకు తింటున్నవా?" అని, అప్పుడే అక్కడికి పరిగెత్తుకొచ్చిన ఒక ఎలుగ్గొడ్డు భటుణ్ణి కోపంగా ప్రశ్నించాడు.

"గురుభల్లూకా! ప్రమాదం జరిగింది. తోడేళ్ళ బందపై నున్న బందీల్లో ఒకడు మన వాణ్ణి బాణంకొట్టి చంపాడు. వాడి దగ్గిర మరికొన్ని బాణాలు కూడా వున్నవి. ఇప్పుడేం చేయటం?" అన్నాడు ఎలుగ్గొడ్డు భటుడు.

గురుభల్లూకుడు కళ్ళెర్రచేసి, ముక్కు పుటాలు అదురుతూండగా, "వృకేశ్వరీదేవి ప్రియ భక్తుణ్ణయిన నా శక్తి సామర్థ్యాల ముందు, ఆ అల్ప మానవులేపాటి! ఇప్పుడే వాళ్ళనందర్నీ నా పంచశూలానికి ఆహుతి చేయబోతున్నాను." అంటూ సొరంగ మార్గం కేసి బయలుదేరాడు.

—(ఇంకావుంది)





# యక్షపర్వతం

## 14

[గురుభల్లూకుడి శిష్యులు ఖడ్గజీవదత్తుల్ని ఒక సొరంగ మార్గం ద్వారా తీసుకుపోయి, తోడేళ్ళబండ మీదికి ఎక్కించారు. రాత్రి గడిచి తెల్లవారుతూండగా, తోడేళ్ళకు ఆహారం వెయ్యటానికి వచ్చిన భల్లూకుడి శిష్యులను ఖడ్గవర్మ బాణంతో కొట్టాడు. ఆ సంగతి తెలిసిన గురుభల్లూకుడు కోపంతో పంచశూలం తీసుకుని బయలుదేరాడు. తరవాత—]

ఖడ్గవర్మ వదిలిన బాణం దెబ్బతిని బాధ కేక పెడుతూ భల్లూకభటుడు దొరకడు సొరంగంలో పడిపోవటం చూస్తూనే, ఖడ్గ జీవదత్తులకు ఇక తమకు తోడేళ్ళ నుంచి కాక, వాటిని పెంచుతున్న భల్లూకంగాళ్ళ నుంచి ప్రమాదం వస్తుందన్న అనుమానం కలిగింది.

జీవదత్తుడు సొరంగం మీదవున్న ద్వారం కేసి కొంచెం సేపు పరీక్షగా చూసి, దాని దగ్గిరకు మరే భల్లూకభటుడూ రాకపోవటంతో తలతిప్పి, ''సమరబాహూ! త్వరలో మనకు రెండు వైపుల నుంచి ప్రమాదం రాబోతున్నది. ఒకటి; మనం నిలబడి వున్న తోడేళ్ళబండ కింద వున్న కంత వైపునుంచి, రెండవది; ఆ కనబడే సొరంగం పైనవున్న ద్వారం నుంచి,'' అన్నాడు.

ఆ మాట వింటూనే సమరబాహు వెలవెలబోయి, ''అయ్యా, ఇక్కడ మీరిద్దరూ



నాయకులు. మా ప్రాణరక్షణ మీ చేతిలో వుంది. నన్నూ, నా తోటివాళ్ళనీ ఏంచేయ మంటారో, మీరే ఆజ్ఞాపించండి," అన్నాడు.

సమరబాహు భయంచూసి, ఖడ్గవర్మకు నవ్వొచ్చింది. కాని అతడు దాన్నాపుకుని. "సమరబాహూ, నువ్వు సింధు ఎడారుల నుంచి ఏదో సామ్రాజ్యం స్థాపించేందుకు యీ పర్వతారణ్య ప్రదేశాలకు వచ్చినట్టు, విఘ్నేశ్వరపూజారీ, స్వర్ణాచారీ కూడా మాకు చెప్పారు. మనం యిప్పుడున్న ప్రాణాపాయస్థితి నుంచి బతికి బయట పడేందుకు సొంతంగా నువ్వేమైనా ఉపాయం ఆలోచించ లేవా?" అని అడిగాడు.

"ఉపాయమా? అవతలి శత్రువులు ఏ సత్క్షత్రియులో అయివుంటే కత్తిదూసి ముఖాముఖి నెదుర్కొని హతంచేసి వుండే వాణ్ణి! కాని, యీ తోడేళ్ళనూ, భల్లూక చర్మాలను ధరించి మంత్ర తంత్రాలు ప్రయోగించే మనుషుల్ని ఎలా ఎదిరించేది?" అన్నాడు సమరబాహు చేతులూ, కాళ్లూ వణుకుతూవుండగా.

జీవదత్తుడా మాటలకు నవ్వి, "సమరబాహూ, నీ ప్రతాపం చూపించటానికి సమయం ఆసన్నమైంది. మనం వున్న బండ కింది కంతకుండా శత్రువులు పైకెక్కి రాకుండా నువ్వూ, నీ అనుచరుడూ చూడండి. బహుశా, యీ సరికి తన శిష్యుడొకడు బాణం దెబ్బకు చచ్చినట్టు, ఆ గురుభల్లూకుడికి తెలిసి వుంటుంది. వాడెక్కడున్నట్టు? ఏంచేయ బోతున్నట్టు?" అన్నాడు.

జీవదత్తుడు మాట ముగించే లోపలే గురుభల్లూకుడు తోరంగ ద్వారం దగ్గిరకు వచ్చి, తోడేళ్ళబండ మీద వున్న బందీలను చూసి కళ్ళెర్రచేసి, "ఒరే, పాపండుల్లారా! బాణం కొట్టి వృకేశ్వరి భక్తుల్లో ఒకణ్ణి చంపారు. ఇక మిమ్మల్ని నా పంచకూలానికి గుచ్చి తోడేళ్ళకు ఆహారంగా వేయ బోతున్నాను." అన్నాడు భీకరమైన కంఠ స్వరంతో.



గురుభల్లూకుడి గొంతు వింటూనే అప్పటి వరకూ సారంగద్వారం కింద ఆహారంకోసం తచ్చాడుతున్న తోడేళ్ళు పెద్దగా అరుస్తూ, ద్వారం కేసి ఎగరసాగినై. వాటికి రోజూ ఆ వేళకు ద్వారం నుంచి ఆహారం అందుతూండేది. సమయానికి అది దొరక్కపోవటంతో అవి ఆకలి భరించలేక కలిసికట్టుగా తలలెత్తి మొరగసాగినై.

గురుభల్లూకుడు ద్వారంలోంచి బయిటికి తలపెట్టి తోడేళ్ళ కేసి చూశాడు. అవి పది అడుగుల ఎత్తున్న ద్వారాన్ని ఎగిరి అందుకోగలవేమో అన్న భయం అతడికి కలిగింది. అట్లని ద్వారాన్ని మూయించితే, తాను బందీలుగా పట్టుకున్న వాళ్ళు తనను పిరికి వాడికింద జమకట్టి తిరుతారు...

జీవదత్తుడు ఎలుగ్గొడ్డు వాళ్ళ గురువు ఆలోచనలు గ్రహించిన వాడిలా తన చేతిలోని దండాన్ని పైకెత్తి, "ఒరే, గురుభల్లూకా! నువ్వు భల్లూకుడివై వుండి, ఏ భల్లూకేశ్వరినో పూజించక వృకేశ్వరి నెందుకు పూజిస్తున్నావో నాకు తెలియదు. బహుశా మందమతివై వుంటావు! ఇదిగో, నేను బండ దిగి నీ సారంగద్వారం దగ్గరకు వస్తున్నాను," అన్నాడు.

జీవదత్తుడు అన్నంత పనీ చేస్తాడన్న భయంతో సమరబాహు అతణ్ణి వారిస్తూ, "అయ్యా, మీరు ఆకలిగొన్న తోడేళ్ళ మధ్యగా నడిచిపోయి, ఆ గురుభల్లూకుణ్ణి చేరాలని చూస్తున్నారా? అది చాలా ప్రమాదం. గురుభల్లూకుడు మంత్రతంత్ర విద్యల్లో ఆరితేరిన ఘటం!" అన్నాడు.

ఖడ్గవర్మ తన చేతిలో వున్న ఖడ్గాన్ని పైకెత్తి పట్టుకుని, "సమరబాహూ, ఈ ఖడ్గంలోనూ, జీవదత్తుడి చేతిలో వున్న దండంలోనూ వున్న మంత్రశక్తులు తిరుగులేనివి! అందువల్ల, గురుభల్లూకుణ్ణి చూసి భయపడకు." అన్నాడు.

ఖడ్గవర్మ మాట ముగించే లోపలే వాళ్లెక్కివున్న బండ కింద పెద్దగా ధ్వని అయింది. అది వింటూనే జీవదత్తుడు తన



పక్కన వున్నవాళ్ళను హెచ్చరిస్తూ, "జాగ్రత్త! ఆ గురుభల్లూకుడు బండ కింద వున్న దారి వెంట కొందరు శిష్యుల్ని పంపి మనను హతమార్చాలని చూస్తున్నట్టున్నది!" అన్నాడు.

ఆ హెచ్చరిక వింటూనే సమరబాహూ, అతడి అనుచరుడూ ఈటెలు పైకెత్తి బండ కింది కంత కేసి చూడసాగారు. సారంగ ద్వారం దగ్గిరవున్న గురుభల్లూకుడు అది చూసి పక్కనవున్న శిష్యుల్లో ఒకణ్ణి గట్టిగా కొప్పడుతూ, "ఒరే, చవట వెధవా! మన వాళ్ళను నిశ్శబ్దంగా పోయి, బండ కింది నుంచి హఠాత్తుగా ఆ దుర్మార్గుల మీద దాడిచేయమని చెపితే, వాళ్ళు ఏదో రణగొణధ్వని చేసి రహస్యం కాస్తా బయట పెట్టేశారు. ఇప్పుడేం దారి? ఈ బందీలు మామూలు వాళ్ళలా లేరు. ఆయుధాలతో వాళ్ళను ఆ తోడేళ్ళ బండ ఎక్కించటం, కొరివితో తలగోక్కోవటంలా అయి వూరుకున్నది," అన్నాడు.

గురుభల్లూకిది ఎత్తుగడ ఏమిటో అర్థం చేసుకున్న జీవదత్తుడు, ఖడ్గవర్మతో, "ఖడ్గా, ఇప్పుడు నువ్వు గురుభల్లూకుడి మీద బాణ ప్రయోగం చేయటం వృథా. నువ్వు విల్లంబులెత్తగానే వాడు సారంగ ద్వారం నుంచి పక్కకు తప్పుకుంటాడు," అన్నాడు.

"అది నిజమే. కాని, ఈ సమరబాహుణ్ణి రక్షించి స్వర్ణాచారి దగ్గరకు చేర్చటం ఎలా?" అని అడిగాడు ఖడ్గవర్మ.

జీవదత్తుడు కొద్దిసేపు ఆలోచిస్తూ వూరుకుని, తరవాత, "ఖడ్గా, అందుకు ఒకే ఒక ఉపాయం కనబడుతున్నది. మనం పద్మపురంరాజును అరణ్యంలో సింహాలను వేటాడుతూ పరిచయం చేసుకున్నామే— అదే పద్ధతిలో యీ తోడేళ్ళను వేటాడి, భల్లూకుడి బిలదుర్గాన్ని అల్లకల్లోల పరచాలి," అన్నాడు.

"ఊఁ, అలాగే చేద్దాం. ఇంకా ఆలస్యం ఎందుకు?" అన్నాడు ఖడ్గవర్మ ఉత్సాహంగా.

"ఆ చచ్చిన తోడేలును భుజం మీద వేసుకో. ముఖ్యంగా దాని మాంసం కోసం తోడేళ్ళు నీ వెంటబడతై. అంటే నువ్వు దొరికితే అవి నిన్ను తినకుండా వదులుతవని కాదు. నీ కత్తి కూడా చాలా పని తగులుతుంది," అన్నాడు జీవదత్తుడు.

ఖడ్గవర్మ తానంతకు ముందు చంపి బండమీదికి లాగిన తోడేలును ఎత్తి భుజం మీద వేసుకున్నాడు. జీవదత్తుడి మాటలూ, ఖడ్గవర్మ తోడేలును భుజంమీద వేసుకోవటం — ఇవేవీ అర్థంకాక, సమరబాహు, "అయ్యా, ఏమిటి మీరు చేయబోతున్నది?" అని అడిగాడు భయపడిపోతూ.

"సమరబాహూ, మనకొచ్చిన ప్రమాదం ఏమీలేదు. నువ్వు, నీ అనుచరుడూ కింది నుంచి బండ మీదికి ఎలుగ్గొడ్డు వాళ్ళవరైనా రా ప్రయత్నిస్తే, వాళ్ళను ఈటెలతో పొడవండి. మేం ఇద్దరం తోడేళ్ళ మధ్యకు దిగి, వాటిని సాధ్యమైతే గురుభల్లూకుడి బిలదుర్గంలో జొరపడేలా చేస్తాం," అన్నాడు జీవదత్తుడు.

"అయ్యలారా, ఇది చాలా దుస్సాహసం!" అన్నాడు సమరబాహు.

"ఇది సాహస మవుతుందేమో కాని, దుస్సాహసం ఎంతమాత్రం కాదు, సమరబాహూ! త్వరలో నువ్వే చూస్తావు గదా," అంటూ జీవదత్తుడు నవ్వాడు.



"జీవా! మాటలతో కాలయాపన అయిపోతున్నది. ఈ తోడేలు శవాన్ని ఎంతసేపని మోసేది?" అన్నాడు ఖడ్గవర్మ.

"మనం బండమీది నుంచి కిందికి దూకబోతున్నాం. నువ్వు బండ చుట్టూ పరిగెత్తుతూ సాధ్యమైనన్ని ఎక్కువ తోడేళ్ళను నీ వెంట పడేలా ఆకర్షించు. నీ వెన్నుకాచి నేనూ పరిగెత్తుతుంటాను. తరవాత......"

జీవదత్తుడు మాట ముగించే లోపలే ఖడ్గవర్మ, "ఒరే, గురుభల్లూకా, వస్తున్నాం! నువ్వు, నీ వృకేశ్వరీదేవీ ప్రాణాలు నిలుపుకోవాలంటే బిలదుర్గం వదిలి పారిపొండి!" అంటూ కేకపెట్టి తోడేళ్ళ బండ మీంచి



కిందికి దూకాడు. అతడి వెనగ్గా జీవదత్తుడు కూడా దూకాడు.

ఇద్దరు మనుషులు, చచ్చిన తోడేలును భుజాన వేసుకుని తమ మధ్యకు దూకి రావటం చూస్తూనే ఆకలి మీద వున్న తోడేళ్ళు ఒక్క సారిగా గొంతులెత్తి అరిచి, ఖడ్గజీవదత్తుల కేసి గుంపుగా పరిగెత్తినై. ఖడ్గవర్మ వాటికి అందకుండా ముందు వేగంగా పరిగెత్తుతూ, బండచుట్టూ తిరగ సాగాడు. వెనక జీవదత్తుడు అందిన తోడేళ్ళను తన చేతగల మంత్రదండంతో ఎత్తి విసిరివేస్తూ, తానూ పరిగెత్తసాగాడు. అతడికి తప్పనిసరైతే తప్ప, లేకపోతే తోడేళ్ళను చంపాలని లేదు......

సారంగ ద్వారం దగ్గిర నిలబడి యిదంతా చూస్తున్న గురుభల్లూకుడు పట్టలేని ఉత్సాహంతో పెద్దగా చప్పట్లు చరిచి, "అంతా ఆ వృకేశ్వరీదేవి మాహాత్మ్యం! తన శత్రువులకు మతులు పోగొట్టి, పిచ్చెత్తించి, తన వాహనాలైన తోడేళ్ళకు ఆహారంగా వేస్తున్నది. ఆహాఁ, ఆ మహాతల్లి తలుచుకుంటే చేయలేని దేమున్నది!" అంటూ భక్తి పారవశ్యంలో కళ్ళుమూసుకుని, తలపైకెత్తాడు.

అప్పటి వరకూ తోడేళ్ళను వెంట వేసుకుని వాటికి అందకుండా బండచుట్టూ, సారంగం పక్కనా గిరికీలు తిరుగుతున్న ఖడ్గజీవదత్తులకు గురుభల్లూకుడి వాలకం మంచి అవకాశంలా కనిపించింది. జీవదత్తుడు, "ఖడ్గా, యిదే మంచి సమయం! ఆ భల్లూకుడు భక్తి మైకంలో వున్నాడు!" అంటూ ఖడ్గవర్మను హెచ్చరించాడు.

ఖడ్గవర్మ మరుక్షణం తన భుజం మీద వున్న చచ్చిన తోడేలును ఎడం చేత్తో పైకెత్తి, దాన్ని గురుభల్లూకుడున్న సారంగ ద్వారంలోకి విసిరివేశాడు. తమ ఆహారం అలా ద్వారం కేసి పోవటం చూస్తూనే, వాగా ఆ ఆకలిగొన్న నాలుగైదు తోడేళ్ళు దానితో పాటు పైకెగిరి ద్వారంలోకి దూకినై. కళ్ళు మూసుకుని ధ్యానంలో వున్న గురుభల్లూకుడి మీద చచ్చిన తోడేలూ, దాని మాంసం

తినేందుకు బతికివున్న నాలుగైదు తోడేళ్లూ ఒకసారి వచ్చిపడినై.

"హా, వృకేశ్వరీ!" అంటూ గురుభల్లూకుడు తోడేళ్ళ తాకిడికి కింద పడి లేచే లోపల, వెంటవున్న వాడి శిష్యులు, "తోడేళ్ళు! తోడేళ్ళు!" అంటూ సొరంగ మార్గం వెంట పడి, బిలం మధ్యకు పరిగెత్త సాగారు.

గురుభల్లూకుడు గబగబ వణికిపోతూ లేచి నిలబడ్డాడు. అల్లంత దూరంలో పడివున్న చచ్చిన తోడేలు మీదికి కొన్ని తోడేళ్ళు వచ్చిపడి అవురావురు మంటూ తింటున్నవి. వాటి మధ్యకుపోయి తానూ తినాలని చూసి సాధ్యంకాక యివతలికి వచ్చిన ఒక్క తోడే లొకటి కోరలుచాచి గుర్రుమంటూ గురుభల్లూకుడి మీదికి దూకేందుకు సిద్ధపడుతున్నది. అది చూసిన భల్లూకుడు తన చేతిలోని శూలాన్ని పైకెత్తి, దానికి గురిచేసి, "వృకేశ్వరీ ప్రధాన భక్తుణ్ణే తినాలని చూస్తున్నావా?" అంటూ దాన్ని అదిలించి, ఒక్కొక్క అడుగే వెనక్కు వేస్తూపోయి, సొరంగ మార్గానపడి పరిగెత్త సాగాడు.

ద్వారం దిగువ యివతల మిగిలిన తోడేళ్ళను దూరంగా అదిలించి కొడుతూ నిలబడివున్న ఖడ్గజీవదత్తులకు లోపల ఏం జరుగుతున్నదో అర్థం కాలేదు. గురుభల్లూకుణ్ణి ఏదైనా తోడేలు మీదపడి పట్టుకుని గొంతు కొరికి చంపిందో లేదో వాళ్ళకు తెలియలేదు.



"ఖడ్గా, ఇక మనం యిక్కడ నిలబడి లాభం లేదు. గురుభల్లూకుడు బతికి వున్నాడో చచ్చాడో తెలియటం లేదుగాని, సొరంగంలో ప్రవేశించిన తోడేళ్ళు మాత్రం ఆ దుర్మార్గు లందర్నీ హడల గొట్టినై. బిలంలో చెలరేగిన కల్లోలపు ధ్వనులు నీకు వినబడు తున్నవిగదా?" అన్నాడు జీవదత్తుడు.

"వినబడక పోవటం ఏం? ఆ పిరికి వెధవలంతా బిలం వదిలి యీ పక్కనే అరణ్యం కేసి పరిగెత్తుతున్నారని నా అనుమానం. గురుభల్లూకుణ్ణి మాత్రం ప్రాణాలతో వదలకూడదు," అన్నాడు ఖడ్గవర్మ.

"అయితే, యిక్కడ కాలయాపన ఎందుకు? అందరం యీ సొరంగ ద్వారం కుండా బిలంలోకి జొరబడదాం. సమరబాహుణ్ణీ, అతడి అనుచరుణ్ణీ కేకవేసి, యిక్కడికి రమ్మను," అన్నాడు జీవదత్తుడు.

ఖడ్గవర్మ పిలవగానే, సమరబాహూ, అతడి అనుచరుడూ తోడేళ్ళ బండ మీది నుంచి దిగి వాళ్ళ దగ్గిరకు వచ్చారు. జీవదత్తుడు వాళ్ళతో, "సమరబాహూ! మనం యీ పైనున్న ద్వారంకుండా బిలంలో ప్రవేశించ బోతున్నాం," అన్నాడు.

సమరబాహు చుట్టూ ఓ మారు కలయ చూసి, భయం భయంగా, "మనం కొద్ది మందిమి బిలంలోవున్న అంతమంది శత్రువుల్ని జయించ గలమా? ఇటునుంచి పారిపోయి అరణ్యం చేరేందుకు మరెక్కడైనా మార్గం వున్నదేమో చూస్తే బావుంటుంది," అన్నాడు.

"అది తోడేళ్ళ బండ! బయటకు చేరటానికి బిలంలో నుంచి మాత్రమే దారి వున్నది!" అంటూ జీవదత్తుడు ఎగిరి సొరంగ ద్వారం మీది కెక్కాడు. అతడి వెనగ్గా ఖడ్గవర్మ కూడా అక్కడికి చేరాడు.

ఇంకా తెగని సంశయంతో ఏమి చేయటమా అని ఆలోచిస్తూ కింద నిలబడి వున్న సమరబాహుణ్ణీ, అతడి అనుచరుణ్ణీ మీద పడి తినేందుకు, అక్కడ యింకా మిగిలి వున్న తోడేళ్ళు ఒక టొకటిగా వాళ్ళ దగ్గిరకు రాసాగినై. —(ఇంకావుంది)





# యక్షపర్వతం

## 15

[గురుభల్లూకుడు సొరంగ మార్గం పైన వున్న ద్వారం దగ్గరకు వచ్చాడు. ఖడ్గ జీవదత్తులు చచ్చిన తోడేలును ద్వారంలోకి విసిరివేశారు. అది చూసిన తోడేళ్ళు కొన్ని సొరంగంలోకి దూకినై. వాటి వెనగ్గా ఖడ్గ జీవదత్తులు ద్వారం పైకి ఎక్కారు. కింద నిల బడి వున్న సమరబాహునూ, అతడి అనుచరుణ్ణీ తోడేళ్ళు చుట్టుముట్టసాగినై. తరవాత—]

బిలదుర్గంలో నుంచి కాక, పారిపోయేం దుకు మరేదైనా మార్గం వున్నదా అని చుట్టూ కలయచూస్తున్న సమరబాహుణ్ణి, అతడి అనుచరుడు పెద్దగా గొంతెత్తి కేక పెట్టి, "దొరా, తోడేళ్ళు మన మీదికివచ్చి పడుతున్నై, చచ్చాం!" అంటూ ఎగిరి గంతేశాడు.

సమరబాహు మీదికి వస్తున్న తోడేళ్ళను చూస్తూనే జీవదత్తుడు సొరంగ ద్వారం నుంచి కిందికి దూకి, చేతిలోవున్న దండంతో వాటిని ఎడా పెడా గట్టిగా కొట్టి, "సమర బాహూ, ఏదిఏమైనా మనం బిలదుర్గంలో జొరబడి, శత్రువులను హడలకొట్టి బయట పడాలే తప్ప, ఇటునుంచి పారిపోయేందుకు దారిలేదు. చప్పున మీ ఇద్దరూ ద్వారం మీదికి ఎక్కపొండి," అని హెచ్చరించాడు.

ఈ లోపల ఖడ్గవర్మ ద్వారం వెనక నుంచి ముందుకు వంగి రెండు చేతులూ



కిందికి చాచి, "సమరబాహూ! చందూ! త్వరగావచ్చి నా చేతులు ఆధారంగా పట్టుకుని ద్వారం మీదికి చేరండి," అని కేక పెట్టాడు.

సమరబాహూ, అతడి అనుచరుడైన చందూ వెంటనే పరిగెత్తి, ఖడ్గవర్మ చెప్పిన విధంగా అతడి చేతులు పట్టుకోగానే, ఖడ్గవర్మ వాళ్ళిద్దర్నీ ద్వారం మీదికి లాగాడు. కిందవున్న జీవదత్తుడు దండంతో చుట్టుముట్టుతున్న తోడేళ్ళను గట్టిగా అదిలించి, ఎగిరి సొరంగ ద్వారం చేరుకున్నాడు.

ఇప్పుడు నలుగురూ తామున్న సొరంగంలోకి పరీక్షగా చూశారు. గుడ్డి వెలుగులో సొరంగాన ఒక పక్కన పడివున్న చచ్చిన తోడేలు వాళ్ళ కంట బడింది. దాన్ని అక్కడికి విసిరివేసిన వాడు, ఖడ్గవర్మ.

"జీవా! ఒక రకంగా మన ఎత్తుపారినట్టే. ఈ చచ్చిన తోడేలును పీక్కుతినేందుకు నాలుగైదు తోడేళ్ళు సొరంగాన్ని చేరినవి గదా? అవీ, ఆ భల్లూకుడూ, వాడి ముఠా అంతా ఏమైనట్టు? ఇంకా బిలదుర్గంలోనే వున్నారంటావా, లేక అరణ్యంలోకి పారిపోయారా?" అన్నాడు ఖడ్గవర్మ.

జీవదత్తుడు వెంటనే ఏమీ జవాబు చెప్పకుండా కొంచెంసేపు బిలంలో నుంచి ఏవైనా ధ్వనులు వస్తున్నవేమో అని శ్రద్ధగా విని, "ఖడ్గా, బిలంలో ఎక్కడో కొంత గందరగోళం జరుగుతున్నట్టు, అస్పష్టంగా నాకు ధ్వనులు వినబడుతున్నవి. నీ కేమీ వినబడటం లేదా? అందరూ ఒకటి రెండు క్షణాలు నిశ్శబ్దంగా వుండి, జాగ్రత్తగా వినిచూడండి," అన్నాడు.

రెండు మూడు క్షణాల కాలం నిశ్శబ్దంగా గడిచింది. అందరికన్న ముందుగా చందూ, "అయ్యా, బిలంలో ఎక్కడో తోడేళ్ళు అరుస్తున్న ధ్వనులు నాకు వినబడుతున్నవి!" అన్నాడు.

సమరబాహు కళ్ళింతచేసి, తలపంకిస్తూ, "నాకు తోడేళ్ళ అరుపులే కాదు, గురు భల్లూకుడు తన శిష్యులకు చేస్తున్న హెచ్చరికలు కూడా వినబడుతున్నవి. మనం

యిక్కడ అట్టేకాలం వుండటం ప్రమాద కరం," అన్నాడు.

జీవదత్తుడు యీ మాటలకు నవ్వి, "ఎవరి భయానికి తగినట్టుగా వాళ్ళకు ఆ ధ్వనులు వినబడుతున్నవి! సమర బాహూ, నీకు వచ్చిన ప్రాణభయం ఏమీ లేదు. మా వెంటరా. బిలంలో ఎదురైన భల్లూకుడి ముఠాను చిందరవందర చేసి నిన్ను సురక్షితంగా బయిటికి తీసుకు పోతాం," అన్నాడు.

"ఏదో సామ్రాజ్యాన్ని స్థాపించాలను కుంటున్న వాడికి ప్రాణాల మీద యింత తీపి పనికిరాదు," అన్నాడు ఖడ్గవర్మ.



సమరబాహు తెగింపు వచ్చినవాడిలా చేతిలోని ఈటెను పైకెత్తి ఝళిపిస్తూ, "ప్రాణాలు పోగొట్టుకుంటే యింక రాజ్యా లను జయించి, సామ్రాజ్యం స్థాపించే దేమిటి? అందుకే నా కోర్కె నెరవేరేవరకూ నేను చావదలుచుకో లేదు!" అన్నాడు.

సమరబాహు మాటలకు ఖడ్గవర్మకు పెద్దగా నవ్వాలనిపించింది. కాని, జీవ దత్తుడు కోపంగా చూడటంతో మందహాసం చేసి వూరుకున్నాడు. జీవదత్తుడు సారంగ మార్గాన ముందు బయలుదేరుతూ, "సమర బాహూ! నా చేతిలోని మంత్రదండం, ఖడ్గవర్మ కత్తి నిన్ను మా మిత్రుడైన స్వర్ణా చారి దగ్గిరకు చేర్చుతాయి. అట్లని అవసరం అయితే, ఆత్మరక్షణకు నీ చేతిలోని ఈటెను ఉపయోగించటం మరిచేవు సుమా!" అని హెచ్చరించాడు.

ఆ తరవాత నలుగురూ సారంగ మార్గాన నిశ్శబ్దంగా ముందుకు నడవసాగారు. ముందుకుపోతున్న కొందికీ వాళ్ళకు తోడేళ్ల అరుపులూ, మనుషుల కేకలూ మరింత స్పష్టంగా వినబడసాగాయి. నాలుగైదు తోడేళ్ళు బిలంలో ప్రవేశించి, అంత మంది ఎలుగ్గొడ్డు ముఠావాళ్ళను అదరగొట్టటం ఖడ్గజీవదత్తులకు చాలా ఆశ్చర్యాన్ని కలిగించింది.

కొద్దిసేపటికల్లా వాళ్ళు సారంగమార్గంలో నుంచి బిలంలో ఎలుగ్గొడ్డు మనుషులు



నివసించే ప్రాంతాలను చేరారు. వృకేశ్వరీ దేవి కొయ్యవిగ్రహం ఉండే గదిలో గురు భల్లూకుడు వుండవచ్చునన్న అనుమానం జీవదత్తుడికి కలిగింది.

"ఖడ్గా, ఎలుగ్గొడ్డు ముఠా అంతా అరణ్యంలోకి పారిపోలేదని తెలుస్తూనే వుంది. వాళ్ళు పారిపోయి వుంటే తోడేళ్ళు యిక్కడ అరుస్తూ వుండవు గదా? మనం వాళ్ళ కంటబడకుండా బిలదుర్గం నుంచి బయటపడటం సాధ్యంకాదనుకుంటాను," అన్నాడు జీవదత్తుడు.

జీవదత్తుడు మాట ముగించేలోపలే ఒక ఎలుగ్గొడ్డు వాడు ప్రాణభీతితో కేకలు పెడుతూ వాళ్ళున్న వైపుకు పరిగెత్తుకుంటూ వచ్చాడు. వాడి వెనగ్గా తోడేలొకటి కోరలు చాచి, అరుస్తూవస్తున్నది. ఖడ్గవర్మ చప్పున ముందుకొక అడుగువేసి, కత్తితో తోడేలును ఒక్క పోటు పొడిచాడు. కత్తి దెబ్బ తిన్న తోడేలు కర్ణకఠోరంగా ఒకసారి అరిచి, వెనుదిరిగి, కిందపడుతూ లేస్తూ, పారిపోయింది.

తోడేలు నుంచి ప్రాణం కాపాడుకునే ప్రయత్నంలో పరిగెత్తుకొచ్చిన ఎలుగ్గొడ్డు మనిషి, ఎదురుగా ఖడ్గజీవదత్తులు నిలబడి వుండటం చూసి, భయంతో నిలువెల్లా కంపించిపోసాగాడు. జీవదత్తుడు అతణ్ణి సమీపించి, చిన్న గొంతుతో, "ఒరే, గురు భల్లూకుడి శిష్యుడా! నువ్వు దేవుడిలాగా సమయానికిక్కడ ప్రత్యక్షమయావు! ఇదంతా మీ వృకేశ్వరీదేవి మహిమ అయి వుంటుంది! సరే, నువు మాత్రం పెద్దగా గొంతెత్తి మాట్లాడక, అడిగిందానికి జవాబు చెప్పు," అన్నాడు.

"అబద్ధాలు చెప్పావో రెండుగా నరికి, తోడేళ్ళకు వేస్తాను, జాగ్రత్త!" అంటూ ఖడ్గవర్మ కత్తి పైకెత్తి ఎలుగ్గొడ్డువాడి కంఠానికి గురిచేశాడు.

"ఇప్పుడు చెప్పరా, బాబూ! మీ నాయకుడైన గురుభల్లూకుడెక్కడున్నాడు? మీ ముఠావాళ్ళంతా యింకా యీ బిలంలోనే వున్నారా, లేక బిలం వదిలి అరణ్యం

లోకి పారిపోయారా?" అని అడిగాడు జీవదత్తుడు.

"దొరల్లారా, మా వాళ్ళెవరూ బిలం వదిలి బయిటికి పారిపోలేదు. తోడేళ్ళకు భయపడి యీ ప్రాంతాలవున్న కొట్టాల్లో, గదుల్లో అందరూ దాక్కున్నట్టున్నది. గురుభల్లూకుడు, వృకేశ్వరీదేవి వున్న గధిలో ప్రార్థన చేసుకుంటున్నాడు," అన్నాడు ఎలుగ్గొడ్డువాడు.

"మనుషుల్ని పట్టుకుని బానిసల్ని చేసి, వెట్టిచాకిరీ చేయించుకునే మహావీరులు గదా, మీరు! తోడేళ్ళకు అంతగా భయపడి పోతున్నారేం?" అన్నాడు ఖడ్గవర్మ.

"మనుషుల్దే ముంది, దొరా! వాళ్ళకన్న కొంచెం బలవంతులకు యిట్టే లొంగి పోతారు. తోడేళ్ళలా కాదే; క్రూర మృగాలాయె!" అన్నాడు ఎలుగ్గొడ్డు వాడు.

వాడి మాటలకు జీవదత్తుడు నవ్వి, "పిరికి వేదాంతమైనా బహు పసందుగా చెప్పావ్‌రా! గురుభల్లూకుడు వృకేశ్వరీ కొయ్య విగ్రహం వున్న గదిలోవున్న మాట నిజమేగదా? అబద్ధం అయిందో నీకు చావు తప్పదు," అన్నాడు.

"అందులో అబద్ధ మేమీలేదు, దొరా! కావాలంటే మీరు పోయి చూడొచ్చు," అన్నాడు ఎలుగ్గొడ్డువాడు.

"అందులోవున్న నిజం ఎంతో యిప్పుడే తేలిపోతుంది. నువ్వు ముందుండి అక్కడికి దారితియ్యి. మోసం చేయాలని చూశావే, చిత్రవధ చేస్తాం!" అన్నాడు జీవదత్తుడు.





భల్లూకుడి శిష్యుడు ఖడ్గజీవదత్తుల్ని వెంటబెట్టుకుని కొంతదూరం నడిచి, ఎదురుగా వున్న ఒక గది కేసి చేయి చూపుతూ, "దొరా, అదే, వృకేశ్వరీదేవి మందిరం. గురుభల్లూకుడు లోపల వున్నాడు, చూడండి!" అన్నాడు.

ఖడ్గవర్మ నిశ్శబ్దంగా పోయి గది తలుపు మీద చేయివేసి, దాన్ని మెల్లిగా నెట్టి చూశాడు. తలుపుకు లోపల గడివేసివుండక పోవటంతో అది కొద్దిగా తెరుచుకున్నది. లోపల వృకేశ్వరీ విగ్రహానికి నాలుగైదడుగుల దూరంలో గురుభల్లూకుడు సాష్టాంగ పడి, కంపిత స్వరంతో ఏదో గొణుక్కుంటున్నాడు.

ఖడ్గవర్మ సౌంజ్ఞచేసి, జీవదత్తుణ్ణి దగ్గిరకు పిలిచి, గురుభలూకుణ్ణి అతడికి చూపించి, తిరిగి ఎప్పటిలా తలుపు చేరవేసి, జీవదత్తుణ్ణి కొంచెం దూరంగా తీసుకుపోయి, "జీవా, ఏమిటి నీ ఆలోచన? గురుభల్లూకుణ్ణి యిక్కడే కత్తికి ఎరచేద్దామంటావా?" అని అడిగాడు.

జీవదత్తుడు ఒకటి రెండు క్షణాలు ఆలోచిస్తూ పూరుకుని, తరవాత ఏదో మంచి ఆలోచన వచ్చినవాడిలా తలపంకిస్తూ, "ఖడ్గా, ఈ గురుభలూకుణ్ణి చంపి మనం కొత్తగా సాధించబోయే దేమీలేదు. వీడితోపాటు వీడి శిష్యుల్ని కొందర్ని చంపి, అనవసర రక్తపాతం కలిగించటం ఎందుకు? వాడు విగ్రహం ముందు సాష్టాంగపడి వున్నాడు గనక, నువ్వు నిశ్శబ్దంగా విగ్రహం వెనక్కు పోయి, వృకేశ్వరీదేవే మాట్లాడుతున్నట్టు నటించి, గురుభల్లూకుణ్ణీ, వాడి శిష్యుల్నీ, యీ బిలదుర్గం వదిలి పారిపొమ్మని హెచ్చరిక చెయ్యి," అన్నాడు.

"ఊరికే అలా పారి పొమ్మంటే వాడు పారిపోతాడా?" అని ఖడ్గవర్మ కొంచెంసేపు పూరుకుని, "నువ్వు చెప్పమన్న దానికి కాస్త కలిపి చెబుతాను. ఒక వేళ వాడు ఆ మాట్లాడేది వృకేశ్వరీదేవి కాదని గ్రహించి, నా మీదికి వచ్చాడో — కత్తితో రెండుగా నరుకుతాను," అన్నాడు.

"ఏదో ఒకటి తొందరగా కానియ్యి. వాడి సాష్టాంగ భక్తి ముగిసి, లేచి కూర్చున్నాడో, మన ఉపాయం ఏమీ పారదు," అన్నాడు జీవదత్తుడు.

ఖడ్గవర్మ పిల్లిలాగా గదిలో ప్రవేశించి, వృకేశ్వరీ విగ్రహం వెనకకూర్చుని, పెద్ద గొంతుతో, "గురుభల్లూకా, నీ భక్తికి మెచ్చాను. దైవద్రోహులు ప్రవేశించటంతో, ఈ బిలదుర్గం అపవిత్రమై పోయింది. నేను ఇప్పుడే యిక్కడ అంతర్ధానమై, యిక్కడికి తూర్పు వైపున అరణ్యంలోని కొలను గట్టున వున్న జమ్మిచెట్టు కింద ప్రత్యక్షం కాబోతున్నాను. నువ్వు శిష్యగణంతో ఆ కొలనులో శుచివై వచ్చి, నన్ను పూజించు!" అన్నాడు.

ఆ మాటలు వింటూనే గురుభల్లూకుడు అదిరిపడి లేచి నిలబడ్డాడు. వాడు విగ్రహం కేసి ఎంతో భక్తి పుట్టిపడేలా ఒకటి రెండు క్షణాలు చూసి, చేతులు జోడించి, "అమ్మా!" అంటూ ఏమో చెప్పబోయేంతలో, ఖడ్గవర్మ గట్టిగా కసురుతూ, "ఒరే, మాట్లాడకు! తిరిగి చూడకుండా, నీ శిష్యగణంతో అరణ్యంలోని కొలను గట్టుకురా!" అన్నాడు.

గురుభల్లూకుడు చెంపలు వేసుకుని, విగ్రహానికి మోకరిల్లి దణ్ణం పెట్టి, లేచి గది నుంచి బయిటికి వచ్చాడు. వాడు బయిటికి వచ్చేంతలో జీవదత్తుడూ, అతడి వెంట వున్న వాళ్ళూ, దూరంగా పోయి గోడ అవతల దాక్కున్నారు.



గురుభల్లూకుడికి వృకేశ్వరీదేవి స్వయంగా తనతో మాట్లాడిందన్న భ్రమలో ఎక్కడ లేని ధైర్యం కలిగింది. వాడు పంచ శూలాన్ని పైకెత్తి, "ఒరే, వృకేశ్వరీ భక్తుల్లారా! అంతా వెంటనే బయలుదేరి అరణ్యంలోని కొలను దగ్గరకు చేరండి! దేవి ఆజ్ఞ అయింది!" అంటూ బిల దుర్గంలో కేకలు పెడుతూ తిరగసాగాడు.

ఒక పావు గంట గడిచీ గడవక ముందే, తోడేళ్ళకు భయపడి అక్కడా యిక్కడా దాక్కున్న వాడి శిష్యులందరూ జట్లు జట్లుగా బిలంలో నుంచి బయిటికి వెళ్ళారు. తోడేళ్ళు మాత్రం యింకా బిలంలోని ఏ మారు మూలల్లోనో తిరుగుతూ అరుస్తూ నేవున్నవి.

గురుభల్లూకుడు కూడా బిలంలో నుంచి బయిటికి వచ్చి తన శిష్యులకు వృకేశ్వరీ ఆజ్ఞ ఏమిటో మరొకసారి చెప్పి, వాళ్ళతో పాటు అరణ్యం కేసి బయలుదేరాడు. కాని, వాడికి కొంత దూరం వెళ్ళింతరవాత, వృకేశ్వరి యింకా బిలంలోని తన మందిరంలో వున్నదో లేక మాయమై పోయిందో చూడాలనిపించింది. వాడికి ఆ క్షణంలో పట్టిన మూఢభక్తిలో, బిలంలో తన శత్రువులైన ఖడ్గ జీవదత్తులూ, సమర బాహూ వుండవచ్చన్న ఆలోచనే కలగలేదు...

గురుభల్లూకుడు బిలాన్ని సమీపిస్తున్న సమయంలో, ఖడ్గ జీవదత్తులు లోపల వున్న తోడేళ్ళను వెతికి, కొట్టి బయిటికి తరిమేస్తున్నారు. వాళ్ళ చేతుల్లో ఎదురు తిరిగిన ఒక తోడేలు మాత్రమే చచ్చింది. మిగతా తోడేళ్ళు బిలంలో నుంచి బయిటికి పారిపోసాగినై. వాటికి సమయానికి బిలం పైన గురుభల్లూకుడు కనిపించాడు. వెంటనే అవి పెద్దగా మొరుగుతూ అతడి కేసి పరిగెత్తినై.

గురుభల్లూకుడు ఆ తోడేళ్ళను చూసి నిలువెల్లా కంపించిపోయి, వెనక్కు తిరిగి తన శిష్యుల కేసి పరిగెత్తుతూ, "వృకేశ్వరీ మాతా, రక్షించు!" అంటూ అరవసాగాడు.

—(ఇంకావుంది)





# యక్షపర్వతం

## 16

[ బిలదుర్గంలో ప్రవేశించిన తోడేళ్ళను చూసి, గురుభల్లూకుడి అనుచరులందరూ భయకంపితులై పోయారు. ఖడ్గజీవదత్తులు బిలంలోకి పోయి, వృకేశ్వరీదేవి ఆజ్ఞాపించినట్టుగా, గురుభల్లూకుణ్ణి అరణ్యంలోకి పొమ్మన్నారు. వాడు అరణ్యంకేసి బయులుదేరాడు. ఆ సమయంలో ఆకలిగొన్న తోడేళ్ళు అతడి వెంటబడినై. తరవాత—]

గురుభల్లూకుడి చావు కేకలూ, తోడేళ్ళ అరుపులూ విన్న ఖడ్గ జీవదత్తులూ, వాళ్ళ వెంట వున్న సమరబాహూ, చందూలు త్వర త్వరగా బిలం పైకి వచ్చారు. వాళ్ళకు అరణ్యం కేసి పారిపోతున్న ఎలుగ్గొడ్డు ముఠావాళ్ళూ, వాళ్ళకు కొంచె వెనకగా పరిగెత్తుతున్న గురుభల్లూకుడూ, వాణ్ణి పట్టుకునేందుకు వెంట తగిలిన తోడేళ్ళూ కనిపించినై.

ఖడ్గవర్మ ఆ దృశ్యం చూస్తూనే కొంచెం ఆశ్చర్యపోయి, "నాలుగు తోడేళ్ళను ఎదుర్కొని చంపలేక అంత మంది వృకేశ్వరీ భక్తులు కాలి సత్తువ కొద్దీ పరిగెత్తుతూండటం నవ్వు తెప్పిస్తున్నది," అన్నాడు.

"నీ కిదంతా నవ్వుగా వున్నదేమో కాని, ఆ గురుభల్లూకుడికి మాత్రం ప్రాణాంతకంగా వున్నట్టు కనబడుతున్నది! వాణ్ణి తోడేళ్ళు కండకు కండ చీల్చి చంపటం




చూస్తూ మనం యిక్కడ నిలబడటం అన్యాయం. నువ్వు గురిచూసి బాణాలు కొట్టి, ఆ తోడేళ్ళను చంపటమో, లేక బెదిరి పారిపోయేలా చేయటమో చెయ్యి," అన్నాడు జీవదత్తుడు.

ఖడ్గవర్మ బాణం ఎక్కుపెట్టి, అన్నిటి కన్న వెనక వున్న తోడేలుకు గురిచేసి కొట్టాడు. బాణం రివ్వుమంటూ పోయి డొక్కలో బలంగా తగలగానే తోడేలు పెద్దగా అరుస్తూ, గాలిలోకి ఎగిరి దభీమంటూ కింద పడి, గిలగిలా తన్నుకో సాగింది. అది చూసిన మిగతా తోడేళ్ళలో ఒకటి చప్పున వెనుదిరిగి వచ్చి, తోడేలు మీదపడి, పీక్కు తినటం ప్రారంభించింది.

ఖడ్గవర్మ మరొక బాణం ఎక్కుపెట్ట బోయేంతలో సమరబాహు అయిష్టంగా తలాడిస్తూ, "అయ్యా, ఆ తోడేళ్ళను చంపటం ఎందుకు? ఆ గురుభల్లూకుణ్ణీ, వాడి ముఠావాళ్ళనూ అవి గొంతులు కొరికి చంపితే అందరి పీడావదిలి పోతుంది గదా." అన్నాడు.

"సమరబాహూ! ఈ భల్లూకుడూ, వాడి ముఠా చచ్చినంత మాత్రానే అందరి పీడా విరగడయితే, యిక లేనిదేమిటి? ఒక మహా కార్యం నిర్వహించేందుకు వింధ్యపర్వతాల కేసి బయలుదేరిన మేము, దారి పొడుగునా యిలాంటి పీడల్ని చూస్తూనే వస్తున్నాం," అని, జీవదత్తుడు ఖడ్గవర్మతో, "యిక్కడ నిలబడి లాభంలేదు. గురు భల్లూకుణ్ణి తోడేళ్ళనుంచి కాపాడి అరణ్యం లోని కొలను కేసి పరిగెత్తిన వాడి శిష్యగణానికీ, వాడికీ యింత ధర్మబోధ చేసి మన దారిన మనం పోదాం!" అంటూ భల్లూకుడి కేసి పరిగెత్త సాగాడు. తతిమ్మా వాళ్ళందరూ అతణ్ణి అనుసరించారు.

జీవదత్తుడు సమీపంలోకి రావటం చూస్తూనే తోడేళ్ళు మూడూ కసిగా కోరలు చాచి, పెద్దగా ఓసారి అరిచి, అరణ్యం కేసి పరిగెత్తినై. పారిపోతున్న గురుభల్లూకుణ్ణి, జీవదత్తుడు గట్టిగా కేకవేసి, "ఒరే, భల్లూకం బాబూ! కిందూ మీదూ చూసుకో

కుండా అలా పరిగెత్తి కాళ్ళూ, చేతులూ విరగ్గొట్టుకునేవు; నీ కొచ్చిన ప్రాణభయ మేంలేదు, ఆగు!'' అన్నాడు.

గురుభల్లూకుడు ఆ హెచ్చరిక వింటూనే ఆగి, వెనక్కి తిరిగి చూశాడు. వాడికి శత్రువుల నుంచి పారిపోలేననీ, శరణువేడితే ప్రాణరక్షణ జరగవచ్చనీ ఆశ కలిగింది. జీవదత్తుడూ, అతడి అనుచరులూ దగ్గిరకు రాగానే వాడు రెండు చేతులూ జోడించి నమస్కరిస్తూ, ''అయ్యా, నన్ను చంప కండి. చేసిన పాపాలకు ఎలాంటి ప్రాయ శ్చిత్తం చేసుకోమన్నా చేసుకుంటాను,'' అన్నాడు.

''ప్రాయశ్చిత్తంతో నీ పాపాలు పరిహారం అయిపోతవో లేదో నాకు తెలియదుగాని, లోగడ నీ చేతుల్లో చచ్చిన వాళ్ళెవరూ తిరిగి బతికిరారు గదా? ఇంతకూ నువ్వు యీ అరణ్యంలో ఏ వ్యవసాయమో చేసుకుని జీవించక యీ తోడేళ్ళ పెంపకం, వృకేశ్వరీ ఉపాసనలూ ఎందుకు ప్రారం భించావు?'' అని అడిగాడు జీవదత్తుడు.

''నలుగురి మీదా అధికారం చెలా యిస్తూ సుఖంగా బతకాలంటే యింతకన్న మంచి మార్గం నాకేమీ కనిపించలేదు, దొరా. మీరిక్కడికి వచ్చేవరకూ నాకు అంతా హాయిగానే జరిగిపోయింది. ఆ తర వాత వృకేశ్వరీదేవి ఎందువల్లనో నన్ను



చిన్న చూపు చూసింది,'' అన్నాడు గురు భల్లూకుడు నిరుత్సాహంగా.

''మరైతే నువ్విప్పుడు ఏం చేయబో తున్నావ్? నీ శిష్యగణమంతా నిన్ను తోడేళ్ళకు వదిలి అరణ్యంలోకి పారిపోయి నట్టుందే!'' అన్నాడు ఖడ్గవర్మ.

''దొరా, నా శిష్యులెవరూ నన్నొదిలి పారి పోలేదు. వాళ్ళు అరణ్యంలోని కొలను దగ్గిర వెలవనున్న వృకేశ్వరీదేవిని పూజిం చేందుకు వెళ్ళారు. ఆ దేవి యింతకు ముందే బిలదుర్గంలో నుంచి అంతర్థానమై పోయింది,'' అన్నాడు గురుభల్లూకుడు.

''సరే, అక్కడికే పోదాం పద. ఆ దేవి నీకు ఎలాంటి శిక్ష యివ్వమంటుందో అడిగి



తమ గురువు అలా చెప్పగానే పారిపోయి వస్తున్న ఎలుగ్గొడ్డు వాళ్ళలో నలుగురు ఖడ్గజీవదత్తులున్న చోటుకు వచ్చి, తమ గురువువైన భల్లూకుడితో, "గురుభల్లూకా! అరణ్యంలోని కొలను దగ్గిర అయిదారుగురు ఒంటెల వాళ్ళున్నారు. వాళ్ళ నాయకుడైన స్వర్ణాచారి అనే వాడు మనవాళ్ళలో ఇద్దర్ని చంపి, ఐదుగుర్ని చుట్టుముట్టి పట్టుకున్నాడు. మేం వాళ్ళకు దొరక్కుండా, యీ దుర్వార్త మీకు చెప్పేందుకు పారిపోయి వచ్చాం," అని చెప్పారు.

స్వర్ణాచారి పేరు వింటూనే ఖడ్గజీవదత్తులూ, సమరబాహూ పొందిన ఆశ్చర్యం అంతా యింతా కాదు. ఎక్కడో కొండ మీద కోట కట్టే ప్రయత్నాల్లో వున్న స్వర్ణాచారి నలుగురైదుగురు అనుచరుల్ని వెంట బెట్టుకుని, ఇక్కడి కొలను ప్రాంతానికి ఎందుకొచ్చినట్టు?

సమరబాహును శత్రువుల నుంచి రక్షించి తీసుకు వస్తామని వాగ్దానం చేసి ఖడ్గజీవదత్తులు బయలుదేరి అరణ్యంలోకి వచ్చిన తరవాత, అక్కడ స్వర్ణాచారి వుంటున్న కొండప్రాంతాల పెద్ద గంద్రగోళం జరిగింది. ఆ ప్రాంతా లన్నిటినీ వీరసింహుడనే రాజు పరిపాలిస్తున్నాడు. అతడి రాజధానీ నగరమైన వీరపురానికీ, స్వర్ణాచారి కోట కడుతున్న కొండప్రాంతాలకూ మధ్య

చూస్తాను," అంటూ జీవదత్తుడు ముందుకు కదిలాడు.

అందరూ కలిసి కొంతదూరం నడిచి అరణ్యాన్ని సమీపించ బోయేంతలో చెట్ల చాటు నుంచి కొందరు ఎలుగ్గొడ్డు ముఖా వాళ్ళు కేకలు పెడుతూ వాళ్ళకేసి పరిగెత్తుకు రాసాగారు. వాళ్ళల్లో ముందు వస్తున్న వాళ్ళు, తమ గురువుతోపాటు వున్న ఖడ్గజీవదత్తుల్ని చూస్తూనే భయకంపితులై పోయి, పారిపోబోయేంతలో గురుభల్లూకుడు వాళ్ళను కేకవేసి, "మనకొచ్చిన ప్రాణభయం ఏమీలేదు. వృకేశ్వరీ కృప వల్ల యీ దొరలు మనకెలాంటి హానీ చెయ్యమని అభయం యిచ్చారు," అన్నాడు.

పెద్ద అరణ్యం వున్నది. వీరసింహుడు ఆ అరణ్యంలో నివశిస్తున్న అన్ని రకాల అడవిజాతి మనుష్యుల మీదా తనదే ఆధిపత్యం అనుకుంటూండే వాడు. అప్పుడప్పుడూ వాళ్ళ మీద దాడులు చేసి, వాళ్ళ నుంచి కప్పంగా జంతుచర్మాలూ, వాళ్ళు తినే వెదురుబియ్యం, కాయా కసవులూ వసూలు చేస్తూండే వాడు. ఇలాంటి పద్ధతుల ద్వారా తాను, ఆ అడవి జాతుల కన్నిటికీ ప్రభువైనట్టు వాళ్ళకు గుర్తు చేస్తున్నానని ఆత్మతృప్తి పొందేవాడు.

వీరసింహుడికి ఆ మధ్య చారుల ద్వారా అరణ్యంలోని కొండ ప్రాంతాలకు ఒంటెలు వాహనాలుగా గల వాళ్ళు కొందరు వచ్చారని తెలిసింది. తరవాత కొన్నాళ్ళకు ఎలుగుబంటి చర్మాలు ధరించే ముఠా ఒకటి అరణ్యంలోని ఒక పెద్ద బిలాన్ని ఆక్రమించి, ఆ చుట్టుపక్కల తిరిగే మనుషుల్ని బానిసలుగా పట్టుకుని, వెట్టి చాకిరీ చేయించు కుంటున్నారన్న వార్త అందింది.

వీరసింహుడు మొదట్లో యీ ఒంటెల వాళ్ళను గురించీ, ఎలుగ్గొడ్డు ముఠాను గురించీ అంతగా పట్టించుకోలేదు. అరణ్యంలో ఆ రెండు ముఠాలూ ఒకళ్ళ నొకళ్ళు హతంచేసు కుంటారనీ, అంతగా గెలిచిన వాళ్ళు బలవంతులైతే, వాళ్ళ



సంగతి అప్పుడు చూడవచ్చనీ పూరుకున్నాడు.

వారం రోజుల క్రితం వీరసింహుడి జంతు ప్రదర్శన శాలాధికారి పది మంది సైనికులను వెంట బెట్టుకుని జంతుశాలకు కొత్త మృగాలను పట్టుకు వచ్చేందుకు అరణ్యానికి వచ్చాడు. వాళ్ళు వలలువేసి, బోన్లు పెట్టీ కొన్ని అడవి పక్షులనూ, పులులనూ పట్టుకుని మధ్యాహ్నం వేళ ఒక వాగు ఒడ్డున విశ్రాంతిగా కూర్చుని భోజనాలు చేస్తున్నారు.

రాజుగారి సైనికుల్లో ఒకడు అందరికన్న ముందుగా భోజనం ముగించి, ఎండ వేళప్పుడు చెట్లకొమ్మల్లో, ఏవైనా వింత



పక్షులు కనబడతవేమో అని చెట్ల కిందుగా నడుస్తూ, అరణ్యంలో కొంత దూరం పోయాడు. వాడికి హఠాత్తుగా ఒక చోట చెట్లకు కట్టివున్న నాలుగు ఒంటెలు కనిపించినై.

ఆ సైనికుడు ఒంటెలను గురించి విన్నాడేగాని, ఎన్నడూ చూసి వున్నవాడు కాదు. ఆ జంతువు లెక్కడో ఎడారి ప్రాంతాల వుంటవని వాడనుకున్నాడు. కాని, అవి వీరపుర రాజ్యపు అరణ్యాల్లో కనబడే సరికి, వాడు ఆనందాశ్చర్యాలతో కిందు మీదైపోతూ వాగు దగ్గిరకు పరిగెత్తుకు వచ్చి, జంతు ప్రదర్శన శాలాధికారితో ఆ శుభవార్త చెప్పాడు.

"ఒంటెలా! ఏవీ? ఎక్కడ? మన ప్రదర్శనశాలలో లేనివి ఉష్ట్రమూ, ఉష్ట్ర పక్షీ మాత్రమే. ఒక ఉష్ట్రమూ, ఉష్ట్రికా వుంటే మన రాజుగారి కెంత కీర్తి! రాజ్యాని కెంత పేరు!" అంటూ ఉత్సాహం పట్టలేక వడవడ వణకసాగాడు.

ఆ మాటలకు ఒంటెలను చూసి వచ్చిన సైనికుడు కాస్త నిరుత్సాహపడి, "అయ్యా, ఆ ఒంటెలు నాలుగూ తాళ్ళతో చెట్లకు కట్టి వేయబడివున్నవి. ఆ మాట చెప్పాను, మీరు సరిగా విన్నట్టులేదు. వాటికి యజమాను లెవరో వున్నట్టుంది," అన్నాడు.

"యజమాను లుంటే మనకేం? ఈ వీర పుర రాజ్యంలో వున్న ప్రజలకూ, అరణ్యాలకూ, నీటికీ, గాలికీ—ఒక్కమాటలో రాజ్యం పైన విస్తరించి వున్న ఆకాశాని కూడా యజమాని మన వీరసింహ మహా రాజులుంగారు. తెలిసిందా? మీలో ఇద్దరు ముగ్గురుపోయి ఆ ఒంటెలను యిక్కడికి తోలుకురండి. వాటి యజమానులన్నావే; వాళ్ళు కనిపిస్తే, వాళ్ళను కూడా యిక్కడికి వచ్చి నా దర్శనం చేసుకోమనండి," అన్నాడు జంతుశాలాధికారి.

సైనికులకు భయంగా వున్నా, తమ పైఅధికారి ఆజ్ఞ నిర్వహించక తప్పదు గనక, నలుగురు బయలుదేరి ఒంటెలున్న చోటుకు వెళ్ళారు. ఒంటెలు ఎప్పటిలాగే

చెట్లకింద పచ్చికమేస్తూ కనిపించినై. దగ్గిర్లో ఎక్కడా వాటి యజమానులున్న సూచనలు కనబడలేదు. సైనికులు ధైర్యంగాపోయి చెట్లకు కట్టివున్న వాటి తాళ్ళను ఊడదీయ బోయారు. ఆ సమయంలో కొత్తమనుషుల్ని చూసి భయపడిన ఒక ఒంటె వికృతంగా సకిలించి, వెనక కాళ్ళతో చెట్లబోదెలను తన్నుతూ గడబిడ ప్రారంభించింది. దాన్ని చూసి తతిమ్మా ఒంటెలు కూడా గొడవ చేయసాగినై.

ఉదయానే అరణ్యానికొచ్చి, బాగా ఎండ ఎక్కేవరకూ వేటాడి అలసిపోయిన సమర బాహు అనుచరులు నలుగురు ఆ దాపుల్లోనే వున్న ఒక నీటి కొలను దగ్గిర, చెట్ల నీడలో కూర్చుని విశ్రాంతి తీసుకుంటున్నారు. వాళ్ళకు ఒంటెలు చేస్తున్న గోల విన బడింది. ఏ సింహమో, పులో వచ్చి వాటి మీద పడివుంటుం దనుకుంటూ వాళ్ళు కత్తులు దూసి పరుగు పరుగున ఒంటెలున్న చోటుకు వచ్చారు.

ఒంటెల తాళ్ళు విప్పుతున్న రాజ సైనికులు చెట్లవెనక నుంచి వస్తున్న అడుగుల చప్పుడు విని తలలెత్తి చూశారు. వాళ్ళకు కత్తులు పైకెత్తి వేగంగా వస్తున్న సమరబాహు అనుచరులు కనిపించారు. వెంటనే సైనికులు కూడా కత్తులు దూసి, కొంచెం వెనక్కుపోయి నిలబడ్డారు.



సమరబాహు అనుచరుల్లో ఒకడు కోపంతో పళ్ళుకొరుకుతూ, "ఎవర్రా మీరు? సైనిక దుస్తులు వేసుకున్న దారి దొంగల్లావున్నారు! ఒంటెలను అపహరించటం మీ బోటి అల్పులవల్ల అయేపనేనా?" అన్నాడు.

"మేం దారిదొంగలం కాదు, వీరసింహ మహారాజుగారి సైనికులం. మీ ఒంటెలను అపహరించుకు పోవటం లేదు; పుల్లరి కట్టకుండా రాజుగారి అరణ్యంలో మేపుతున్నందుకు వాటిని బందెలదొడ్డికి తోలుకు పోతున్నాం," అన్నాడొక తెలివైన సైనికుడు.

"ఎవరా వీరసింహ మహారాజు? ఇక్కడ అధికారమంతా సమరబాహు మహారాజుగారిదే, తెలిసిందా? వారి ఒంటెలను

దొంగిలించటానికి వచ్చిన మిమ్మల్ని విచారించి శిక్షించుతాం. ఆయుధాలు కింద పడవేసి లొంగిపోండి!" అంటూ సమరబాహు అనుచరులు ముందుకురికారు.

పారిపోయే అవకాశం లేదని తెలుసుకున్న వీరసింహుడి సైనికులు వాళ్ళను ఎదిరించారు. అప్పుడు జరిగిన కత్తియుద్ధంలో ఇద్దరు రాజసైనికులు చచ్చారు, ఒకడు గాయపడ్డాడు, నాలుగో వాడు ఎలాగో సమరబాహు అనుచరులకు అందకుండా, కాలి సత్తువకొద్దీ పరిగెత్తి వాగు ఒడ్డున వున్న జంతుప్రదర్శనశాలాధికారిని చేరాడు.

శరీరం మీద అక్కడక్కడా నెత్తురు మరకల్తో, ఆయాసపడుతూ తన దగ్గిరకు పరిగెత్తుకొస్తున్న సైనికుణ్ణి చూస్తూనే జంతుప్రదర్శనశాలాధికారి, "ఇది వింతగా వుందే! నేను చదివిన జంతుశాస్త్రంలో ఎక్కడా ఒంటెలు మాంసాహారులని లేదు. ఆశ్చర్యం! నీ వెంట వచ్చిన తతిమ్మా ముగ్గుర్నీ అవి చంపి తినేసినయ్యా?" అని అడిగాడు.

"అయ్యా, ఒంటెలు కాదు, వాటి యజమానులు నన్నిలా గాయపరిచారు. నా వెంట వచ్చిన ముగ్గురూ వాళ్ళ కత్తులకు బలైపోయారు. వాళ్ళెవరోగాని కత్తి తిప్పటంలో ఆరితేరిన ఘటాల్లా వున్నారు." అన్నాడు సైనికుడు.

"మన కన్న కత్తియుద్ధంలో మొనగాళ్ళు యీ లోకంలో వున్నారంటే నేను నమ్మను," అంటూ జంతుప్రదర్శనశాలాధికారి కత్తి దూసి నిలబడ్డాడు. అతడితోపాటు మిగతా సైనికులు కూడా నిలబడ్డారు.

గాయపడి వచ్చిన సైనికుడు, తాను పారిపోయి వచ్చిన దిక్కుకేసి తలతిప్పి చూసి, తమ కేసి వస్తున్న సమరబాహు సైనికులు కళ్ళబడగానే, "అయ్యా, మీ అనుమానమేదో త్వరలోనే తీరిపోతుంది. అరుగో, వాళ్ళటే వస్తున్నారు!" అన్నాడు.

జంతుప్రదర్శనశాలాధికారి తన పక్కన వున్న సైనికులను హెచ్చరించి, కత్తి పైకెత్తి, సమరబాహు అనుచరులకేసి బయలుదేరాడు. —(ఇంకావుంది)





# యక్షపర్వతం

## 17

[గురుభల్లూకుణ్ణి వెంటబెట్టుకుని, ఖడ్గజీవదత్తులు అరణ్యంలోని కొలను దగ్గిరకు వెళ్ళారు. అక్కడ వారికి వ్యాఘ్రదారి కనిపించాడు. సమరబాహు లేని సమయంలో అతడి అనుచరులకూ, వీరపురంరాజు సైనికులకూ దొమ్మీయుద్ధం ప్రారంభమైంది. రాజ సైనికులు కత్తులు దూసి, సమరబాహు అనుచరుల మీదికి ఉరుకులువేశారు. తరవాత—]

వీరపుర రాజుగారి జంతు ప్రదర్శనశాలాధికారి వెంట యిప్పుడు ఏడుగురు సైనికులు మాత్రమే వున్నారు. వాళ్ళల్లో ఒకడు సమరబాహు అనుచరులవల్ల గాయపడి కుంటుతూ తతిమ్మావాళ్ళ వెనగ్గా వస్తున్నారు. సమరబాహు అనుచరులు నలుగురూ రాజసైనికులు తమకన్న కొంచెం అధికంగా వున్నా, ధైర్యంచేసి వాళ్ళ మీద కలియబడేందుకు తయారయారు.

జంతు ప్రదర్శన శాలాధికారి, సమరబాహు అనుచరులకు కొద్ది దూరంలో ఆగి, "ఒరే, మీ వాలకం చూస్తూంటే, మీరేదో బిడారు వర్తకుల్లా కనిపిస్తున్నారు. నెత్తి మీద పాగా చుట్టుకునే పద్ధతదేనా? కత్తి పట్టే తీరుకూడా మీకు తెలిసినట్టులేదే!" అన్నాడు ఎంతో హుందాతనం కనబరుస్తూ.

ఈ మాటలు సమరబాహు అనుచరులకు అవమానకరంగా తోచి, చాలా కోపం



తెప్పించినై. వాళ్ళు నలుగురూ మీసాలు దువ్వి, ఒక్కసారిగా పెద్ద పెడబొబ్బ పెట్టి, "మా కత్తి దెబ్బ ఎలాంటిదో రుచిచూసిన ఏ సైనికులు ముగ్గురు యీ ప్రాంతాలే నేలకరిచి వున్నారు. భూమ్మీద నూకలుండి కాస్తలో తప్పుకున్న మరొకడు నీ వెనకాలే ఉంటుంటూ వస్తున్నాడు. ఇప్పుడు కాచు కొండి! సమరబాహుకూ, జై! కొండకోట నగరానికీ, జై!" అంటూ దూకుడుగా వచ్చి, వీరసింహుడి సైనికుల మీద పడ్డారు.

ఆ తరవాత సమరబాహు అనుచరులకూ, వీరసింహుడి సైనికులకూ మధ్య ఎంతో సేపు యుద్ధం జరగలేదు. వీరసింహుడి సైనికుల్లో ముగ్గురు మొదటి తాకిడికే, సమరబాహు అనుచరుల కత్తి దెబ్బలకు నేల కొరిగారు. లోగడ గాయపడిన సైనికుడూ, జంతు ప్రదర్శనశాలాధికారి వెనుదిరిగి చెట్లకు అడ్డంపడి పారిపోసాగారు. తమపై అధికారి పారిపోవటం చూసిన, మిగతా ఇద్దరూ కత్తులు కింద పడవేసి సమరబాహు అనుచరులకు లొంగిపోయారు.

ఈ జరిగిన చిన్న దొమ్మీ యుద్ధంలో తాము సాధించింది స్వల్ప విజయమే అయినా, సమరబాహు అనుచరులు నలుగురూ ఎక్కడలేని ఆనందంతో కత్తులు పైకెత్తి, "సమరబాహు మహారాజుకూ, జై!" అంటూ అరణ్యం దద్దరిల్లేలా కేకలు పెట్టారు.

సమరబాహు అనుచరుల కేకలూ, అంతకు ముందు జరిగిన పోరాటంలో రేగిన రణగొణ ధ్వనులూ విని, ఏమి జరుగుతున్నదో చూద్దామని కొందరు ఆటవికులు ఆ ప్రదేశానికి వచ్చారు. వాళ్ళకు లొంగిపోయి తలలువంచుకు నిలబడివున్న వీరసింహుడి సైనికులూ, కత్తులెత్తి కోలాహలం చేస్తున్న సమరబాహు అనుచరులూ కనిపించారు.

ఆటవికులకు ఎవరెవరి మధ్య పోరాటం జరిగిందో, ఎవరు ఓడి ఎవరు గెలిచారో అర్థంకాలేదు. వాళ్ళకు వీరసింహరాజుగారి సైనికులు తెలుసు. ఇప్పుడు వాళ్ళు,

కత్తులు పడవేసి నిలబడివున్న ఆ సైనికులను చూస్తూనే, మరేదో రాజుగారి సైనికులు వాళ్ళను యుద్ధంలో జయించారని భావించారు. ఈ కొత్త రాజసైనికులెవరు?

సమరబాహు అనుచరులు ఆటవికుల ఆశ్చర్యం గమనించి, "మీరీ అరణ్యంలో నివసించే వాళ్ళుగదా? ఇకనుంచి మీరు వీరపురం రాజుకు కప్పం కట్టనవసరం లేదు. మా రాజైన సమరబాహు మీ అందరి మీదా అధికారి. ఆయన్నే మీరు రాజుగా గుర్తించి కప్పం చెల్లించండి, తెలిసిందా?" అన్నారు ఆజ్ఞాపిస్తున్నట్టు.



ఆటవికుల్లో కొంచెం వయసు మళ్ళిన వాడొకడు ముందుకొచ్చి, "అయ్యా, మీరు చెప్పినట్టే చేస్తాం. మా వాళ్ళల్లో వీరపురం చూసినవాళ్ళూ, అఖరుకు ఆ నగరాన్నేలే వీరసింహ మహారాజును చూసినవాళ్ళూ కూడా కొందరున్నారు. కొప్పతకండి—తమ నగరం ఎక్కడ?" అని అడిగాడు భయం భయంగా.

సమరబాహు అనుచరుల్లో ఒకడు చేయెత్తి దూరంగా వున్న కొండల కేసి చూపిస్తూ, "అదుగో, ఆ చెట్ల చాటున కనిపిస్తున్నవే. ఆ కొండల మీదే మా కోట వున్నది. కావాలంటే మీలో కొందరు మా వెంట వచ్చి, ఆ దారిమార్గం ఒకసారి చూసి, మీ మీ గూడెలలో క్షేమం చెప్పిన సంగతులన్నీ అందరికీ తెలిసేలా టముకుమా వేయండి," అన్నాడు.

ఆటవిక ముసలాడు ఏదో చెప్పబోయేంతలో దూరంగా గుర్రాలు సకిలించిన ధ్వని అయింది. అది వింటూనే సమరబాహు అనుచరులు అదిరిపడ్డారు. వాళ్ళల్లో ఒకడు ఆ ధ్వనివచ్చిన వైపు కేసిచూస్తూ, తన మిత్రులతో, "అరెరె! పెద్ద పొరబాటు జరిగిపోయింది. శత్రువుల్లో యిద్దరు తప్పించుకుని పారిపోయారు. ఆ గుర్రాలు వాళ్ళు తెచ్చినవే అయివుంటవా? మరి కొందర్ని కూడగట్టుకుని వాళ్ళు మన మీదికి తిరిగి యుద్ధానికి రావటం లేదు గదా!" అన్నాడు.



ఈ అనుమానం కలగ్గానే సమరబాహు అనుచరులు నలుగురూ, ఆత్మరక్షణకు సన్నద్ధులయారు. కాని, ఒకటి రెండు క్షణాలు జరిగీ జరక్కముందే ఇద్దరు ఆటవికులు, రెండు గుర్రాలను కళ్ళాలు పట్టుకుని వాళ్ళున్న చోటుకు తీసుకువచ్చారు.

ఏం జరిగిందో తెలియక సమరబాహు అనుచరులు కళ్ళప్పగించి చూస్తూన్నంతలో, ఆటవిక ముసలాడు, గుర్రాలు తెచ్చిన వాళ్ళను, "ఇదేమిటి? వీటిని మీ రెక్కడ పట్టుకున్నారు?" అని అడిగాడు.

"వీరపురం రాజుగారి సైనికుల్లో ఇద్దరు గుర్రాలెక్కి పారిపోతూ, ఆ దాపుల చెట్లకు కట్టి వున్న మిగతా గుర్రాల తాళ్ళను కత్తులతో నరికి, వాటిని దూరంగా తరిమేయాలని చూశారు. మేం వాటిల్లో యీ రెంటినీ తరిమి, లాఘవంగా పట్టుకున్నాం," అన్నారు గుర్రాలను తెచ్చిన ఆటవికులు.

"మా రాజుగారికి చెప్పి, మీ లాఘవానికి తగిన బహుమతి యిప్పిస్తాం. ఈ గుర్రాలు రెంటినీ మా వెంట కొండకోట నగరానికి పట్టుకురండి," అన్నాడొక సమరబాహు అనుచరుడు.

ఆటవికులిద్దరూ అందుకు అంగీకరించారు. సమరబాహు అనుచరులు తమకు బందీలుగా దొరికిన వీరసింహుడి సైనికులిద్దరినీ వెంటబెట్టుకుని, తమ ఒంటెలున్న చోటుకు బయలుదేరారు. హఠాత్తుగా వాళ్ళ వెనక వస్తున్న ఆటవికుడొకడు, "అయ్యా, బోనుల్లో వున్న సింహం, పులుల మాటేమిటి? అడవి పక్షులు కొన్ని వలల్లో చిక్కుకుని చెట్టుకొమ్మల నుంచి వేళ్ళాడుతున్నవి— వాటిని అక్కడే వదిలేయదలిచారా?" అని అడిగాడు.

ఈ ప్రశ్న వింటూనే సమరబాహు అనుచరులు తక్కున ఆగిపోయి, బందీలయిన వీరసింహుడి సైనికులను ఆ మృగాలను గురించీ, పక్షులను గురించీ అడిగారు. సైనికులు తాము జంతుప్రదర్శనశాలాధికారితో అరణ్యానికి వచ్చిన పని సంగతి వాళ్ళకు చెప్పి, ఆ సింహాన్ని పులుల్నీ,

పక్షుల్ని తామే పట్టుకున్నామని తెలియపరిచారు.

"బావుంది! ఈ పశుపక్ష్యాదులన్నీ సమరబాహు మహారాజుగారి జంతుప్రదర్శన శాలలో సుఖంగా జీవిస్తాయి. రండి, వాటిని కొండకోట నగరానికి తీసుకుపోదాం," అన్నారు సమరబాహు అనుచరులు.

ఈ సారి సమరబాహు అనుచరుల వెంట ఆటవికులంతా బయలుదేరి వచ్చారు. ఆటవికుడు చెప్పినట్టు బోనులో చిక్కిన సింహం, దాని చువ్వలను కాళ్ళతో కొడుతూ, నోటితో కొరుకుతూ భీకరంగా గర్జిస్తున్నది. పులులు కూడా తాము చిక్కిన బోనుల్లో నుంచి భయంకరంగా అరుస్తూ, నానా గొడవా చేస్తున్నవి. ఇక వలల్లో చిక్కి, చెట్లకొమ్మలకు వేలాడదీయబడిన అడవి పక్షుల రొద అంతా యింతా కాదు.

సమరబాహు అనుచరులు వాటన్నిటినీ పరీక్షగా చూసి, "అంతా బాగానే వుంది. మే మేనాడూ క్రూర మృగాలను మచ్చిక చేసిన వాళ్ళం కాదు. ఈ బోనుల్ని కోట దగ్గిరకు ఎత్తుకు పోవటం ఎట్లా?" అన్నారు.

ఆటవికుల్లో కొందరికి సమరబాహు అనుచరులు ఎక్కి వచ్చిన ఒంటెలను చూసి నవ్వాకే, వీళ్ళు యీ ప్రాంతపు వాళ్ళు కాదన్న అనుమానం కలిగింది. బోనుల్లో వున్న మృగాలను గురించి వాళ్ళన్న మాట వినగానే, ఆటవిక ముసలాడు ముందుకు వచ్చి, "అయ్యా, ఆ బోనులన్నీ చిన్న చక్రాల బళ్ళమీద అమర్చినవి. కొంచెం





జాగ్రత్తగా చూడండి. మీరు వాటిని గుర్రాల చేతగాని, ఒంటెల చేతగాని, మీ నగరానికి లాగించుకుపోవచ్చు." అన్నాడు.

"అలా అయితే, ఆ పనేదో మీరే చేసి, సహాయపడండి. ముందు ముందు మీకు మా రాజుగారి నుంచి మంచి ప్రతిఫలం వుంటుంది." అన్నాడొక సమరబాహు అనుచరుడు.

ఆటవికులు సింహం, పులులలా వున్న బోనులను తాళ్ళతో రెండు ఒంటెలకు కట్టారు. మరొకదాని వీపు మీద అడవి పక్షులున్న వలలను తగిలించారు. తరవాత అందరూ కలిసి, సమరబాహు కొండమీద కోట కడుతున్న ప్రాంతానికి బయలుదేరారు.

కొండమీద రాళ్ళను అటూ ఇటూ మోయిస్తూ, కోట గోడలు కట్టిస్తున్న స్వర్ణాచారి కొండ దిగువన కనిపించిన ఒంటెలనూ, గుర్రాలనూ, వాటి వెంట వున్న ఆటవికులనూ చూసి, ఎక్కడలేని ఆశ్చర్యంతో, "ఇదేమిటి? మనవాళ్ళిద్దరు గుర్రాలెక్కి వస్తున్నట్టున్నది. వెంట ఆ బోను లెందుకు? ఆటవికుల ముఠా కూడా కనబడుతున్నది — ఇంతకూ అరణ్యంలో ఏమి జరిగినట్టు? ఈ ఉదయం వేటకు పోయింది మనవాళ్ళు నలుగురేగదా?" అన్నాడు, రాళ్ళు మోస్తున్న సమరబాహు అనుచరులతో.

సమరబాహు అనుచరులు మోసే మోసే రాళ్ళను కింద పడవేసి కొండ అంచుకు వచ్చి, దిగువనున్న గుర్రాలకేసీ, ఆటవికుల కేసి వింతగా చూడసాగారు. గుర్రాలమీద వున్న సమరబాహు అనుచరుడొకడు, తల ఎత్తి పైకి చూసి, స్వర్ణాచారి వాళ్ళు తమ కేసి ఒక చోట గుంపుగా చేరి చూడటం గమనించి, తన స్నేహితులతో, "ఒరే, ఆచార్య మహామంత్రిగారు మనల్ని చూసి అద్భుతపడిపోతున్నట్టున్నది. ముందుగా పోయి ఆయనకు సంగతి సందర్భాలు మనవి చేస్తాము," అంటూ గుర్రం మీంచి దిగి, రాళ్ళ మీదుగా గెంతుతూ పోయి, స్వర్ణాచారిని సమీపించారు.

స్వర్ణాచారి తనకేసి వస్తున్న సమరబాహు అనుచరుణ్ణి, "మీరు పోయింది వేటకు గదా? ఆ గుర్రాలెక్కడివి? ఏవో పులి బోనులు తెస్తున్నారేమిటి? ఆ ఆటవికులు యిక్కడికెందుకొస్తున్నట్టు?" అని అదుర్దాగా ప్రశ్నించాడు.

సమరబాహు అనుచరుడు స్వర్ణాచారి దగ్గరకు పోయి నమస్కరించి, "ఆచార్య మహామంత్రీ! మేము అరణ్యంలో వీరపురం రాజు సైనికులను బాహాబాహి యుద్ధంలో చిత్తుగా ఓడించాం. ఇద్దర్ని బందీలుగా పట్టుకున్నాం. ఏడుగుర్ని నిలువునా నరికేశాం. ఇద్దరు మాత్రం ప్రాణాలతో వాళ్ళ వీరపురం కేసి పారిపోయారు," అని చెప్పాడు.

ఇద్దరు ప్రాణాలతో వీరపురం కేసి పారిపోయారని వింటూనే స్వర్ణాచారి నిలువెల్లా కంపించిపోయాడు. అతడికి సమరబాహు అనుచరుడు చెప్పిన మిగతా విజయాలేవీ ఆనందం కలిగించలేదు. ముందూ వెనకలు ఆలోచించకుండా సమరబాహు అనుచరులు వీరపురం రాజసైనికులతో తగువు పెట్టుకొని తమందర్నీ గొప్ప విపత్తులో ముంచబోతున్నారని అతడనుకున్నాడు.

స్వర్ణాచారి కోపంతో కళ్ళెర్ర చేసి, సమరబాహు అనుచరుడితో, "వీరసింహుడి సైనికులిద్దరు ప్రాణాలతో వాళ్ళ నగరం



కేసి పారిపోయారని చెప్పావ్! అదే, త్వరలో మనకు ప్రాణ సంకటంగా పరిణమించవచ్చు. ఏవో యుద్ధాశ్వాలను పట్టుకున్నంతగా సంతోషపడిపోతూ. దొరికిన ఆ కుంటి గుర్రాలను రెంటినీ యిక్కడికి వెంటబెట్టుకొస్తున్నారా? అసలా రాజు సైనికులతో మీ రెందుకు కలహం పెట్టుకున్నారు?" అన్నాడు.

సమరబాహు అనుచరుడు స్వర్ణాచారి కోపం చూసి, తాము చేసింది తప్పు పని అయి వుంటుందని గ్రహించి, ఉన్నవీ లేనివీ కొన్ని కల్పించి అతడికి చెప్పాడు. వాళ్ళు సమరబాహును అవమానిస్తూ మాట్లాడారని, గుంపుగా వచ్చి ఒంటెల

మీద పడి తేలుకు పోతూంటే, వాళ్ళతో కలియబడవలసి వచ్చిందనీ — యిలాగే మరికొన్ని అబద్ధాలు చెప్పాడు.

అంతా విని స్వర్ణాచారి కొంచెంసేపు ఆలోచిస్తూ వూరుకుని, తరవాత అక్కడ చేరిన సమరబాహు అనుచరులందర్నీ ఉద్దేశించి, "ఏది ఏమైనా, మనకు సరి అయిన రక్షణలులేని యీ సమయంలో, ఆ వీర పుర రాజుతో విరోధం రావలసిందికాదు. ఆ పారిపోయిన ఇద్దరూ ఆ రాజుకు జరిగిందంతా చెపుతారు. రాజు స్వయంగానో, సేనాని నాయకత్వం కింద పెద్ద సైన్యాన్ని పంపి, ఇంకా నిర్మాణ దశలోనే వున్న మన కోటను ముట్టడిస్తాడు. సమయానికి సమరబాహు రాజక్కడ లేడాయె! ఆ క్షత్రియ మహాయోధులైన ఖడ్గజీవదత్తులున్నా, మనం ఎలాంటి ప్రమాదాల నైనా గడిచే వాళ్ళం," అన్నాడు.

స్వర్ణాచారి యిలా చెప్పిం తరవాతగాని సమరబాహు అనుచరులకు తమకు రానున్న ప్రమాదం ఎంతటి భయంకర మైనదో అర్థం కాలేదు. వాళ్ళు దిగులు పడిపోయి ఒకరి ముఖాలొకరు చూసుకోసాగారు.

స్వర్ణాచారి ఊహించినట్టే, అరణ్యంలో సమరబాహు అనుచరులకు దొరక్కుండా గుర్రాల మీద పారిపోయిన, జంతు ప్రదర్శన శాలాధికారి, సైనికుడూ, వీరపురనగర రాజవీధి గుండా నురుగులు కక్కుతున్న తమ గుర్రాలను దౌడు తీయిస్తూ, "దేశానికి ప్రమాదం! రాజ్యానికి ముప్పు! శత్రురాజు అరణ్యంలో ఆకాశాన్నంటే కోట గట్టి, మన మీదికి సేనావాహనులను తరలించుకు వస్తున్నాడు!" అని కేకలు వేయసాగారు.

ఆ మాటలు విన్న నగర పౌరుల్లో కొందరు వీధుల్లో అక్కడక్కడా చేరి తమ నగరానికి పట్టనున్న దుర్గతిని గురించి చర్చిస్తూ, భయకంపితులై పోసాగారు. మరి కొందరు జనాన్ని నగర రక్షణకోసం కత్తులూ, ఈటెలూ, గొడ్డళ్ళూ—ఏది దొరికితే అది తీసుకుని సర్వసన్నద్ధంగా వుండమని కేకలు వేస్తూ, వీధుల వెంట పరిగెత్తసాగారు. —(ఇంకావుంది)





# యక్షపర్వతం

## 18

[వీరపుర సైనికులను ఓడించిన సమరబాహు అనుచరులు, ఆటవికుల సాయంతో బోనుల్లో చిక్కిన సింహాన్ని, పులులనూ తీసుకుని నక్షత్రదారి వద్దకు వెళ్ళారు. సమరబాహు అనుచరులకు దొరక్కుండా తప్పించుకున్న జంతు ప్రదర్శనశాలాధికారి, మరొక వీరపుర సైనికుడూ గుర్రాల మీద వీరపురనగరం చేరారు. తరవాత—]

వీరపురరాజుగారి జంతు ప్రదర్శనశాలాధికారీ, సైనికుడూ గుర్రాలను రాజ వీధి వెంట దౌడు తీయిస్తూ చేస్తున్న హెచ్చరికలూ, ప్రజలు వీధుల వెంట పరిగెత్తుతూ చేస్తున్న గోలా, రాజు వీరసింహుడూ, ఆయన మంత్రీ విన్నారు. ఆ సమయంలో వాళ్ళిద్దరూ రాజప్రాసాదం పైన పచార్లు చేస్తూ, ఏవో రాచకార్యాల చర్చ సాగిస్తున్నారు.

రాజు వీరసింహుడు ముందుగా ప్రాసాదం పిట్టగోడ మీది నుంచి దిగువనున్న రాజ మార్గం కేసి చూసి, ఆశ్చర్యపోతూ మంత్రిని పిలిచి, "మహామంత్రీ, ఏమిటిది? మన జంతు ప్రదర్శనశాలాధికారి, ఒక సైనికుణ్ణి వెంట వేసుకుని, ఏ సింహాలో, పులులో వెంటపడి తరుముతున్నట్టు అరుస్తూ పారిపోతున్నాడు? సేవకుణ్ణి పిలిచి సంగతేమిటో కనుక్కురమ్మనండి." అన్నారు.



మంత్రి కూడా పిట్టగోడ మీది నుంచి కిందికి చూశాడు. అతడికి జంతు ప్రదర్శనశాలాధికారి కాక, ప్రజలు కూడా కేకలు పెడుతూ వీధుల వెంట పరిగెత్తుతూండటం కంటబడింది. అతడు కోట ద్వారం దగ్గిర కాపలా వున్న భటుణ్ణి కేకవేసి, సంగతేమిటో కనుక్కుందాం అనుకునే లోపలే జంతు ప్రదర్శనశాలాధికారీ, సైనికుడూ ద్వారం దగ్గిరకు వచ్చారు. కాపలా భటుడు అతణ్ణీ, వెంట వున్న వాణ్ణీ ఆపి, గుర్రాలు దిగి లోపలికి పొమ్మన్నాడు.

జంతు ప్రదర్శనశాలాధికారి అదటుకు ఒప్పుకోక, పెద్దగా గొంతెత్తి, "ఏమిటి నువ్వనేది? ఒక వైపున దేశం ప్రమాదంలో చిక్కుకుంటే, ఈ లాంఛనాలతో కాలయాపన చెయ్యాలని చూస్తున్నావా?" అంటూ అరిచాడు.

"దేశానికి ప్రమాదం! రాజ్యానికి ముప్పు! శత్రువులు...." అని అరుస్తూ సైనికుడు గుర్రాన్ని వేగంగా ద్వారం దాటించబోయేసరికి, కాపలా భటుడు ఈటెను తిప్పి, సైనికుడి డొక్కలో ఒక్క పోటు పొడిచాడు.

సైనికుడు గుర్రం మీంచి తల్లకిందులుగా పడిపోతూ, "వీరసింహమహారాజుకూ, జై!" అంటూ కేకపెట్టాడు.

భవనం మీది నుంచి యీ దృశ్యాన్ని చూసిన రాజు వీరసింహుడు ఎంతో ఆనందపడిపోతూ, మంత్రితో, "చూశారా, మన సైనికుల రాజభక్తి! ఇలాంటి వాళ్ళ సాయంతో మనం ఎన్నెన్ని రాజ్యాలను జయించవచ్చు! కాని, మనం అలాంటి క్షత్రియ ధర్మాలను నిర్వర్తించకుండా మన సైనికుల రాజభక్తిని అడవి కాచిన వెన్నెల చేస్తున్నాం." అన్నాడు.

మంత్రికి, రాజు మాటలు చాలా అసందర్భంగా తోచినై. జంతు ప్రదర్శనశాలాధికారీ, సైనికుడూ, ద్వారం కాపలా భటుడితో అన్న మాటలు కొన్ని ఆయనకు వినబడినై. రాజ్యానికి ఏదో ప్రమాద పరిస్థితి కలగనున్నదని తెలుసుకునే, వినే వాళ్ళు అంత

హడావిడిగా రాజభవనం దగ్గిరకు వచ్చి వుంటారని ఆయనకు తోచింది.

మంత్రి చేయెత్తి కావలా భటుణ్ణి కేక వేసి. "ఒరే, వాళ్ళిద్దర్నీ గుర్రాలతోనే, గుర్రాలు లేకుండానే — ఎలాగో ఒకలా త్వరగా లోపలికి రానియ్యి." అని చెప్పాడు.

మంత్రి ఆజ్ఞ వింటూనే కావలాభటుడు, జంతు ప్రదర్శనశాలాధికారికి దారి ఇచ్చి, గుర్రం మీంచి కింద పడిన సైనికుణ్ణి లేపి నిలబెట్టాడు. ముందు జంతు ప్రదర్శనశాలాధికారి గుర్రం మీదా, వెనక కుంటుకుంటూ సైనికుడూ భవన ప్రాంగణం లోకి వచ్చారు. మంత్రి ఒక సేవకుణ్ణి పిలిచి వాళ్ళిద్దర్నీ తన దగ్గిరకు తీసుకు రావలసిందిగా ఆజ్ఞాపించాడు.

జంతు ప్రదర్శనశాలాధికారీ, సైనికుడూ భవనం పైకి వచ్చి, రాజునూ, మంత్రినీ చూసి నమస్కరించి, కొంచెం దూరంగా చేతులు కట్టుకు నిలబడ్డారు. మంత్రి తీవ్ర కంఠ స్వరంతో. "మీరిద్దరూ రాజ భృత్యులు గదా! రాజభవన ప్రాంగణం లోకి గుర్రాలెక్కి రాగూడదన్న సంగతి తెలియదా?" అని అడిగాడు.

జంతు ప్రదర్శనశాలాధికారి ఆ ప్రశ్న వింటూనే వణికిపోతూ. "మంత్రిగారు క్షమించాలి. రాజ్యం ప్రమాదంలో వుండటం కళ్ళారా చూసినందువల్ల కలిగిన ఆవేశావేగాల్లో ఆ సంగతి మరిచాం." అన్నాడు.

ఈ జవాబు రాజు వీరసింహుణ్ణి ఆశ్చర్య చకితుణ్ణి చేసింది. వీరపుర రాజ్యం ప్రమాద





స్థితిలో వుందా? ఎలా? ఎవరివల్ల? ఆయన జంతు ప్రదర్శనశాలాధికారి కేసి కళ్ళు చికిలించి చూస్తూ ప్రశ్నించబోయేంతలో మంత్రి కనుబొమలు ముడిచి, "రాజ్యానికి ప్రమాదమా? ఎవరు దండెత్తి వస్తున్నారు? మన సైన్యాలన్నీ రాజ్యపు ఎల్లల్లో కాపలా కాస్తున్నవి గదా? అలాంటి శత్రు దాడి రావటం జరిగితే, ముందుగా సేనానాయకుడికి వార్త వచ్చి తీరుతుందే! క్రూర మృగాలను పట్టి పెంపకం చేస్తూ, రాజధాని నగరంలో సుఖంగా కాలక్షేపం చేసే నీకు, ఒకవేళ అలాంటి శత్రు ప్రమాదం వున్నా ముందుగా ఎలా తెలిసింది?" అని అడిగాడు.

జంతు ప్రదర్శనశాలాధికారి మంత్రికి మరొకసారి నమస్కారం చేసి వణుకుతున్న గొంతుతో, "మంత్రిగారు మరోసారి క్షమించాలి. నేను జంతు ప్రదర్శనశాలకు పశు పక్ష్యాదుల్ని పట్టుకు వచ్చేందుకు కొందరు సైనికులతో మన రాజ్యపుటుత్తర దిశలోని అడవుల్లోకి వెళ్ళాను. అక్కడ సమరబాహు అనే కొంతకోటనగర రాజు సైనికులు ఒంటెల మీద పెద్ద దండుగా వచ్చి మా మీద పడ్డారు. మేము వాళ్ళం దర్నీ వీరోచితంగా ఎదుర్కొని చాలా మందిని మా వాడి కత్తులకు ఎరచేశాం. కాని అంతలో మరొక ఒంటెల దండు మా మీదికి వచ్చి పడింది. మేము మరింత వీరోచితంగా వాళ్ళను ఎదిరించి, శత్రువులను ఊచకోత కోయసాగాం. మన సైనికుల్లో కొందరు గాయపడ్డారు. కొందరి కత్తులు శత్రువులను నరికీ నరికీ పదును పోయి, జందబారాయి. అయినా రాజభక్తి, దేశభక్తి మా కిచ్చిన శక్తి సాహసాలతో మరికొందరు శత్రువులను హతం చేశాం. అలా హతం చేస్తూ మనవాళ్ళు అందరూ వీరోచితంగా నేలకొరిగారు. నేనూ, ఈ సైనికుడూ యీ వార్త తమకు తెలిపేందుకు శత్రువ్యూహాన్ని ఛేదించుకుని నగరం చేరాం. ఆ తొందరలో రాజభవన ప్రాంగణంలోకి గుర్రాలతో వచ్చాం." అన్నాడు.



గుక్క తిప్పుకోకుండా జంతు ప్రదర్శనశాలాధికారి చెప్పిందంతా విని, రాజూ, మంత్రి కూడా అరణ్యంలో ఎవరో బలవంతులైన శత్రువే చేరాడని, ఏదో సమయం చూసుకుని ఆ శత్రురాజు రాజధాని నగరాన్ని ముట్టడించగలడని భయపడ్డారు.

రాజు వీరసింహుడు రెండు మూడు క్షణాల కాలం తలవంచుకుని ఆలోచించి, మంత్రితో, "మహామంత్రీ! మన మృగాధికారి తెచ్చిన వర్తమానాన్ని బట్టి, మన రాజ్యపుటుత్తర సరిహద్దు ప్రాంతాల బలమైన శత్రువే చేరి వున్నట్టు తెలుస్తున్నది. సేనాని కోసం కబురంపండి." అన్నాడు.

మంత్రి, ఒక నౌకరును సేనాని కోసం పంపి, జంతు ప్రదర్శనశాలాధికారిని; పైని కళ్ళు గుచ్చి గుచ్చి పరీక్షగా చూస్తూ, "నీ పని మృగాలను పట్టి మచ్చిక చేయటం గదా? నీ మాటలను బట్టి చూస్తుంటే, అరణ్యంలో నువ్వు ఆరితేరిన ఖడ్గయోధుడుగా శత్రువులతో పోరినట్టు కనబడుతున్నది!" అన్నాడు.

"మహా మంత్రిగారు క్షమించి, వినాలి! నా వృత్తిలో నేను అరణ్యంలో సింహాలతోనూ, పులులతోనూ ఒకోసారి బాహాబాహి పోరాడవలసి కూడా వస్తుంది. అలాంటి క్రూరమృగాలతో చెలగాటాలాడే నాకు శత్రువులతో కత్తియుద్ధం చేయటం ఒక లెక్కలోనిది కాదుగదా?" అన్నాడు జంతు ప్రదర్శనశాలాధికారి.

మంత్రికి యింకా అతడు చెప్పినదాంట్లో పూర్తి నమ్మకం కుదరలేదు. అతడు జంతు ప్రదర్శనశాలాధికారిని కొంచెం దగ్గరకు రమ్మని, గుండ్రంగా ఓసారి తిరగమని ఆజ్ఞాపించారు. అతడు అలా తిరిగేటప్పుడు మంత్రి జంతు ప్రదర్శనశాలాధికారి శరీరం మీద చిన్న గాయంగాని లేక కత్తి దెబ్బకు గుర్తుల్లో ఎక్కడైనా చిరుగు గాని వుంటుందేమో అని పరీక్షగా చూశారు. కాని అలాంటి వేమీ మంత్రి కంట బడలేదు.

మంత్రి తలాడిస్తూ చిన్నగా దగ్గి రాజుతో, "మహారాజా! మన దేశంలోని అరణ్యా



ప్రాంతాలకు ఒంటెలను వాహనాలుగా వాడే కొత్త తండా ఒకటి వచ్చినట్టు మాత్రం ఇతడి మాటలవల్ల తెలుస్తున్నది. ఇక పోతే అక్కడ జరిగిందని చెప్పే ఇతడి యుద్ధ వర్ణన అంతా........"

మంత్రి మాట ముగించే లోపల సేనానాయకుడు ఒరలోని కత్తిని టకటక లాడించుకుంటూ అక్కడికి వచ్చి, రాజుకూ, మంత్రికీ నమస్కరించి నిలబడ్డాడు. మంత్రి అతడికి జంతు ప్రదర్శనశాలాధికారి చెప్పిందంతా వివరించి, "ఇంత శత్రు బలగం రాజ్యంలో ప్రవేశించి తిష్ఠవేసివున్న సంగతి సేనానికి తెలియక పోవటం ఆశ్చర్యంగా వుంది!" అన్నాడు.

సేనాని, మంత్రి అన్న చివరి మాటకు గతుక్కుమని, జంతు ప్రదర్శనశాలాధికారి కేసి ఒక కొరచూపు చూసి, రాజునూ, మంత్రినీ ఉద్దేశించి, "ప్రభువులు విన్న దాంట్లో కొంత నిజంవున్నా, ఇతడు కాస్తంత దాన్ని గంపంత చేసి చెబుతున్నాడని నా దృఢ విశ్వాసం. ఆ ఒంటెల మీద అరణ్య ప్రాంతాల తిరిగే వాళ్ళను గురించి లోగడే మన వేగుల ద్వారా కొంత విన్నాను. వాళ్ళను గురించి పూర్తి సమాచారం సేకరించుకు రమ్మని కొందరు వేగుల వాళ్ళను పంపాను. వాళ్ళ నాయకుడు ఆ ప్రాంతాల గల అందమైన అటవిక జాతి కన్య నొకదాన్ని పెళ్ళాడి, వాళ్ళతో కలిసిపోవటంతో—పూర్తి సమాచారం సంపాదించటం కొంత ఆలస్యమైంది," అన్నాడు.

"ఆ ఆలస్యాన్ని శత్రువులు బాగా ఉపయోగించుకున్నట్టున్నది!" అన్నాడు మంత్రి కోపంగా. "ఇప్పటికైనా మించి పోయిందేం లేదనుకుంటాను. వేగుల వాళ్ళను ఎన్నుకునేటప్పుడు వాళ్ళకు పెళ్ళాం బిడ్డలున్నారో లేదో తెలుసుకోవటం ముఖ్యం. బ్రహ్మచారుల్ని వేగులవాళ్ళుగా పంపితే ఏం జరుగుతుందో అనుభవం అయింది గదా?" అన్నాడు.

"సేనానీ!" అన్నాడు రాజు దీర్ఘంగా మీసం దువ్వుకుంటూ. "అలకా కాల

యాపన ఎందుకు? ఆ శత్రుముఠాకు సమరబాహు అనే రాజున్నాడట! కొండ కోట అనే నగరం కూడా కట్టాడట! నువ్వు వెంటనే సైన్యాలతో పోయి ఆ కోటను నేల మట్టం చేసి, వాళ్ళ రాజును సజీవంగా పట్టుకు రావలసిందిగా ఆజ్ఞాపిస్తున్నాను." అన్నాడు.

"చిత్తం, మహారాజా!" అని సేనాని రాజుకూ, మంత్రికీ నమస్కరించి హడావిడిగా పోయి, నూరుమంది గుర్రపు రౌతులనూ, రెండువందల కాల్బలాన్నీ వెంట బెట్టుకుని, సమరబాహు అనుచరులు కోట కడుతున్న ప్రదేశానికి బయలుదేరాడు.

సమరబాహు ఎలుగ్గొడ్డు ముఠావాళ్ళకు బందీగా చిక్కిన నాటినుంచీ స్వర్ణాచారి అతడి అనుచరు లందరికీ నాయకుడుగా వ్యవహరిస్తున్నాడు. అరణ్యంలో వేటకు పోయిన తనవాళ్ళు అటవికుల్నీ, లోనుల్లో వున్న క్రూర మృగాలనూ వెంటబెట్టుకు తిరిగివచ్చి, జరిగిన సంగతి చెప్పగానే, స్వర్ణాచారి నిర్మాణ దశలోవున్న కొండ కోటను రక్షించేందుకు అవసరం అయిన జాగ్రత్తలన్నీ తీసుకోసాగాడు. అతడికి ఖడ్గజీవదత్తుల శక్తి సామర్థ్యాలలో పూర్తి విశ్వాసం వున్నది. వాళ్ళు సమరబాహును, ఎలుగ్గొడ్డు వాళ్ళనుంచి విడిపించి, ఏ క్షణాన్నయినా కొండకోటకు తీసుకురావచ్చు! ఒక వేళ వీరపురరాజు చేయబోయే దాడికి తాను భయపడి కోట విడిచి పారిపోతే, ఖడ్గజీవదత్తులకు తమ ఉనికి తెలుసుకో



పటం కష్టసాధ్యం అవుతుంది. తాను బాధ్యతారహితంగా ప్రవర్తించిన వాడవుతాడు.

స్వర్ణాచారి ఇలా ఆలోచించి కోటరక్షణకు ఏర్పాట్లు చేస్తూనే, అపజయం ప్రాప్తిస్తే పారిపోయేందుకు వీలుగా, కొండలోవున్న ఒకటి రెండు సొరంగ మార్గాలను ఎన్నుకుని తగిన జాగ్రత్తలో వున్నాడు. అటవికులకు తినుబండారాలూ, కొంత ధనం యిచ్చి, వాళ్ళను కొండ ఎక్కి వచ్చేందుకు సులువైన మార్గం వున్నచోట, ఒక గుహలో దాగివుండ మన్నాడు. బోనుల్లో వున్న సింహం, రెండు పులులూ వాళ్ళ అధీనంలో వున్నవి. శత్రువు కోట మీదికి ఆ మార్గాన వచ్చే సమయంలో వాళ్ళు సింహాన్నీ, పులులనూ బోనుల్లో నుంచి వాళ్ళమీదికి వదలాలి. అప్పుడు శత్రుసైనికుల్లో చెలరేగే గందరగోళాన్ని అవకాశంగా తీసుకుని వాళ్ళు అరణ్యంలోకి పారిపోవచ్చు లేదా సమరబాహు అనుచరులకు సాయంచేసి, అతడివల్ల మరికొన్ని అమూల్యమైన బహుమానాలు పొందవచ్చు....

స్వర్ణాచారి కోటరక్షణకు సన్నద్ధంగా వున్న దశలో, ఒక నాటి సూర్యోదయం వేళ వీరపుర సైన్యం దాడివస్తున్నట్టు, అరణ్యంలో కాపలావున్న సమరబాహు అనుచరుల ద్వారా వార్త అందింది. స్వర్ణాచారి తనవాళ్ళకు ఈటెలూ, వడిసెలలూ యిచ్చి, కొండ కిందికి శత్రువులు రాగానే, ఎలాంటి హెచ్చరికా లేకుండా విసరమన్నాడు.

వీరపుర సేనాని అశ్వికులతో, కాల్బలం సైనికులతో కొండ కిందికివచ్చి, కత్తిదూసి పైనున్న సమరబాహు అనుచరుల కేసి చూసి గొంతెత్తి, "ఒరే, నేను వీరపురరాజ్య సేనానాయకుణ్ణి! మీరంతా ఆయుధాలు కింద పడవేసి లొంగిపోయారో సరి, లేకపోతే చిత్రవధ చేస్తాను!" అన్నాడు.

ఆ వెంటనే కొండమీద వున్న సమరబాహు అనుచరులు ఒక్కుమ్మడిగా ఈటెలను వీరపుర సైనికుల మీదికి విసిరారు. వాటిల్లో ఒకటి వేగంగా వచ్చి వీరపుర సేనాని భుజంలో బలంగా గుచ్చుకున్నది.

—(ఇంకావుంది)





# యక్షపర్వతం

## 19

[వీరపురరాజు ఆజ్ఞాపించగా, సేనానాయకుడు గుర్రపురౌతుల్నీ, కాల్బలాన్నీ వెంట బెట్టుకు పోయి, కొండ మీద వున్న స్వర్ణాచారిని లొంగిపొమ్మని హెచ్చరించాడు. సమరబాహు అనుచరులు, వీరపుర సైనికుల మీదికి గురిచూసి ఈటెలను విసిరారు. అందులో ఒకటి రయ్యిమంటూ వచ్చి వీరపుర సేనాని భుజంలో గుచ్చుకున్నది. తరవాత—]

సమరబాహు అనుచరులు విసిరిన ఈటె దెబ్బ తింటూనే వీరపుర సేనాని ఒక చావు కేక పెట్టి గుర్రం మీది నుంచి కింద పడి పోయాడు. ఆ పడే సమయంలో అతడి భుజంలో గుచ్చుకుని వున్న ఈటె జారి పక్కన పడింది. అతణ్ణి సైనికులు దూరంగా తీసుకుపోయి, గాయానికి కట్టుకట్టారు.

స్వర్ణాచారి, సమరబాహు అనుచరులను మెచ్చుకుంటూ, "మొదటి దెబ్బకే మనం శత్రువుల్ని హడలకొట్టాం. మనం లెక్కకు ఇరవై ఆరుగురమే అయినా శత్రువులు ఈ దెబ్బతో మన బలాన్ని మరింత ఎక్కువని అంచనా వేస్తారు. అలా జరిగితే వాళ్ళు సాహసించి కొండ ఎక్కే ప్రయత్నం చేయరు," అన్నాడు.

ఆ మాట వింటూనే సమరబాహు అనుచరుడొకడు, "ఆచార్య మహామంత్రీ! శత్రువులు ఒక వేళ సాహసించి కొండ



ఎక్కాలని చూశారో, మనం నియోగించిన ఆటవికులు వాళ్ళ మీదికి సింహాన్ని, పులులనూ వదిలి చీకాకు పరుస్తారు,'' అన్నారు.

స్వర్ణాచారి కొండ దిగువనున్న వీరపుర సైనికుల కేసి చూశాడు. వాళ్ళల్లో ఇప్పుడు కొద్ది మంది మాత్రమే గుర్రాల మీద వున్నారు. మిగతా వాళ్ళంతా గాయపడిన తమ సేనాని చుట్టూ చేరి అతడు బాధతో మూలుగుతూ, మధ్య మధ్య కొండ మీది కోటను పట్టుకునేందుకు ఏం చేయాలన్న దాన్ని గురించి యిచ్చే ఆజ్ఞలను జాగ్రత్తగా వింటున్నారు.

సమరబాహు అనుచరుల్లో బాగా ధైర్యశాలు లైన యిద్దరు స్వర్ణాచారి దగ్గిరకు వచ్చి, ''ఆచార్యమహామంత్రీ! శత్రువుల మీదికి దాడి చేయటానికి ఇది మంచి సమయంలా కనిపిస్తున్నది. ఆజ్ఞయివ్వండి, మేమంతా పోయి గుంపుగావున్న వాళ్ళ మీదపడి, మా ఈటెలకు వాళ్ళను ఎరచేసి, వాళ్ళెక్కివచ్చిన గుర్రాలను పట్టుకుంటాం," అన్నారు.

సమరబాహు అనుచరుల ధైర్యసాహసాలు స్వర్ణాచారికి ఆనందం కలిగించినా, వాళ్ళు కొండ దిగిపోయి శత్రువుల మీద దాడి చేస్తామనటం మాత్రం వట్టి దుస్సాహసంలా కనిపించింది. అతడు వాళ్ళతో, "మీరు తొందర పడకండి. సంఖ్యలో శత్రువులు మనకన్న పదింతలున్నారు. మనం దాడి చేసేందుకు కొండదిగుతున్నట్టు చూడగానే వాళ్ళు క్షణాల మీద సర్వసన్నద్ధులై మనను చుట్టుముట్టి హతమార్చగలరు. మన ఒంటెలన్నిటినీ కొండ అవతల వున్న పల్లపు ప్రాంతంలో జాగ్రత్త పరిచారు గదా?" అన్నారు.

"వాటన్నిటినీ ఒక చోట మందవేసి ఇద్దర్ని కావలా పెట్టాం. ఇప్పుడు మీ ఆజ్ఞ ఏమిటి? శత్రువులు మన ఈటె, పడిసెల దెబ్బలకు అందనంత దూరంపోయి నిలబడ్డారు. వాళ్ళక్కడా, మనం ఇక్కడా, అంతేనా?" అన్నారు సమరబాహు అనుచరు లిద్దరూ.

వాళ్ళ మాటలకు స్వర్ణాచారి నవ్వి, "యుద్ధం అప్పుడే ముగిసిపోయిందని భ్రమపడకండి. ఆ శత్రు సేనానాయకుడు గాయపడినంత మాత్రాన తిరిగి వెళ్ళిపోతాడనుకుంటున్నారా? అలా చేస్తే వీరపురరాజు అతణ్ణి పిరికిపందగా ప్రకటించి ఉరితీయించేస్తాడు," అన్నాడు.

స్వర్ణాచారి ఇలా చెపుతూండగానే వీరపుర సైనికుల్లో కొందరు పరిగెత్తుకుంటూ పోయి గుర్రాలెక్కారు. కాల్బల సైనికులు ఈటెలు పైకెత్తి నిలబడి కొండపైకి చూడసాగారు. అంతలో ఇద్దరు సైనికులు పట్టి ఎత్తి సేనానాయకుణ్ణి ఒక గుర్రం మీద కూర్చొబెట్టారు. నలుగురైదుగురు అశ్వికులు వెంటరాగా సేనాని గుర్రాన్ని మెల్లిగా పరిగెత్తిస్తూ కొండ దిగువ భాగాన్ని పరీక్షించి చూడసాగాడు.

శత్రుసేనాని వాలకం చూస్తూనే స్వర్ణాచారికి అతడు కొండ ఎక్కేందుకు సులువైన మార్గం కోసం వెతుకుతున్నట్టు అర్థమైపోయింది. అతడికి సమరబాహు అనుచరులు రోజూ కొండ ఎక్కి దిగే చక్కని కాలిబాటను గుర్తించటం ఏమంత కష్టం కాదు. స్వర్ణాచారి, సమరబాహు అనుచరులను మళ్ళీ వడిసెలలూ, ఈటెలూ విసిరేందుకు సిద్ధంగా వుండమని హెచ్చరించి, ఒక అనుచరుణ్ణి వెంటబెట్టుకుని, ఆట



వికులు సింహం, పులులతో వున్న చోటుకు వెళ్ళాడు.

స్వర్ణాచారిని చూస్తూనే ఆటవికులు సంతోషంగా లేచి నిలబడి, అతడికి దణ్ణాలు పెట్టారు. వాళ్ళ నాయకుడు స్వర్ణాచారితో, "మహారాజా! వీరపురంరాజు సైనికులకన్న మీ సైనికులే ఎక్కువ ధైర్యవంతులూ, యుద్ధాల్లో ఆరితేరినవాళ్ళలా కనిపిస్తున్నారు. మొదటి దెబ్బకే ఈటె విసిరి శత్రుసేనానాయకుణ్ణి హతం చేశారు," అన్నాడు.

"వాడు చావలేదు, గాయపడ్డాడు, అంతే! ఈసారి శత్రువులు కొండ దిగువన వుండి లొంగిపొమ్మని హెచ్చరికలు చేయటం



కాకుండా, అసంపూర్తిగా వున్న కోటను పట్టుకునేందుకు కొండ ఎక్కి రాబో తున్నారు. వాళ్ళు పైకి వచ్చేందుకు యిక్కడున్న కాలిబాటే మలువైనది. మీరు అదను చూసి శత్రువుల మీదికి వదిలేందుకు సింహాన్నీ, రెండు పులులనూ తయారుగా వుంచారా?" అని అడిగాడు స్వర్ణాచారి.

ఆటవికుల నాయకుడు, స్వర్ణాచారిని కాలిబాట పక్కనే వున్న చిన్న గుహల వద్దకు తీసుకుపోయాడు. సింహం బోను ఒక గుహ ముందు భాగాన వున్నది. పులులున్న బోనులూ అలాగే మరొక గుహ ముందున్నవి. ఆ బోనుల మీద ఇద్దరిద్దరు ఆటవికులు ఎక్కి కూర్చునివున్నారు.

స్వర్ణాచారికి, ఆటవిక నాయకుడు తన అనుచరులను చూపించి, "చూశారా, మహారాజా! వీరపుర సైనికులు యీ దాపులకు రాగానే మా వాళ్ళు బోనుల తలుపులెత్తేసి, గుహ పై భాగానికి పారిపోతారు. ఆకలిగొని వున్న క్రూరమృగాలు ఎదురుగా కాలిబాట మీద కనిపించే శత్రువుల మీదికి పోయి పడి చీల్చి చెండాడుతవి," అన్నాడు.

"అవి వాళ్ళ మీదికి పోయి పడనూ వచ్చు లేక బోనుల్లో నుంచి విముక్తి కలిగిందని కొండ దిగి అరణ్యంలోకి పారిపోనూ వచ్చు. ఏమైనా మీ ప్రయత్నం మీరు చెయ్యండి. ఒక మాట, నేను మహారాజును కాదు; ఆయన మంత్రిని. మీ సహాయానికి మా రాజు నుంచి తప్పక ఘనమైన ప్రతిఫలం వుంటుంది, గుర్తుంచుకోండి." అన్నాడు స్వర్ణాచారి.

స్వర్ణాచారి, ఆటవికులతో మాట్లాడి తిరిగి సమరబాహు అనుచరుల దగ్గిరకు వచ్చి కొండ దిగువకు చూశాడు. ఈ సారి వీరపుర సేనాని కొండమీది వాళ్ళను లొంగిపొమ్మని ఆజ్ఞాపించి లాభం లేదని గ్రహించి, కొండ మీది కోటను పట్టుకునేందుకు కొత్త పథకం వేశాడు. కాల్బల సైనికులు ముందుగా కాలిబాట వెంట కొండ ఎక్కటం ప్రారంభించారు. వాళ్ళల్లో కొందరి దగ్గిర విల్లంబులున్నవి. పైనుంచి సమరబాహు

అనుచరులు ఈటెలుగాని, వడిసెలతో రాళ్ళుగాని విసిరినప్పుడల్లా, సైనికులు ఆగి, వాళ్ళకేసి బాణాలు కొడుతున్నారు.

వీరపుర సైనికుల్లో కొందరు చచ్చినా, మిగతా వాళ్ళు కొండమీదికి చేరగలరని, అప్పుడు జరిగే బాహాబాహీ యుద్ధంలో తన వెంట వున్న ఇరవై ఆరు మందితో, అంత సేనను ఓడించటం అసంభవమని స్వర్ణాచారి గుర్తించాడు. అతడు సమరబాహు అనుచరులతో, "మనం సాధ్యమైనంత మంది శత్రువులను చంపి యిక్కడ్నుంచి అరణ్యంలోకి పారిపోవటం తప్ప మరో మార్గాంతరం లేదు. ముందుగా ఇద్దరు ముగ్గురు పోయి, పారిపోయేందుకు వీలుగా ఒంటెలను సిద్ధపరచండి. ఇప్పటికే వాటి దగ్గర మనవాళ్ళిద్దరున్నారు," అని చెప్పాడు.

ఈ లోపల వీరపుర సైనికులు బాణాలు వదులుతూ కాలి బాట వెంట కొంత ఎక్కసాగారు. సేనానాయకుడు మాత్రం కొంత దిగువన వుండి; గుర్రపు రౌతులకు ఏవో ఆజ్ఞలిస్తున్నాడు. వాళ్ళల్లో కొందరు కాల్బల సైనికులకు కొంచెం వెనకగా కొండ ఎక్కసాగారు.

"ఉష్ట్రవీరుల్లారా! తెలివి తక్కువ కొద్దీ వీరపురసేనాని అశ్వికులు కొందర్ని కొండమీదికి పంపుతున్నాడు. మన ఒంటెల దళం యిక్కడ వున్నదనుకుంటున్నాడో



ఏమో! మీలో కొందరు పైనుంచి కాలి బాట మీదికి రాళ్ళు దొర్లించండి. మిగతా వాళ్ళు గురి చూసి వడిసెలలు ప్రయోగించండి!" అని ఆజ్ఞాపించాడు స్వర్ణాచారి.

సమరబాహు అనుచరుల్లో కొందరు పెద్ద పెద్ద రాళ్ళను నెట్టుకువచ్చి కాలి బాట వెంట పైకి వస్తున్న వీరపుర సైనికుల కేసి దొర్లించారు. కాని, వాటిల్లో చాలా భాగం దారిలో వున్న ఎత్తు పల్లాల్లో పడి లేస్తూ, గురి తప్పి మరో మార్గాన దొర్లుకుంటూ పోసాగినై. సమరబాహు అనుచరుల ప్రయత్నం విఫలం కావటం చూస్తున్న వీరపుర సైనికులు ఉత్సాహంగా కేకలు వేస్తూ, పైకి రాసాగారు. వాళ్ళను అను



సరించి వస్తున్న ఆశ్వికులు కత్తులు దూసి పైకెత్తి పట్టుకుని, వీరపుర రాజుకు జయ ధ్వానాలు చేయసాగారు.

అలాంటి ఉత్సాహ సమయంలో వాళ్ళు, ఆటవికులు సింహం, పులులతో వున్న గుహల ప్రాంతాన్ని చేరారు. ఆటవికులు సింహం, పులులను వాళ్ళ మీదికి వదులుతారా లేక భయపడి పారిపోతారా అన్న సంశయంలో కొట్టుమిట్టాడుతున్న స్వర్ణ దారికి హఠాత్తుగా సింహ గర్జన, పులుల గాండ్రింపూ వినిపించింది. మరుక్షణం సింహం, పులులూ బోనుల్లో నుంచి కుప్పించి బయటికి దూకి, అందుబాటులో వున్న వీరపుర సైనికుల మీద పడినై.

సైనికుల్లో హాహాకారాలు బయలుదేరినై. హఠాత్తుగా వచ్చిన ఈ దాడిని ఎదుర్కొనేందుకు వాళ్ళు సిద్ధంగా లేరు. వాళ్ళల్లో నలుగురైదుగురు సింహం, పులుల పంజా దెబ్బలు తిని కింద పడిపోయారు. వాటికి అందకుండా పారిపోవాలని చూసిన మరి కొందరు రాళ్ళ మీద కాళ్ళు పట్టు తప్పి తలకిందులుగా పడిపోయి కొండ కిందికి దొర్లసాగారు.

ఈ గందరగోళంలో సైనికుల వెనక వస్తున్న అశ్వికుల గుర్రాలు బెదిరి, చప్పున వెనుదిరిగి పారిపోబోయి, రౌతులతో పాటు కాళ్ళు జారి కిందపడి పల్టీ మీద పల్టీ కొడుతూ కొండ దిగువకు పోయి పడినై. కన్ను మూసి తెరిచేంతలో జరిగిపోయిన ఈ దుస్సంఘటన చూసి, అసలే గాయం బాధలో వున్న వీరపుర సేనాని నిశ్చేష్టుడై పోయాడు. ఆటవికులు వదిలిన సింహం, పులులూ యిక ఆ ప్రాంతాల తమకడ్డొచ్చే వాళ్ళెవరూ లేకపోవటంతో, రాళ్ళ మీంచి కుప్పించి దూకుతూ చేరువలో వున్న అరణ్యం కేసి పరిగెత్తినై.

కొండ ఎక్కచూసిన సైనికుల్లోనూ, అశ్వికుల్లోనూ కొంతమంది చావగా, మిగిలిన వాళ్ళు కుంటుతూ, కొందరు ఒకళ్ళనొకళ్ళు ఆసరాగా పట్టుకుని కొండ దిగువకు పోసాగారు. ఆది చూసిన సమరబాహు

అనుచరులు, స్వర్ణాచారితో, "ఆచార్య మహామంత్రీ! ఆజ్ఞ యివ్వండి. ఇప్పుడే దాడి చేసి ఆ గాయపడి పారిపోతున్న శత్రువులను ఈటెలతో పొడిచి చంపి వస్తాం." అన్నారు.

స్వర్ణాచారి వాళ్ళ మాటలు విన్నాడు గాని వెంటనే జవాబివ్వలేదు. తాను ఓడించిన శత్రుసైనికులు, కోట ముట్టడికి వచ్చిన వాళ్ళలో పదవ వంతు వుండరు. మిగిలిన వాళ్ళంతా మరోసారి దాడి చెయ్యటానికి కొండ కింద సిద్ధంగానే వున్నారు. ఈ సారి దాడి వస్తే, యిందాకటిలా హఠాత్తుగా వాళ్ళ మీద పడి చిందరవందర చేసేందుకు సింహంగాని, పులులుగాని లేవు...

అప్పుడు కొండ దిగువున వీరపుర సేనాని తన సైనికులనందర్నీ ఒక చోట చేర్చి ఏదో మాటాడుతున్నాడు. అశ్వికుల్లో కొందరు ఆ సరికే కొండ రెండవ తట్టున ఏమున్నదో చూసి వచ్చేందుకు పోయారు. స్వర్ణాచారి, సమరబాహు అనుచరులకు శత్రువులను చూపుతూ, "సాహసం వేరు, దుస్సాహసం వేరు! యుద్ధంలో దుస్సాహసం పనికి రాదు. చూడండి, శత్రుసేనాని మరొక సారి మన మీదికి దాడి వచ్చేందుకు తయారవుతున్నాడు. ఈ సారి యిక్కడున్న కొద్ది మందిమీ అశ్వికుల్నీ, కాల్బల సైనికుల్నీ కూడా ఎదుర్కొని ద్వంద్వయుద్ధం



చేయవలసి వస్తుంది. అంతమంది శత్రువుల్ని జయించటం మనవల్ల కాదు. మనం వెంటనే యిక్కణ్ణించి పోయి, కొండపక్క పల్లపు ప్రదేశంలో దాచిన మన ఒంటెల నెక్కి అరణ్యంలోకి పోదాం. అక్కడ క్షత్రియయువకులూ, సమరబాహు మహారాజు కూడా కనిపించవచ్చు." అన్నాడు.

"సింహం, పులుల బోనుల దగ్గిరున్న ఆటవికులేమైనట్టు? వాళ్ళు సాయం వస్తే శత్రువుల్ని జయించటం ఏమంత కష్టం కాదు." అన్నాడొక సమరబాహు అనుచరుడు.

"వాళ్ళు శత్రుబలం చూసి భీతిచెంది చల్లగా అరణ్యంలోకి పారిపోయి వుంటారు. మూక ఉమ్మడిగా శత్రుబలగం మన

మీదికి వచ్చి పడకముందే మనం కూడా అదే పని చెయ్యాలి." అన్నాడు స్వర్ణాచారి.

"కాని, ఆచార్య మహామంత్రీ! మనం పారిపోతే, శత్రువు మనను పిరికివాళ్ళని...." అంటూ సమరబాహు అనుచరుడొకడు ఏమో చెప్పబోయేంతలో, ఒంటెలను కావలి కాసేందుకు వెళ్ళిన వాళ్ళల్లో ఒకడు రొప్పుతూ స్వర్ణాచారి దగ్గిరకు పరిగెత్తుకుంటూ వచ్చి, "ఆచార్య మహామంత్రీ! అయిదుగురు శత్రు రౌతులు మన ఒంటెలున్న చోటు తెలుసుకుని, మేం వెంటబడి తరమబోయేంతలో పారిపోయారు. ఈ సారి వాళ్ళు గుర్రాల మీద పెద్ద ఎత్తున దాడి వస్తారని నా అనుమానం!" అన్నాడు.

"అనుమానం కాదు, వాళ్ళు చేయబోయేది అది! వాళ్ళు మన ఒంటెల్ని పట్టుకున్నారో, మనం ఎందుకూ కొరగాని వాళ్ళమైపోయి, వాళ్ళ చేతుల్లో బలిపశువుల్లా చిక్కిపోతాం. అందరూ ఒంటెలున్న చోటుకు బయలుదేరండి!" అంటూ స్వర్ణాచారి ముందుండి దారితీశాడు.

స్వర్ణాచారి, సమరబాహు అనుచరులూ ఒంటెలున్న చోటుకుపోయి, వాటిపైన ఎక్కి పల్లపుప్రదేశం నుంచి పైకి వచ్చేసరికి సుమారు రెండు వందల గజాల దూరంలో నలభై యాభై మంది వీరపుర అశ్వికులు కత్తులూ, ఈటెలూ పైకెత్తి పట్టుకుని వాళ్ళకేసి వస్తున్నారు. శత్రువుల్ని ఎడా పెడా నరుకుతూ దారిచేసుకుని ముందుకు పోవటమే తప్ప, వెనుదిరిగి పల్లపుప్రదేశానికి పారిపోయే అవకాశం లేదని స్వర్ణాచారి త్రుటికాలంలో గ్రహించాడు.

ఆ వెంటనే అతడు కత్తి పైకెత్తి, "ఉష్ట్రయోధుల్లారా! నా వెంట రండి. శత్రువుల్ని కొండకోటదేవికి బలిపెడదాం! సమరబాహు మహారాజుకూ, జై!" అంటూ ఒంటెను ముందుకు దూకించాడు.

అదే సమయంలో వీరపుర అశ్వికులు, "వీరసింహ మహారాజుకూ, జై!" అంటూ తమ గుర్రాలను అదిలించి, శరవేగంతో వచ్చి సమరబాహు అనుచరుల మీదపడ్డారు.

—(ఇంకావుంది)






## 20

[సమరబాహు అనుచరులు విసిరిన ఈటె ఒకటి వీరపుర సేనానిని గాయపరిచింది. కొండ ఎక్కి, శత్రువులను హతమార్చాలని చూసిన ఆతడి సైనికులనూ, ఆటవికులు వదిలిన సింహం, పులులూ పడగొట్టినై. స్వర్ణాచారి, సమరబాహు అనుచరులతో ఒంటెల మీద పారిపోవాలని చూశారు. వీరపుర అశ్వికులు వాళ్ళను ఎదిరించారు. తరవాత—]

స్వర్ణాచారి కత్తి దూసి ధైర్యంగా వీరపుర అశ్వికుల మీదికి తన ఒంటెను దూకించటం చూసి, సమరబాహు అనుచరులు ఎక్కడ లేని తెగువతనంతో పోయి శత్రువుల మీద కలియబడ్డారు. అప్పుడు వీరపుర అశ్వికులకూ, సమరబాహు ఉష్ట్రయోధులకూ మధ్య భయంకరమైన పోరాటం సాగింది. ఒంటెల మీదవున్న సమరబాహు అనుచరులు కత్తులతో, ఈటెలతో వీరపుర అశ్వికులను పొడవసాగారు. అశ్వికులు కూడా ధైర్యంగా తమ శత్రువులనూ, వాళ్ళెక్కివున్న ఒంటెలనూ ఈటెలతో కొడుతూ మధ్య మధ్య తమ రాజుకు జయధ్వానాలు పలకసాగారు.

నాలుగైదు నిమిషాలకాలం యీ విధంగా పోరు జరిగే సరికి కొందరు సమరబాహు అనుచరులూ, వీరపుర సైనికులూ గాయపడి తమ తమ వాహనాల మీదనుంచి పట్టు



కుని పారిపోగలిగారన్న మాట! ఇంతకన్న అవమానం ఏముంటుంది? ఇంతకూ అశ్వదళ నాయకుడు బతికున్నాడా, చచ్చాడా?" అంటూ కోపంగా అరిచాడు.

స్వర్ణాచారిని చుట్టుముట్టవచ్చిన వీరపుర అశ్వికదళ నాయకుడు సేనాని అరుపు వింటూనే గుర్రంమీద అతడి దగ్గిరకు పరిగెత్తుకుంటూ వచ్చి, సమస్కరించి, "శత్రువుల్ని చాలామందిని చంపాం. కాని, మిగిలినవాళ్ళు అరణ్యంలోకి పారిపోయారు," అన్నాడు.

"ఆ పారిపోవటం నేనూ చూశాను. వాళ్ళను వెంటబడి పట్టుకునే ప్రయత్నం చెయ్యక, ని వక్కాణించేస్తున్నావు?" అని అడిగాడు సేనాని కోపంగా.

"అయ్యా, గాయపడిన మనవాళ్ళకు వైద్య సహాయం సంగతి చూసి, ఆ తరవాత మరికొందరు అశ్వికుల సహాయం తీసుకుని అరణ్యంలోకి పోయి శత్రువుల వేట సాగింతాం అనుకున్నాను," అన్నాడు దళనాయకుడు.

"ఈ ఏర్పాట్లన్నీ చేసుకుని, ముహూర్తం కుదిరి నువ్వు వచ్చేవరకూ ఆ ఒంటెల వెధవలు నీ కోసం అరణ్యంలో ఏ చెట్టు నీడనో ఎదురు చూస్తూ కూచుంటారను కున్నావా? ఆ చొక్కా, పై పంచా కూడా లేని పిలక వెధవ, వీరపుర అశ్వికుల్లో

తప్పి కింద పడిపోయారు. ఒంటెలను ఏనాడూ చూసివుండని వీరపుర సైనికుల గుర్రాలు కొన్ని బెదిరి దూరంగా పరిగెత్త సాగినై. శత్రువులను చుట్టుముట్టి హతం చేయాలని చూసిన వాళ్ళ ప్రయత్నం సాగలేదు. స్వర్ణాచారి, తన అనుచరులను హెచ్చరిస్తూ, చావగా మిగిలిన పదిహేను, పదహారు మంది ఉష్ట్రయోధులతో శత్రువుల మధ్యగా దారిచేసుకుని దాపులనున్న అరణ్యంకేసి పారిపోసాగారు.

ఆ సమయంలో అక్కడికి వచ్చిన వీరపుర సేనాని పారిపోతున్న స్వర్ణాచారి, అతడి అనుచరుల కేసి చూసి, "ఇంత కొద్దిమంది శత్రువులు మన చక్రబంధాన్ని ఛేదించు



కొండదొని చంపి క్షేమంగా అరణ్యం చేరాడని తెలిస్తే రాజుగారేమంటారు? నీకూ, నాకూ ఉరి తప్పదు," అన్నాడు సేనాని.

"అయ్యా, ఆ పిలక వెధవ ఒట్టొట్టి పిలక వెధవ కాదు! ఆతణ్ణి, ఆచార్య మహామంత్రి అంటూ అతడి అనుచరులు సంబోధించటం విన్నాము. అతడు రూపురేఖల్లో, శౌర్యపరాక్రమాల్లో భారతంలోని........"

దళనాయకుడు మాట ముగించకముందే సేనాని గట్టిగా, "ఇక ఆ కవిత్వం చాలు, నోరుముయ్యి!" అని కోప్పడి, "నువ్వు నలుగురైదుగురు అశ్వికుల్ని వెంటబెట్టుకుని, ఆ గుండు పిలక ఒంటె వెధవా, వాడి తోటి వాళ్ళూ అరణ్యంలో ఎక్కడున్నారో చూసి, వాళ్ళు కనుమరుగు కాకుండా వెన్నంటి వుండు. నేను ముందుగా ఈ కొండకోటను స్వాధీన పరుచుకుని, మన వీరపుర పతాకాన్ని దానిమీద ఎగరవేసి, సైన్యంతో అరణ్యంలోకి వస్తాను," అన్నాడు.

దళనాయకుడు, సేనానికి నమస్కరించి, "చిత్తం!" అని నలుగురు గుర్రపు రౌతుల్ని వెంటబెట్టుకుని, స్వర్ణాచారి అరణ్యంలో ప్రవేశించిన మార్గం వెంట బయలుదేరాడు.

కాని, స్వర్ణాచారి ఆ సరికే అరణ్యంలో చాలాదూరం వెళ్ళిపోయాడు. అతడికే విధంగా అయినా సరే ఖడ్గజీవదత్తులా, సమరభాహూ ఎక్కడ వున్నదీ తెలుసు కోవాలనీ, వాళ్ళకు కొండకోటకు పట్టిన దురవస్థ గురించి చెప్పాలనీ వున్నది. ఎలుగ్గొడ్డు ముఖంవాళ్ళు అరణ్యంలో ఏ ప్రాంతాల వుండేదీ అతడికి సూచన ప్రాయంగా తెలుసు. ఆ కారణంవల్ల స్వర్ణాచారి ఆ దిక్కుకేసి బయలుదేరి, కొంత సేపటికి ఒక కొలను ప్రాంతాన్ని చేరాడు.

అందరూ అక్కడ ఒంటెలను దిగి, వాటికి కొలనులో నీళ్ళుపెట్టి, మేయటానికి వదిలారు. స్వర్ణాచారి ఇద్దరు అనుచరులను ఎత్తయిన చెట్టుమీదికి ఎక్కించి, "ఆ వీరపుర కాల్బల సైనికులుగాని, అశ్వ సైనికులుగాని మనను వెతుకుతూ యీ ప్రాంతాలకు వచ్చే ప్రమాదం వున్నది.



వాళ్ళు రాక ముందుగా మనకు తెలియటం మంచిది. కొద్ది మంది శత్రువులనయితే యిక్కడే నరికి పోగులు పెడదాం. మరీ అధిక సంఖ్యలో వుంటే యీ ప్రాంతం వదిలి మరొక చోటుకు తరలిపోదాం. కనక మీరు అప్రమత్తులుగా వుండి, చుట్టుపక్కల ప్రదేశాలను పరీక్షగా చూస్తూండండి," అని ఆజ్ఞాపించాడు.

ఒక అరగంట కాలం గడిచింది. చెట్టు మీద వున్న సమరబాహు అనుచరుల్లో ముందుగా ఒకడికి, తామున్న చోటు కేసి పరిగెత్తుకుంటూ వస్తున్న పది పన్నెండు మంది ఎలుగ్గొడ్డు ముఠా వాళ్ళు కనిపించారు. వాళ్ళు వెనకా ముందులు చూసుకొకుంటూ సూటిగా కొలను దగ్గిరకు పరుగెత్తుకుంటూ వస్తున్నారు. వెంటనే చెట్టు మీద కాపలా వున్న వాళ్ళల్లో ఒకడు గబగబా కిందికి దిగి, స్వర్ణాచారి దగ్గిరకు వచ్చి తాను చూసినది చెప్పాడు.

స్వర్ణాచారి తన అనుచరులందర్నీ హెచ్చరించి, వాళ్ళతో కొలను పక్కన వున్న గుబురు పొదల్లోకి పోయి దాక్కుని, "వెతకబోయిన తీగ కాలికి తగలటం అంటే, యిదే! ఈ ఎలుగ్గొడ్డు ముఠా వాళ్ళే మన సమరబాహు రాజును బందీగా పట్టుకుపోయారు," అన్నాడు.

అంతలో ఎలుగ్గొడ్డు ముఠా వాళ్ళు కొలనును సమీపించారు. వాళ్ళల్లో ఒకడికి చెట్ల కింద మేస్తున్న ఒంటెలు కనిపించినై. వాడు నిలువెల్లా వణికిపోతూ, "వృకేశ్వరీ మాతా, నువ్వే దిక్కు!" అని కేకపెట్టి, ఒంటెలను తతిమ్మా ఎలుగ్గొడ్డు వాళ్ళకు చూపెట్టాడు.

ఎలుగ్గొడ్డు ముఠా అంతా ఒక క్షణకాలం స్థాణువుల్లా అయిపోయారు. వాళ్ళలా భయకంపితులైపోయి ఏమి చేయటమా అని ఆలోచించే సమయంలో స్వర్ణాచారి హఠాత్తుగా సమరబాహు అనుచరులతో వచ్చి వాళ్ళ మీద పడి, ఇద్దర్ని ఈటెలతో గట్టిగా పొడిచాడు. వాళ్ళు, "చస్తిమి, వృకేశ్వరీ మాతా!" అంటూ కిందపడే లోపలే అయి



వారుగురు ఎలుగ్గొడ్డు మనుషులు ఆయుధాలు కింద పడేసి లొంగిపోయారు. మిగిలిన వాళ్ళు పులిని చూసిన లేళ్ళలా ఎగిరి గంతేసి, వచ్చిన దారినే తిరిగి పరిగెత్తారు.

అలా పారిపోయిన ఎలుగ్గొడ్డు ముఠా వాళ్ళ కొలను కేసి వస్తున్న ఖడ్గ జీవదత్తులకూ, సమరబాహుకూ, గురుభల్లూకుడికీ ఎదురుపడి స్వర్ణాచారిని గురించి చెప్పారు.

"ఎక్కడో కోట కట్టే ప్రయత్నాల్లో కొండ మీద వుండవలసిన స్వర్ణాచారి, యీ అరణ్యంలోని కొలను ప్రాంతం చేరాడంటే చాలా ఆశ్చర్యంగా వుంది. కొండ మీద ఏవో చిక్కుల్లో పడి యిక్కడికి పారిపోయి రాలేదు గదా?" అన్నాడు జీవదత్తుడు.

"స్వర్ణాచారి గొప్ప ప్రభు భక్తి పరాయణుడు. బహుశా, నన్ను ఎలుగ్గొడ్డు ముఠా వాళ్ళ నుంచి కాపాడాలన్న ప్రయత్నంలో యిక్కడికి వచ్చి వుంటాడు!" అన్నాడు సమరబాహు తృప్తిగా.

ఈ సంభాషణేమీ అర్థం కాక గురు భల్లూకుడు తనకు మరెవరో కొత్త వాళ్ళ నుంచి ప్రమాదం రాబోతున్నదని భయపడి, ఖడ్గ జీవదత్తులకు నమస్కరించి, "మీరు నాకు ప్రాణదానం చేస్తామని అభయం యిచ్చారు, మరవకండి!" అన్నాడు.

ఆ మాటలకు జీవదత్తుడు నవ్వి, "గురు భల్లూకా, మా నుంచిగాని, కొలను దగ్గిర వున్న యీ సమరబాహు అనుచరుల నుంచి గాని నీకు ఎలాంటి ప్రమాదం రాదు, భయపడకు!" అన్నాడు.

"సాక్షాత్తూ వృకేశ్వరీదేవే నీకు అండగా వుండగా భయమెందుకు?" అన్నాడు ఖడ్గ వర్మ నవ్వుతూ.

వాళ్ళలా మాట్లాడుకుంటూ కొలను దగ్గిరకు వచ్చేసరికి, స్వర్ణాచారి తనకు దొరికిన ఎలుగ్గొడ్డు ముఠా వాళ్ళను సమరబాహు ఎక్కడ వున్నదీ తెలుసుకునేందుకు ప్రశ్నిస్తున్నాడు. అతడు ఖడ్గ జీవదత్తుల్నీ, సమరబాహునూ అల్లంత దూరంలో చూస్తూనే బ్రహ్మానందం చెంది వాళ్ళ దగ్గిరకు పరుగు పరుగున వచ్చి, "సమరబాహు మహారాజా,



క్షత్రియ యోధుల్లారా, యివే నా నమస్కారాలు!'' అన్నాడు వంగి నమస్కరిస్తూ.

''స్వర్ణాచారి, నువ్వేదో మీ మహారాజుగారి కోటను గాలికి వదిలి, అరణ్య విహారానికి బయలుదేరి వచ్చినట్టు కనబడుతున్నదే!'' అన్నాడు జీవదత్తుడు.

''క్షత్రియ వీరయోధుల్లారా, ఆ కోట శత్రువుల వశమైపోయింది. దాన్ని రక్షించేందుకు నేనూ, సమరబాహు అనుచరులూ గట్టి ప్రయత్నమే చేశాం. ఆ ప్రయత్నంలో కొందరు వీర స్వర్గం అలంకరించారు కూడా.'' అన్నాడు స్వర్ణాచారి విచారంగా.

"అందరూ వీరస్వర్గం అలంకరించకుండా కొందరైనా యీ భూమి మీద ప్రాణాలతో వుంటే, ముందు ముందు మీ కాబోయే రాజుకు సాయపడే అవకాశం వుండేది. వీరస్వర్గానికి పోకుండా యిక్కడే వుండిపోయిన వాళ్ళెంతమంది?'' అని అడిగాడు ఖడ్గవర్మ.

స్వర్ణాచారి తనతో కొలను దగ్గరకు వచ్చిన సమరబాహు అనుచరుల కేసి ఒకసారి తల తిప్పి చూసి. ''నాతో కలిసి పదహారు మందిమి. మా వాహనాలు పదహారు ఉష్ట్రాలు కూడా యిక్కడే వున్నవి.'' అన్నాడు.

"కొండకోటను శత్రువులు ఆక్రమించారా! ఎలా ఆక్రమించగలిగారు? ఎవరా శత్రువులు?'' అన్నాడు సమరబాహు కోపంతో పళ్ళు కొరికి, మీసం మెలివేస్తూ.

స్వర్ణాచారి, అరణ్యంలోకి వచ్చిన వీరపుర జంతు ప్రదర్శనశాలాధికారితో ప్రారంభించి, ఆ తరవాత వీరపుర సైనికులు కొండ మీది కోటను పట్టుకోవటానికి చేసిన ప్రయత్నం. అప్పుడు జరిగిన యుద్ధంలో తాను పొందిన ఓటమి, చావగా మిగిలిన అనుచరులతో అరణ్యంలోకి పారిపోయి రావటం—అంతా టూకీగా చెప్పాడు.

అంతా శ్రద్ధగా విన్న సమరబాహు పెద్దగా నిట్టూర్పుతూ, ''అంటే, కోటతో పాటు మనం ఎంతో కాలంగా కూడబెట్టిన ధనధాన్య సంపద యావత్తూ శత్రువశమైందన్న మాట! ఆ వీరపుర రాజును క్షమించరాదు.

ఆతడి అంతం చూడాలి. ఖడ్గ జీవదత్త యోధుల్లారా, ఇందుకు మీరు నాకు సాయ పడాలి." అన్నాడు.

జీవదత్తుడు, సమరబాహు కేసి జాలిగా చూస్తూ ఏదో అనబోయేంతలో ఖడ్గవర్మ కోపంగా, "సమరబాహూ, ఇప్పుడు నీకే అవసరమొచ్చిందని మా సాయం కోరుతున్నావే? నిన్ను ఎలుగ్గొడ్డు, మంత్రా వాళ్ళ నుంచి రక్షిస్తామని మాట ఇచ్చి నెరవేర్చుకున్నాం. ఇక మా దారిన మేం వింధ్యపర్వతాలకు పోదలిచాం. అక్కడ మేమొక రాతిరథాన్ని కదిలించవలసి వున్నది. కాని, దారి పొడుగునా మేము ఇతరుల్ని చిక్కుల్లో నుంచి కాపాడాలన్న ధర్మబుద్ధి కొద్దీ కాలయాపన చేస్తున్నాం. ఇక ఆ ధోరణికి స్వస్తి చెప్పాలి." అన్నాడు.

జీవదత్తుడు, ఖడ్గవర్మ వీపు తట్టి తొందర పడవద్దన్న సూచనగా తలాడించి హెచ్చరిక చేసి, "సమరబాహూ, నువ్వు రాజ్యం సంపాయించి పోగొట్టుకున్న వాడివి కాదు గదా, వీరపుర రాజు మీద పగ సాధించ టానికి? ఈ మహారణ్యంలో ఏ ప్రాంతాన అయినా నీ అనుచరులతో సుఖంగా పంటలు పండించుకుంటూ హాయిగా బతకవచ్చునే." అన్నాడు.

సమరబాహు జవాబివ్వకుండా తలవంచు కున్నాడు.



అప్పుడు స్వర్ణాచారి కలగజేసుకుని, "క్షత్రియ యోధుల్లారా, నా దొక మనవి, చిత్తగించాలి! పేరును బట్టి యీ సమర బాహు ఏ చంద్రవంశజుడో అయి వుంటాడని నాకు నమ్మకం కలుగుతున్నది. అలాంటి వాడు యిక్కడెక్కడైనా చిన్న రాజ్యం స్థాపించగా చూసి, ఆతడి దగ్గిర మంత్రిత్వం నెరపాలన్న కోరిక నాక్కలుగుతున్నది. మీరు దయ తలచి సాయపడితే కనీసం, ఆ వీరపురరాజును కొండకోట ప్రాంతాల నుంచయినా తిరోగమించేలా చేయగలం. అప్పుడు కొండకోట, ఆ చుట్టుపక్కల వున్న ఆటవిక గూడేలతో కలిసి ఒక రాజ్య మవుతుంది." అన్నాడు.

జీవదత్తుడు, ఖడ్గవర్మ కేసి చూసి, "ఖడ్గా, ఈ పాటి సాయం మనం చేయటం బావుంటుందనుకుంటాను," అని సమర బాహు, స్వర్ణాచార్లతో, "మనం ముందుగా యిక్కడికి వచ్చిన వీరపుర సైనికుల్ని దెబ్బ తీయాలి. అల్ప సంఖ్యలో వున్న మనం వాళ్ళతో ముఖా ముఖి యుద్ధం చేయలేం గనక ఉపాయంతో వాళ్ళను ఓడించాలి. అందుకొక ఒక మార్గం వున్నది. ఆ సైనికు లందర్ని గురుభల్లూకుడి బిలదుర్గంలో ప్రవే శించేలా చేయాలి," అన్నాడు.

"అదెలా సాధ్యం, జీవదత్త ప్రభూ? వాళ్ళు ఆ బిలంలోకి ప్రవేశించేలా చేయటం ఎలా?" అన్నాడు స్వర్ణాచారి ఉత్సాహం పట్టలేక.

"అందుకు గురుభల్లూకుడి శిష్యుల్లో ఒకళ్ళిద్దరు వీరపుర సైనికుల దగ్గరకు పోయి, వాళ్ళ నాయకుడితో మనమంతా ఆ బిలంలో దాక్కొని వున్నామని చెప్పాలి. వాళ్ళు మనను వధించేందుకు బిలంలో ప్రవేశిస్తారు. అప్పుడు...." అంటూ ఆగి జీవదత్తుడు, గురుభల్లూకుడితో, "భల్లూకా! నీ శిష్యులు నీ మాటకు ఎదురాడని తత్వం గలవాళ్ళా లేక గురువుకే ద్రోహం చేసే రకమా?" అని అడిగాడు.

ఆ ప్రశ్న వింటూనే గురుభల్లూకుడు ఉద్రేకపడిపోతూ, "అయ్యా, నా శిష్యుల గురు భక్తి ఎటువంటిదో రుజువు చేస్తాను. నేను ఆజ్ఞాపిస్తే వాళ్ళు కొండ శిఖరం మీద నుంచి అయినా కిందికి దూకుతారు. ఇక్కడ కొండ లేదు గనక, ఆ కనబడే చెట్టు చిటారు కొమ్మ మీది నుంచి కిందికి దూకమని ఆజ్ఞాపిస్తాను," అని ఒక ఎలుగ్గొడ్డు వాడితో, "ఒరే, శిష్యా! నువ్వు ఆ చెట్టు చిటారు కొమ్మకు పోయి, అక్కణ్ణించి భూమి మీద పడు!" అన్నాడు.

జీవదత్తుడు వారించే లోపలే ఎలుగ్గొడ్డు వాడు పరుగెత్తుకుంటూ పోయి, నూరడుగుల ఎత్తున్న ఒక చెట్టు పైకి పాకి, అక్కణ్ణించి, "గురుభల్లూకా!" అంటూ అరిచి, చేతిపట్టు వదిలి, తలకిందులుగా నేల మీదికి పడసాగాడు. —(ఇంకావుంది)





# యక్షపర్వతం

## 21

[కొండకోట వద్ద వీరపుర అశ్వికుల చేత ఓడింపబడిన స్వర్ణాచారి కొద్దిమంది ఆప్త యోధులతో అరణ్యంలోకి పారిపోయాడు. అక్కడ అతడికి ఖడ్గ జీవదత్తుడూ, సమరబాహూ కనిపించారు. గురుభల్లూకుడు తన శిష్యుల గురుభక్తిని రుజువు చేసేందుకు, వాళ్ళల్లో ఒకణ్ణి చెట్టు మీదినుంచి కిందికి దూకమన్నాడు. తరవాత—]

గురుభల్లూకుడి శిష్యుడు చెట్టు మీది నుంచి దూకటం చూస్తూనే జీవదత్తుడు పరిగెత్తుకుంటూ పోయి, వాడు యింకా నేలకు పది పన్నెండడుగుల దూరంలో వుండగా తన దండం అడ్డు పెట్టాడు. ఎలుగ్గొడ్డువాడు తన గురువు పేరును స్మరిస్తూ, వేగంగా వచ్చి దాని మీద పడగానే జీవదత్తుడు వాణ్ణి చేతులతో పట్టుకుని భూమి మీద నిలబెట్టాడు.

ఎలుగ్గొడ్డు వాడు తన గురుభక్తిని రుజువు చేసుకునే అవకాశం పోయినందుకు దిగాలు పడిపోతూ, జీవదత్తుడితో, ''అయ్యా, మధ్య దారిలో నన్ను పట్టుకుని నేల తాకి ప్రాణం పోకుండా కాపాడారేమో గాని, నేను చచ్చి స్వర్గం చేరే అవకాశాన్ని చెడగొట్టారు,'' అన్నాడు.

ఆ మాటలకు జీవదత్తుడు నవ్వి "ఒరే, నువ్వు నేల తాకి చచ్చి స్వర్గం చేరేవాడివే



లేక నరకానికే పోయేవాడివో ఎవరు చూశారు? ఒకటి మాత్రం గట్టిగా రుజావు చేశావ్; నీ గురువాజ్ఞను దైవాజ్ఞగా పాలించావు. ఇప్పుడు నువ్వు, నీ గురువుకూ, అతడి ద్వారా సమరబాహుకూ చేయవలసిన సాయం చాలా వుంది," అన్నాడు.

ఆ సరికి అక్కడికి గురుభల్లూకుడూ, సమరబాహూ, ఖడ్గవర్మా వచ్చారు. గురుభల్లూకుడు ఆనందం పట్టలేక ఖడ్గ జీవదత్తులతో, "అయ్యల్లారా, నా శిష్యుల గురుభక్తి ఎలాంటిదో స్వయంగా చూశారు గదా? ఇక వాళ్ళను మీ ఇష్టం వచ్చిన పనికి ఉపయోగించుకోండి. సమరబాహు యీ అరణ్య ప్రాంతాలకు రాజై స్వరా-
చారి ఆయనకు మంత్రి అయితే, నా బిల దుర్గంలో వృకేశ్వరీదేవి పూజాపునస్కారాలు నిర్విఘ్నంగా సాగిపోతాయి," అన్నాడు.

"భల్లూకా! ఆ దేవీపూజ లేవో యితర్ల ప్రాణాలకు అపాయం కలగకుండా జరిగేలా చూసే బాధ్యత సమరబాహు పైన వున్నది!" అని జీవదత్తుడు, గురుభల్లూకుడి శిష్యుల కేసి చూసి, "ఈ చెట్టు మీంచి గెంతిన వాడితోపాటు నీ శిష్యుల్లో మరొకడు నే చెప్పబోయే పని సాధించుకు వచ్చేందుకు కావాలి," అన్నాడు.

గురుభల్లూకుడు తన శిష్యుల్లో మరొకణ్ణి దగ్గిరకు పిలిచి, వాణ్ణి చెట్టు మీంచి దూకిన వాడి పక్కన నిలబడమన్నాడు. జీవదత్తుడు ఆ ఇద్దరితో, "ఒరే, మీ ఇద్దరూ ప్రాణాలు పోయినా యిక్కడ ఏం జరిగిందీ ఎవరితో చెప్పకుండా ఒక గురుకార్యం సాధించాలి. ఈ చుట్టు పక్కల వున్న అరణ్యంలో ఎక్కడో వీరపుర అశ్వికులు వుంటారు. మీరు పని గట్టుకుని వాళ్ళ కంటబడినట్టు కాకుండా, అజాగ్రత్తవల్ల దొరికిపోయినట్టు నటించి, ఆ అశ్వికుల్ని కలుసుకోవాలి. తరవాత వాళ్ళతో కొండకోట నుంచి పారిపోయిన సమరబాహు అనుచరులందరూ మీ గురువుదైన బిలదుర్గంలో దాక్కుని



ఉన్నట్టు నమ్మబలకాలి; చెప్పిందంతా అర్థమైందా?'' అన్నాడు.

''అయ్యా, ఇందులో అర్థం కానిదేముంది! ఇది గురుకార్యం, రాచకార్యం కూడా. ఆ ఆశ్వికుల్ని కలుసుకుని మీరు చెప్పిన మాటలు చెప్పమన్న విధంగా చెప్పి, పని నెరవేర్చుతాం,'' అన్నారు భల్లూకుడి శిష్యులిద్దరూ.

''అయితే బయలుదేరండి, ఆలస్యం ఎందుకు,'' అన్నాడు జీవదత్తుడు.

శిష్యులిద్దరూ గురుభల్లూకుడికి సాష్టాంగపడి లేచారు. భల్లూకుడు వాళ్ళ తలల మీద చేయి పెట్టి, ''ఆ ఆశ్విక శత్రువులు మిమ్మల్ని వేగుల వాళ్ళుగా గుర్తించి నిజం చెప్పమని ఎన్ని హింసలపాలు చేసినా, మీరు మన రహస్యాలు చెప్పకూడదు!'' అన్నాడు భీకరమైన స్వరంతో.

భల్లూక శిష్యులిద్దరూ తలలు వంచి, ''గురుభల్లూకా, మీ ఆజ్ఞ వృకేశ్వరీదేవి ఆజ్ఞతో సమానం!'' అని అక్కణ్ణించి బయలుదేరారు.

వాళ్ళు అరణ్యంలో చాలాసేపు తిరిగి, సూర్యుడు ఆకాశ మధ్యం నుంచి పడమటి దిక్కుకు వాలుతున్న సమయంలో ఒక చెట్టుకింద వీరపుర ఆశ్వికుల్ని చూశారు. ఆశ్వికులు నలుగురూ గుర్రాలు దిగి ఏదో మాట్లాడుకుంటున్నారు. వాళ్ళ వాలకం చూస్తే, స్వర్ణాచారి అనుచరుల కోసం అరణ్యంలో చాలాదూరం తిరిగి అలిసిపోయి నట్టుంది.

ఆశ్వికుల్ని చెట్ల చాటునుంచి చూసిన భల్లూకుడి శిష్యులిద్దరూ ఒక క్షణకాలం సంప్రతించుకుని పెద్దగా గొంతులెత్తి, ''గురుభల్లూకా, తమరెక్కడ? మేం యిక్కడున్నాం!'' అంటూ నాలుగైదు సార్లు గట్టిగా కేకలు వేశారు.

ఆ కేకలు వింటూనే చెట్టు కిందవున్న వీరపుర ఆశ్వికులు అదిరిపడ్డారు. వాళ్ళ దళనాయకుడు చప్పున కత్తిదూసి తన అనుచరులతో, ''ఎవరా కేకలు పెట్టింది?



మనం ఆ మధ్య విన్న ఎలుగ్గొడ్డు ముఖా వాళ్ళలా వున్నారు. మన ప్రాణాలకు ఇదొక కొత్త బెడద! రండి!'' అంటూ గుర్రం ఎక్కి భల్లూకుడి శిష్యులున్న వైపుకు పరిగెత్తించాడు.

అశ్వికులు తమను సమీపించటం చూస్తూనే భల్లూకుడి శిష్యులిద్దరూ చేతుల్లోవున్న ఈటెలను కింద పడవేసి, ''అయ్యా, మమ్మల్ని చంపకండి, లొంగిపోతున్నాం. మా గురువును శత్రువులు పట్టుకున్నట్టున్నది. ఇంక మేం ఎవరి కోసం బతకటం!'' అన్నారు.

అశ్విక దళనాయకుడు ఆశ్చర్యపడిపోతూ, ''మీ గురువును శత్రువులు పట్టుకున్నారా? ఎవరా శత్రువులు?'' అని అడిగాడు.

ఆ ప్రశ్నకు భల్లూక శిష్యుల్లో ఒకడు, ''అయ్యా, ఈ రోజు కొంచెం పొద్దెక్కాక ఒంటెల మీద స్వారీచేసే జనం కొందరు హఠాత్తుగా వచ్చి మా బిలదుర్గంలో జొరబడ్డారు. ఆ సమయంలో మేమందరమూ దేవీపూజలో నిమగ్నులమై వున్నందున వాళ్ళను ఎదిరించి పోరాడలేక పోయాం. ఆ దుర్మార్గులు మాలో కొందరిని చంపారు. వాళ్ళకు దొరక్కుండా తప్పించుకున్న వాళ్ళం మా గురువుతో పాటు అరణ్యంలోకి పారిపోయి వచ్చాం. కాని, మా గురువు మా నుంచి వేరుపడి ఎటో పోయాడు.'' అన్నాడు దిక్కులుచూస్తూ.

ఒంటెల మీద వచ్చిన వాళ్ళనే సరికి దళనాయకుడికి, వాళ్ళు కొండకోట నుంచి పారిపోయిన స్వర్ణాచారీ, అతడి అనుచరులూ అన్న నమ్మకం కలిగింది. అతడు వెంటనే ఇద్దరు అశ్వికుల్ని కొండకోటకు పొమ్మని ఆజ్ఞాపించి, ''సేనానితో శత్రువులు యీ ప్రాంతాలవున్న బిలదుర్గంలో వున్నారని చెప్పండి. ఆయన సైన్యంతో రాగానే అందరం అక్కడికి పోదాం.'' అన్నాడు.

అశ్వికులిద్దరూ గుర్రాలను అదిలించి కొండకోట కేసి వరుగుతీశారు. దళ

నాయకుడు భల్లూకుడి శిష్యులతో, "మీరు మా శత్రువు ఎక్కడవున్నదీ చెప్పి చాలా సాయం చేశారు. సేనాని రాగానే మీకు తగిన బహుమతి యిప్పిస్తాను," అన్నాడు.

బహుమతి మాట వింటూనే శిష్యులిద్దరూ అయిష్టంగా తల లాడించి, "అయ్యా, దేవీఉపాసకుల మైన మాకు మీ బహుమతు లెందుకు? మా గురువుగారు క్షేమంగా మా కంటబడితే అంతే చాలు. సెలవు. వస్తాం!" అంటూ బయలుదేరారు.

దళనాయకుడు చప్పున గుర్రం మీంచి వంగి ఒక శిష్యుడి భుజం గట్టిగా పట్టుకుని, "ఆగండి! ఎక్కడికి పోతున్నారు? మీరు చెప్పే ఆ బిలదుర్గం ఎక్కడో మా కెలా తెలుస్తుంది? దాన్ని చూపే బాధ్యత మీది. తెలిసిందా?" అన్నాడు కోపంగా.

"అయ్యా, ఆ బిలదుర్గం యీ దాపులనే వున్నది. అక్కడికి వెళ్ళేందుకు మీకు దారి చూపుతాం. ఒక వేళ ఆ దుర్గంలో ఒంటెల వాళ్ళకు మా గురువైన భల్లూకుడు బందీగా పట్టుబడి వుంటే, ఆయన్ను విడిపించేందుకు సాయం చేయాలి." అన్నాడు భల్లూక శిష్యులొకడు.



"ఆ దుర్గాన్ని వశపరుచుకుని అక్కడున్న వాళ్ళలో రాజద్రోహు లెవరో, కాని వాళ్ళెవరో నిర్ణయించేది నేను కాదు, మా సేనానాయకుడు. త్వరలోనే ఆయన యిక్కడికి వస్తాడు. అందరం ఆ బిల దుర్గానికి కలిసిపోదాం. మీరీ చెట్టు కిందే నిలబడండి." అని ఆజ్ఞాపించాడు దళనాయకుడు.

ఇద్దరు అశ్వికులు వచ్చి ఒంటెల వాళ్ళు ఒకానొక బిలదుర్గంలో దాక్కుని వున్నారని చెప్పగానే వీరపుర సేనాని ఎక్కడలేని ఆనందంతో, "ఆ రాజద్రోహు లందరూ కలిసి కట్టుగా ఒకే చోట వున్నారన్న మాట! అందర్నీ వీలయితే



ప్రాణాలతో పట్టుకుని, తాళ్ళతో బంధించి వీరపుర రాజవీధుల్లో ఊరేగిస్తాను. తర వాత వాళ్ళకు ఉరి ఎలానూ తప్పదు. ఇది ముందు ముందు కాబోయే రాజ ద్రోహులకు గుణపాఠంగా వుంటుంది,'' అన్నాడు.

ఇలా అని సేనాని కొందరు అశ్వి కుల్నీ, కాల్బల సైనికుల్నీ వెంట బెట్టు కుని దళనాయకుడున్న చోటుకు బయలుదేరాడు. భల్లూకుడి శిష్యుల మాటలు నమ్మి వీరపుర సైనికులు తప్పక బిలదుర్గం ముట్టడించేందుకు వస్తారని ఊహించిన ఖడ్గ జీవదత్తులు, సమరబాహునూ, గురుభల్లూకుణ్ణీ, వాడి మిగిలిన శిష్యులనూ తీసుకుని ముందు గానే బిలదుర్గం దగ్గిరకు చేరాడు.

కొద్ది సేపటికల్లా వీరపుర సేనాని, దళనాయకుడున్న ప్రదేశానికి వచ్చాడు. దళనాయకుడు అతడికి గురుభల్లూకుడి శిష్యులను చూపించి, వాళ్ళు చెప్పిన దంతా చెప్పి, ''అయ్యా, ఆ రాజద్రోహు లందరూ మనం వేయబోతున్న ఉచ్చులో చిక్కినట్టే!'' అన్నాడు ఉత్సాహంగా.

సేనాని, భల్లూకుడి శిష్యుల కేసి కత్తి ఝళిపిస్తూ, ''ఒరే, ఎలుగ్గొడ్డు వెధ వల్లారా! మీరు చెపుతున్నదంతా నిజమా లేక యిందులో మీ గురువుగారి జిత్తులు గాని, ఆ ఒంటె దుర్మార్గుల ఎత్తుగడలు గాని ఏమైనా వున్నవా?'' అని అడిగాడు.

భల్లూకుడి శిష్యులు, సేనాని కత్తి చూసి ఏమీ బెదరక, ''మహాప్రభో, మేము వృకేశ్వరీదేవి ఆనగా చెపు తున్నాం. మేం చెప్పిన దాంట్లో ఆవ గింజంత అబద్ధం కూడా లేదు. ఆ బిల దుర్గాన్ని తమరు తిరిగి మా గురువుగారి పరం చేయాలి,'' అంటూ నమ్మబలికారు.

''ముందు ఆ బిలంలో చేరిన పంది కొక్కుల్ని బయటికి లాగనియ్యండి; దాన్ని ఎవరి పరం చేయాలో ఆలోచిస్తాను.'' అని సేనాని, సైనికులతో, ''మీరంతా నిశ్శబ్దంగా ఆ బిలదుర్గాన్ని చేరాలి,



ఒరే, ఎలుగ్గొడ్డు మూర్ఖుల్లారా! మీరు ముందుండి ఆ చోటుకు దారితీయండి. ఇందులో ఏదైనా మోసం వున్నదో మిమ్మల్ని అక్కడికక్కడే ముక్కలుగా నరికేస్తాను.'' అన్నాడు.

ముందు భల్లూకుడి శిష్యులిద్దరూ దారి చూపుతూండగా, సేనాని, సైనికులూ పావు గంటకాలం గడిచీ గడవకముందే బిలదుర్గాన్ని చేరారు. ఆ సమయంలో బిలదుర్గం పైన నరమానవపురుగంటూ లేదు; చుట్టూ ఎత్తయిన చెట్లూ, ముళ్ళపొదలూ వున్నాయి. అంతా నిశ్శబ్దంగావుంది.

సేనాని గుర్రం మీంచి దిగి బిలదుర్గం ముందుకు పోయి, దిగువకు తొంగి చూస్తూ, పెద్ద గొంతుతో, ''ఒరే, బిలంలో వున్న శత్రువుల్లారా, పైన నేను—వీరపుర సేనానిని పెద్ద సైన్యంతో వచ్చివున్నాను. రెండు మూడు నిమిషాల్లో మీరందరూ ఆయుధాలు బిలంలోనే వదిలి, వట్టి చేతులతో పైకివచ్చి, లొంగిపోకపోతే, నేను బిలంలోకి దిగి మిమ్మల్ని చిత్రవధ చేస్తాను.'' అని కేకవేశాడు.

బిలంలో నుంచి ఎలాంటి జవాబూ రాలేదు. సేనాని రెండు మూడు నిమిషాలు చూసి కోపంతో పళ్ళు కొరుకుతూ, తన గుర్రపు రౌతులందర్నీ, గుర్రాలను చెట్ల కింద మందవేసి కాపలా పెట్టి తన దగ్గిరకు రమ్మన్నాడు. వాళ్ళు అలా చేసి రాగానే, వాళ్ళతో పాటు కాల్బల సైనికుల్ని కూడా వెంటబెట్టుకుని బిలంలోకి దిగుతూ, భల్లూకుడి శిష్యులను, ''ఒరే, మీరిద్దరూ బిలంలోని దారి మార్గాలు తెలిసినవాళ్ళు, ముందుండి దారితీయండి.'' అని ఆజ్ఞాపించాడు.

భల్లూకుడి శిష్యులిద్దరూ అందుకు అభ్యంతరం చెప్పకుండా బిలంలోకి ప్రవేశించారు. వాళ్ళ వెనగ్గా సేనాని, సైనికులూ లోపలికి దిగారు. వాళ్ళంతా ఆ విధంగా బిలంలోకి మాయంకాగానే, హఠాత్తుగా పొదలచాటు నుంచి నలుగురు ఎలుగ్గొడ్డు వాళ్ళు బయటికి వచ్చి,

గుర్రాలకు కాపలావున్న ఇద్దరు వీరపుర సైనికుల మీద పడ్డారు. సైనికులు కేకలు వేసే లోపలే ఎలుగ్గొడ్డు వాళ్ళు, వాళ్ళను ఈటెలతో పొడిచి, నేలపడి గిలగిల తన్నుకుంటున్న వాళ్ళిద్దర్నీ భుజాలమీద వేసుకుని దూరంగా వున్న గచ్చపొదల వెనగాల పడవేశారు.

ఆ సమయంలో జీవదత్తుడు, సమరబాహు, గురుభల్లూకుడితో పాటు అక్కడికి వచ్చి, ''భల్లూకా! నీ శిష్యులు ఆ కాపలా వాళ్ళను అంత ఘోరంగా చంపవలసింది కాదు. కాళ్ళూ, చేతులూ కట్టి ఆ పొదల చాటున పడవేస్తే సరిపోయేది కదా?'' అన్నాడు.

గురుభల్లూకుడు ఆ మాటకు జవాబివ్వకుండా, అపరాధం చేసినవాడిలా తలవంచుకు ఊరుకున్నాడు. సమరబాహు గుర్రాల కేసి చూసి ఉత్సాహంగా, ''జీవదత్తా, నా అనుచరులు స్వారి చేసేందుకు ఈటెలతో పాటు గుర్రాలు కూడా లభ్యమయినై,'' అన్నాడు.

''అప్పుడే మనం శత్రుసంహారం చేసినట్టు సంతోష పడకు, సమరబాహూ. వీరపుర సేనానిని ప్రాణాలతో ఎలా పట్టుకోవాలన్నదే గట్టి సమస్య. బిలంలో వున్నవాళ్ళను హడల గొట్టేందుకు ఉపయోగిస్తుంది: ఎండు కట్టెల్ని కొన్నిటిని కాల్చి బిలద్వారం దగ్గిరకు తెమ్మని నీ వాళ్ళకు చెప్పు,'' అన్నాడు జీవదత్తుడు.

ఎలుగ్గొడ్డు వాళ్ళూ, సమరబాహు అనుచరులూ ఆ చుట్టుపక్కల దొరికిన ఎండు పుల్లల్ని పోగుచేసి బిలద్వారం అంచున వేసి నిప్పు ముట్టిస్తూండగా, జీవదత్తుడు బిలంలోకి తొంగిచూస్తూ, ''ఓరి, వీరపుర సేనానీ! నువ్వూ, నీ సైనికులూ ఆయుధాలను బిలంలోనే వదిలి రెండు మూడు నిమిషాల్లో బయిటికి రావాలి. అలా చేయకపోయావో, రాజు సమరబాహు సైనికులూ, అటవికులూ బిలంలోకి దిగి మీ అందర్నీ చిత్రవధ చేస్తారు!'' అని కేకవేశాడు. —(ఇంకావుంది)





# యక్షపర్వతం

## 22

[గురుభల్లూకుడి శిష్యులు చెప్పిన మోసపుమాటలు నమ్మి, వీరపుర సేనాని సైనికులను వెంటబెట్టుకుని బిలదుర్గంలోకి దిగాడు. అది అవకాశంగా తీసుకుని ఇద్దరు జీవదత్తులు బిలద్వారానికి నిప్పు పెట్టించే ఏర్పాట్లు చేసి, లోపలవున్న వీరపుర సైనికుల్ని, ఆయుధాలు అక్కడే వదిలి పైకి వచ్చి లొంగి పోవలసిందిగా ఆజ్ఞాపించారు, తరవాత—]

బిలదుర్గంలో శత్రువుల కోసం వెతుకుతున్న వీరపుర సేనానికి, పైనుంచి జీవదత్తుడు చేసిన హెచ్చరిక వినిపించింది. అతడు మొదట ఆశ్చర్యపోయాడు. అంతలోనే దుర్గద్వారం దగ్గిర నుంచి బిలంలోకి వస్తున్న పొగను చూసి భయం పట్టుకున్నది. అతడూ, సైనికులూ బిలంలోని ఎన్ని గదులు వెతికినా ఒక్కగానొక్క మనిషైనా కనిపించలేదు. రెండు మూడు చచ్చిన తోడేళ్ళూ, చిందరవందరగా పడివున్న ఎలుగ్గొడ్డు చర్మాలూ, ఈటెలూ మాత్రం అతడికి కనిపించినై.

సేనాని తన సైనికులను దగ్గిరకు పిలిచి, "అరణ్యంలో కనిపించిన ఎలుగ్గొడ్డు వెధవలిద్దర్నీ యిక్కడికి లాక్కురండి. వాళ్ళు మనను చాలా తెలిగ్గా మోసం చేసి, యీ తోడేళ్ళ బిలంలో దించారు," అన్నాడు.



సైనికులిద్దరు గురుభల్లూకుడి శిష్యులను రెక్కలు పట్టుకుని యీడ్చుకుని వచ్చి సేనాని ముందు నిలబెట్టారు. సేనాని కత్తి దూసి. "ఒరే, దుర్మార్గుల్లారా! మీరు చేసిన మోసం తెలిసి పోయింది. మిమ్మల్నిప్పుడే ముక్కలు ముక్కలుగా నరకబోతున్నాను." అన్నాడు.

ఆ మాటలకు భల్లూకుడి శిష్యులు ఏమీ చలించకుండా. "గురువాజ్ఞ నిర్వహించాం, ఇక మాకు చావు భయం లేదు!" అని తలలు పైకెత్తి బిలద్వారం కేసి చూసి. "అదుగో, విన్నారా! క్షత్రియ యోధులైన ఖడ్గజీవదత్తులు లొంగిపోవలసిందిగా మిమ్మల్ని మరోసారి హెచ్చరిస్తున్నారు. వాళ్ళకు లొంగిపోయి శరణు కోరకపోయారో, మీరందరూ యీ బిలంలో మంటల్లోనూ, పొగలోనూ చిక్కి, మాడి చావటమో లేక ఊపిరాడక పందికొక్కుల్లా గిలగిల తన్నుకుంటూ ప్రాణాలొదలటమో జరుగుతుంది." అన్నారు.

భల్లూకుడి శిష్యులు చెప్పిన ఆ క్షత్రియ యోధులిద్దరూ ఎవరో, వాళ్ళకూ సమరబాహుకూ వున్న సంబంధం ఏమిటో అడిగి తెలుసుకోవాలనిపించింది. సేనానాయకుడికి. కాని. అలా తిరిగ్గా ప్రశ్న అడిగి సంగతి సందర్భాలు తెలుసుకునేందుకు అవకాశం లేకుండా పైనుంచి కాలుతున్న కట్టెలూ, భగభగమంటూ మంటలు రేగుతున్న ఎండుటాకులూ వాళ్ళున్న ప్రాంతాన పడసాగినై. సైనికులందరూ ప్రాణభయంతో ఒకళ్ళనొకళ్ళు తోసుకుంటూ వాటినుంచి దూరంగా పారిపోసాగారు.

వీరపురసేనానికి తానెంత గడ్డు చిక్కులో పడిందీ అర్థమైపోయింది. అతడు ప్రాణాలు దక్కించుకునేందుకు లొంగిపోవటం తప్ప మరో మార్గం లేదని గ్రహించి. తన కత్తిని నేలమీద పడవేసి. సైనికులందరికీ ఆయుధాలు కింద పెట్టమని ఆజ్ఞ యిచ్చి. బిలద్వారం కేసి తల ఎత్తి. "పై నున్న సుక్షత్రియ యోధు



ళ్లారా! వీరపురసేనానినైన నేను, నా సైనికులతో పాటు లొంగిపోతున్నాను. ఆయుధాలు లేకుండా బిలం పైకి రాబోతున్నాను. అక్కడ వున్న మంటలను ఆర్పించండి!'' అని కేక వేశాడు.

సేనాని కేక బిలం పైనున్న ఖడ్గ జీవదత్తులకు వినిపించింది. వాళ్ళు ఎలుగ్గొడ్డు ముఠా వాళ్ళకు మండుతున్న ఎండు పుల్లల్ని వాటిని దూరంగా లాగివేయమని చెప్పారు. వాళ్ళలా చేయగానే ఖడ్గ జీవదత్తులు బిలం దిగువనున్న మెట్ల దగ్గిరకు పోయి, లోపలికి తొంగి చూశారు. వాళ్లకు చీకటి వెలుగుగావున్న బిలం అడుగున వీరపురసేనాని, సైనికులూ కనిపించారు.

''ఖడ్గా, సేనాని అన్నమాటల్లో మోసం ఏమీవున్నట్టు లేదు. ఇక వాళ్ళందర్నీ పైకి రమ్మందామా?'' అన్నాడు జీవదత్తుడు.

ఖడ్గవర్మ జవాబు చెప్పేలోపలే గురుభల్లూకుడు అక్కడికి వచ్చి జీవదత్తుడితో, ''అయ్యా, రాజులూ, వాళ్ళ ఇంకా నమ్మదగిన మనుషుల లెక్కలోకి రారు. ముందుగా నా శిష్యుల్ని పైకి రమ్మని, వాళ్ళద్వారా సంగతి తెలుసుకుందాం.'' అన్నాడు.

''కుటిలుడికి కుటిలుడే సరైన ఉజ్జీ!'' అంటూ జీవదత్తుడు నవ్వి, ''సరే, భల్లూకా! నీ శిష్యుల్ని ముందుగా పైకి రమ్మని కేకవెయ్యి.'' అన్నాడు.

గురుభల్లూకుడు చేతిలోవున్న ఈటెను పైకెత్తి, ''వృకేశ్వరి మాతకూ, జై!'' అని బిలద్వారం దద్దరిల్లేలా కేక పెట్టి, ''ఒరే, శిష్యుల్లారా! ముందుగా మీ యిద్దరూ పైకి రండి. అంతవరకూ ఆ రాజభృత్యుల్ని వున్నచోటనే ఆగమనండి.'' అని సమరబాహు కేసి కనుసైగచేసి, ''ఇది, కొండకోట రాజైన సమరబాహు మహారాజుగారి ఆజ్ఞ!'' అన్నాడు.

తమ గురువు ఆజ్ఞ వింటూనే భల్లూక శిష్యులిద్దరూ మెట్లెక్కి బిలం పైకి



అందరినీ ఆయుధాలతో సర్వసన్నద్ధంగా వుండమన్నారు.

వీరపుర సేనాని బిలం పైకి వస్తూనే ఖడ్గ జీవదత్తుల్ని చూసి వాళ్ళకు నమస్కరించ బోయేంతలో జీవదత్తుడు అతడికి సమరబాహును చూపించి, ''ఈయన ఈ ప్రాంతాలకు రాజు, చంద్రవంశస్థుడు, పేరు సమరబాహు. ఈయనే మిమ్ములను మందిబలం, యుక్తిబలంతో జయించారు. మీరు లొంగిపోవలసింది యీ మహారాజుకు!'' అన్నాడు.

వీరపుర సేనాని తలవంచి సమరబాహుకు నమస్కరించాడు. అతడి వెనకగా తతిమ్మా సైనికులందరూ బిలం నుంచి బయటికి వచ్చారు. వాళ్ళందర్నీ బిలం ముందున్న చిన్న మైదాన ప్రదేశంలో గుంపుగా ఒక చోట నిలబెట మని సమరబాహు ,ఆజ్ఞ యిచ్చి, స్వర్ణాచారితో, ''మహామంత్రీ, ఈ శత్రువుల్ని ఎలా శిక్షిద్దామంటారు?'' అని అడిగాడు.

స్వర్ణాచారి కొంచెం సేపు ఆలోచించి, ఖడ్గ జీవదత్తులతో చిన్నగా ఏదో సంప్రతింపులు చేసి, సమరబాహుతో, ''మహారాజా, వీళ్ళకు ఎలాంటి శిక్ష విధించాలన్నది, ఇక ముందు వీరపురరాజు మన విషయంలో అనుసరించబోయే విధానాన్ని

వచ్చారు. దిగువనున్న వీరపుర సేనానికి, తాను ఒక రాజుకూ, ఇద్దరు యువ క్షత్రియ యోధులకూ, భయంకరులైన ఎలుగ్గొడ్డు ముఠా వాళ్ళకూ బందీనై పోయానన్న భయంతో ముచ్చెమటలు పోశాయి. వీళ్ళల్లో ఎవరికి తనపై అసంతృప్తికలిగినా, తన ప్రాణాలు తీసేస్తారు...

భల్లూకుడి శిష్యులు బిలంలో జరిగినదంతా చెప్పి, వీరపుర సైనికులందరూ ఆయుధాలు కింద పారవేశారని తెలియపరిచారు. అప్పుడు ఖడ్గ జీవదత్తులు, వీరపుర సేనానినీ, సైనికులనూ ఒక బయటికి రావలసిందిగా ఆజ్ఞాపించి, ముందు జాగ్రత్త కొరకు తమ అనుచరు



బట్టి వుంటుంది. ముందు వీళ్ళందర్నీ మన కొండకోటకు తీసుకుపోయి కారాగారంలో వుంచుదాం." అన్నాడు.

"సరి, సరి, మంచి ఆలోచన!" అన్నాడు సమరబాహు. ఆ క్షణం వరకూ కేవలం బందిపోట్ల నాయకుడైన సమరబాహు మాటల్లోనూ, హావభావాల్లోనూ వచ్చిన రాజోచితమైన లక్షణాలు చూసి ఖడ్గ జీవదత్తులు ఆశ్చర్యపోయారు.

"చిన్న విజయం, పిసరంత అధికారం క్షణాల మీద బందిపోటు సమరబాహులో ఎంత మార్పు తెచ్చింది!" అన్నాడు ఖడ్గవర్మ, జీవదత్తుడితో మెల్లిగా.

"నాకు, బందిపోటును రాజును చెయ్యబోతున్నాం అన్న అనుమానం కలుగుతున్నది. ఆ వీరపుర రాజుకు యీ సరికి మన శక్తి సామర్థ్యాలు చూసి గుండె దడ పుట్టినా పుట్టి వుండొచ్చు. అతడికి యీ పరిసరాలవున్న అటవికులంతా వ్యతిరేకులే. కనక, సమరబాహు కొండకోటలో రాజుగా స్థిరపడిపోయే సూచనలగుపిస్తున్నవి!" అన్నాడు జీవదత్తుడు.

అల్లంత దూరంలో వున్న సమరబాహు, ఖడ్గ జీవదత్తుల దగ్గిరకు వస్తూ, "క్షత్రియయోధుల్లారా! మీరేదో ఏకాంతంగా సంప్రతించుకుంటున్నట్టున్నది. ఇక మన కోటకు బయలుదేరి పోదామంటారా?" అన్నాడు.

"రాజాజ్ఞకు తిరుగేముంది! అలాగే బయలుదేరదాం." అన్నాడు జీవదత్తుడు.

ఒంటెల మీదా, గుర్రాల మీదా ఎక్కి సమరబాహు అనుచరులు కొందరు ముందూ, కొందరు వెనకా బయలుదేరారు. బందీలైన వీరపుర సైనికుల్ని మధ్యలో వుంచారు. రౌతుల్లేని కొన్ని ఒంటెలనూ, గుర్రాలనూ నడిపించుకుంటూ ఎలుగ్గొడ్డు ముఠా వాళ్ళు నడిచారు. అందరి కన్న ముందు సమరబాహూ, స్వర్ణాచారి, ఖడ్గ జీవదత్తులూ గుర్రాల వదిలిస్తూ ముందుకదిలారు.



అందరూ కొంతసేపటికి కొండకోటను చేరేసరికి, పర్వతం దిగువనున్న చెట్ల కింద ఒక చిన్న గుడారమూ, దానిముందు ఒక ఎత్తయిన ఆసనం మీద కూర్చుని వున్న ఒక వృద్ధుడూ, అతడి చుట్టూ చిన్న పరివారమూ ఖడ్గ జీవదత్తుల కంటబడింది.

''సమరబాహూ! ఇదేమిటి? స్వయంగా వీరపుర రాజే నీ తలపై కిరీటం పెట్టి, నిన్ను యీ ప్రాంతాలకు రాజుగా అభిషేకించటాని కిక్కడికి రాలేదు గదా?'' అన్నాడు జీవదత్తుడు ఆశ్చర్యపడుతూ.

సమరబాహు ఏదో జవాబు చెప్ప బోయేంతలో వృద్ధుడు ఆసనం దిగి ఇద్దరు సేవకులు వెంటరాగా, ఖడ్గ జీవదత్తుల కేసి ఎదురు రాసాగాడు. అది చూసి ఖడ్గ జీవదత్తులు గుర్రాలు దిగి అతడికి ఎదురు వెళ్ళారు.

వృద్ధుడు, వాళ్ళిద్దరి కేసి చేయెత్తి శాంతి సూచకంగా అటూ యిటూ ఊపి, ''నేను వీరపుర రాజుగారి మంత్రిని. మా చారులు వర్ణించిన దాంట్లో పొరబాటు లేకపోతే, మీరు మహాయోధులైన ఖడ్గ జీవదత్త నామధేయు లయివుంటారను కుంటాను.'' అన్నాడు.

ఖడ్గ జీవదత్తులు, ఆ వృద్ధుడికి నమస్కరించారు. జీవదత్తుడు, మంత్రితో, ''మహామంత్రి! చాలా కాలంగా అరణ్యాలు పట్టుకు తిరుగుతున్న మా ఇద్దర్నీ గురించీ చారుల ద్వారా మీరు శ్రమపడి చాలా సమాచారం సంగ్రహించి నట్టున్నది. అందుకు కారణం ఏమిటో మాకు అర్థంకావటం లేదు.'' అని, వెనక గుర్రం దిగివస్తున్న సమరబాహునూ, స్వర్ణాచారిని అతడికి చూపించి, ''వీరు కొండకోట రాజుగారు సమరబాహు. ఆయన వారి మహామంత్రి. స్వర్ణాచారిగారు.'' అన్నాడు.

రాజూ, మంత్రీ అన్నమాటలు వింటూనే వీరపుర మంత్రి ముఖం చిట్లించి, అంతలోనే చిరునవ్వు నవ్వుతూ,



"ఈ రాజుగారు, మా సేనానినీ, సైనికులనూ ఎంత నేర్పుగా ఓడించి బందీలను చేశారో, యింతకు ముందే చారుల ద్వారా తెలుసుకున్నాను. స్వశక్తితో జయించుకున్న యీ ప్రాంతాలను సమరబాహు రాజుగారు నిశ్చింతగా ఏలుకోవచ్చు. ఈ మాట మా మహారాజుగారి పరంగా నేను చెపుతున్నాను. కాని, నేను వచ్చింది మీ ఇద్దరి కోసం....ఏకాంతంగా మాట్లాడాలి." అన్నాడు.

జీవదత్తుడు, సమరబాహూ, స్వర్ణాచారితో, "వీరపుర మహామంత్రిగారి మాటలు విన్నారు గదా? ఇక యీ కొండకోట రాజ్యపాలన గురించిన విషయాల్లో శ్రద్ధ వహించండి. వీరపుర సేనానినీ, సైనికులనూ స్వేచ్ఛగా వదలటానికి మీ కెలాంటి అభ్యంతరమూ వుండదనుకుంటాను." అన్నాడు.

సమరబాహు, స్వర్ణాచారి కేసి చూస్తి తలవూపాడు. స్వర్ణాచారి, వీరపుర మంత్రితో, "మహామంత్రీ! మీ రాజుగారు మరొకసారి మా మీదికి సైనికులను దాడికి పంపరన్న హామీ ఏమున్నది?" అని అడిగాడు.

"అలాంటి దాడి జరగదని, వీరపుర, కొండకోట రాజులు మిత్రులని మా రాజుగారు మీతో చెప్పమన్నారు. మా రాజుగారు అడినమాట తప్పరన్న ఘనకీర్తి గలవారు!" అన్నాడు వీరపురమంత్రి.

ఆ జవాబు సమరబాహుకు సంతృప్తి పరిచింది. అతడి ఆజ్ఞ కాగానే వీరపుర సేనానీ, సైనికులూ కావలివాళ్ళ నుంచి విడిపించబడ్డారు. వాళ్ళు సంతోషంతో కోలాహలం చేస్తూ వచ్చి తమ మంత్రికి నమస్కారాలు చేశారు. వాళ్ళల్లో కొందరు సమరబాహుకూ, స్వర్ణాచారికీ కృతజ్ఞతలు చెప్పుకున్నారు.

తాను ఇంత తేలిగ్గా రాజైనందుకు తన్మయుడై పోతూ సమరబాహు, వీరపుర సైనికులతో, "ఇవాళ మీరందరూ నాకు అతిథులు. రేపు ఉదయాన్నే

బయలుదేరి మీ రాజధానీ నగరానికి వెళ్ళిపోవచ్చు." అన్నాడు.

ఆ తరవాత సమరబాహు అనుచరులూ, ఎలుగ్గొడ్డు ముఖావాళ్లూ, వీరపుర సైనికులూ అజన్మ మిత్రుల్లా కబుర్లు చెప్పుకుంటూ, ఎకసెక్కాలాడుతూ చెట్లకింద తిరగసాగారు. వీరపుర మంత్రి మాత్రం యిదేమీ పట్టించుకోకుండా, ఖడ్గ జీవదత్తులను వెంట బెట్టుకుని కొంచెం దూరంగా పోయి, "ఖడ్గ జీవదత్తుల్లారా, మిమ్మల్ని గురించిన సమాచారం మా చారుల నుంచి విన్నదానికన్నా, ఒకానొక యక్షుడి వల్ల గడచిన రాత్రి యింకా ఎంతగానో తెలుసుకున్నాము," అన్నాడు.

"యక్షుడా? ఎవరా యక్షుడు?" అంటూ జీవదత్తుడు ఎక్కడలేని ఆశ్చర్యం పొంది, ఖడ్గవర్మతో, "ఖడ్గా, మంత్రిగారు చెప్పే యీ యక్షుడు పద్మపురం రాజకుమార్తె పద్మావతిని అపహరించుకుపోయినవాడు కాదు గదా?" అన్నాడు.

ఖడ్గవర్మ కూడా ఆశ్చర్యంతో తల మునకలైపోతున్నాడు. వీరపుర మంత్రి వాళ్ళిద్దరికీ ఎలాంటి సమాధానం చెప్పకుండా ముందు నడుస్తూపోయి, ఎదురైన ఒక చిన్న గుట్ట మీద నిలబడి, దిగువనున్న నది కేసి చేయి చూపుతూ, "ఖడ్గ జీవదత్తుల్లారా! రథాకారంలో నదిలో కనిపించే ఆ పడవను పరిశీలనగా చూడండి!" అన్నాడు.

ఖడ్గ జీవదత్తులు, మంత్రి చెప్పిన పడవ కేసి చూశారు. అది తాము పద్మపురంలో విన్నదీ, అరణ్యపురంలో చూసిందీ అయిన రాతిరథం ఆకారంలో వున్నది. జీవదత్తుడు ఉత్సాహంగా తన చేతిలోని దండాన్ని పైకెత్తి పట్టుకుని, "ఇన్నాళ్ళకు ఆ దుర్మార్గుడైన యక్షుడు మనతో ముఖాముఖి పోరాటానికి సన్నద్ధుడై వచ్చాడన్నమాట! బావుంది. మన శక్తి ఎలాంటిదో వాడికి చూపెడదాం." అంటూ నది కేసి బయలుదేరాడు.

—(ఇంకా వుంది.)





# యక్షపర్వతం

## 23

[ఖడ్గ జీవదత్తులు యుక్తిగా వీరపుర సైనికుల్ని బిలదుర్గంలో చుట్టుముట్టి వాళ్ళు లొంగి పోయేలా చేశారు. సమరబాహుతో పాటు వాళ్ళు కొండకోట దగ్గిరకు వచ్చేసరికి, అక్కడ వీరపుర మంత్రి కనిపించాడు. అతడు సమరబాహును తన రాజు తరఫున కొండకోటకు రాజుగా అంగీకరించి, ఖడ్గ జీవదత్తులతో నది దగ్గిరకు పోయాడు. తరవాత—]

ఖడ్గ జీవదత్తులూ, వీరపుర మంత్రీ నది ఒడ్డుకు చేరే సరికి, రథాకారంలో వున్న పడవ నీటి మీద తేలియాడుతూ వారున్న చోటుకు రాసాగింది. ఖడ్గ జీవదత్తులు పడవ కేసి పరీక్షగా చూసి, అది రథాకృతిలో తయారు చేసిన కొయ్య పడవ అని గ్రహించారు.

జీవదత్తుడు, వీరపుర మంత్రి కేసి తల తిప్పి, ''మహామంత్రీ! ఒక యువతి వల్ల మా గురించిన సమాచారం తెలిసిం దన్నారు. ఆ యువతిని మీరీ పడవలోనే కలుసుకున్నారా?'' అని అడిగాడు.

వీరపుర మంత్రి ఒక క్షణకాలం ఏమి చెప్పటమా అని ఆలోచిస్తున్న వాడిలా తటాపటాయించి, ''క్షత్రియయోధుల్లారా, దాపరికం లేకుండా మీకు జరిగిన సంగతి చెప్పేస్తాను. గడచిన రాత్రి రెండవజాము వేళలో ఒక యువతి ఆకాశమార్గాన



రథంలో వచ్చి, భవనం మీద చెలికత్తెలతో కబుర్లాడు తున్న వీరపురరాజు పుత్రిక వసంతకుమారిని బలాత్కారంగా అపహరించుకు పోయాడు. అతడు భవనం మీద వదిలిపోయిన ఒక తాళపత్రంలో రాసివున్న దానిని బట్టి, వాడు లోగడ పద్మసేన మహారాజు కుమార్తె అయిన పద్మావతిని కూడా యీ విధంగానే అపహరించుకు పోయినట్టు తెలిసింది,'' అన్నాడు.

మంత్రి మాటలు వింటూనే జీవదత్తుడు కోపంతో ఊగిపోతూ, ''ఆ దుర్మార్గుడైన యక్షుడు పద్మావతిని వివాహమాడి తీసుకుపోతున్నట్టు మాతో అరణ్యపురం అనే ఒక ప్రదేశంలో అబద్ధం ఆడాడు. అయినా, మీ రాజకుమార్తె వసంతకుమారిని అపహరించుకుపోయినట్టే అపహరించుకు పోయాడన్న మాట!'' అన్నాడు.

వీరపుర మంత్రి అంతకంతకూ ఒడ్డుకు సమీపిస్తున్న పడవ కేసి ఓమారు చూసి, ''జీవదత్తా, ఆ పద్మావతి లాగే మా రాజు గారికి వసంత ఒక్కగా నొక్క కుమార్తె. యక్షుడు వదిలిపోయిన తాళపత్రంలో రాసివున్న దానిని బట్టి మీరు వింధ్య పర్వతాల్లో ఎక్కడో వున్న రాతిరథాన్ని క దాన్ని కదిలించ గలమని ప్రతిజ్ఞ చేశారట! అవునా?'' అన్నాడు.

ఖడ్గవర్మ కత్తిదూసి ఒడ్డు కేసి వస్తున్న పడవను చూస్తున్న వాడల్లా చప్పున తల తిప్పి, ''మహామంత్రీ, మీ ప్రశ్నకు ఒక్కటే జవాబు. మీరనే ఆ రాతిరథాన్ని కదిలించటం కాదు, దాన్ని తునాతునియలు చేసి, ఆ క్రూరుడైన యక్షుణ్ణి మా ఆయుధాలకు ఎరచేస్తాం. వాడికి బందీలుగా చిక్కిన పద్మావతి, వసంతలను విడిపించుకు రాకపోతే మేం క్షత్రియులమే కాదు,'' అన్నాడు.

హఠాత్తుగా జీవదత్తుడికి పడవను గురించిన అనుమానం ఒకటి వచ్చింది. ఈ పడవ యిక్కడ నదిలో వున్నదని

వీరపుర మంత్రికి ఎలా తెలిసింది? పడవలో వున్నవాడు రాజకుమార్తెలను అపహరించుకు పోయిన యక్షుడే అయి వుంటాడా? లేక యిందులో వీరపుర రాజు తమను తేలిగ్గా బంధించే ఎత్తు ఏదైనా వున్నదా?

జీవదత్తుడు యిలా ఆలోచించి, వీర పుర మంత్రితో, "మహామంత్రీ, నా దొక అనుమానం. ఈ రథాకారంలో వున్న పడవ యిక్కడ నదిలో వున్న దని మీ కెలా తెలిసింది?" అని అడిగాడు.

తను చెప్పే మాటల్లో ఖడ్గ జీవదత్తులకు నమ్మకం కలగటం లేదని గ్రహించిన వీరపుర మంత్రి దుస్తుల్లో నుంచి వెడల్పాటి ఒక తాళపత్రాన్ని తీసి, "జీవదత్తా, రాత్రి ఆ యక్షుడు రాజభవనం మీద వదిలిపోయిన యీ తాళపత్రంలో తతిమ్మా విషయాలతో పాటు, నదిలో యిక్కడ పడవ వుంటుందన్న సమాచారం కూడా వున్నది. ఇదుగో, చూడు." అంటూ పత్రాన్ని జీవదత్తుడి కిచ్చాడు.

జీవదత్తుడు తాళపత్రాన్ని సాంతం చదివి ఖడ్గవర్మకు యిచ్చి, "మహామంత్రీ, యిప్పుడు మీరు చెప్పిన సంగతుల గురించి నా కెలాంటి అనుమానమూ లేదు. పద్మపురంలో ఆ యక్షుడు వదిలి



పోయిన తాళపత్రంలోని వ్రాతకూ, దీనికీ చాలా దగ్గర పోలికలున్నాయి." అన్నాడు.

ఖడ్గవర్మ తాళపత్రంలోని విషయాన్ని ఒకటికి రెండుసార్లు చదివి మంత్రితో, "మహామంత్రీ, యీ పత్రాన్ని మా దగ్గిరే వుంచనిస్తారా? వింధ్య ప్రాంతాల వున్న యక్షపర్వతాన్ని చేరినప్పుడు, ఆ ధూర్త యక్షుణ్ణి పట్టుకునేందుకు యిది సాయపడవచ్చు." అన్నాడు.

వీరపుర మంత్రి అంగీకార సూచకంగా తలాడించి, నది కేసి చూసి, "అదుగో, పడవ ఒడ్డును చేరింది. ఆ పడవ నడిపేవాడు తన మిత్రుడని యక్షుడు రాశాడు.



గదా. వాడెలాంటి జిత్తులమారి అయి వుంటాడో చెప్పలేం. మీరు తగు జాగ్రత్తలో వుండండి. మా రాజకుమార్తెను బంధ విముక్తురాలిని చేసి తెచ్చినవారికి, రాజు గారు ఆమెనిచ్చి వివాహం చేసి అర్ధ రాజ్యం ఇస్తాడు," అన్నాడు.

ఆ మాటకు జీవదత్తుడు నవ్వి, "ఎంతో కాలం కిందట పద్మసేన మహారాజు కుమార్తె పద్మావతికి, కేవలం మేం మహా వీరులం అని రుజువు చేసేందుకే వింధ్య పర్వతాల్లో వున్న రాతిరథాన్ని కదిలిస్తాం అని చెప్పాం. రాజ్య లాభమూ, రాజ కుమార్తెలతో వివాహ ప్రసక్తి అదంతా ఆ దుష్టుడైన యక్షుడి సంహారం తరవాత గాని మేము ఆలోచించ దలచలేదు," అన్నాడు.

ఆ సరికి పడవ ఒడ్డు చేరింది. పడవ ముందు భాగానికి యక్షుడిలా భూషణా లంకారాలు ధరించిన వ్యక్తి ఒకడు వచ్చి, ఖడ్గ జీవదత్తుల కేసి చెయి చూపాడు. ఖడ్గ జీవదత్తులు, వీరపుర మంత్రితో కలిసి పడవను సమీపించారు.

యక్షుడు ఒక క్షణకాలం అందరినీ పరీక్షగా చూసి, "వింధ్యపర్వతాల్లో వున్న రాతి రథాన్ని కదిలించే మహావీరులు మీలో ఎవరు?" అని అడిగాడు.

ఖడ్గ జీవదత్తులు మౌనంగా చేతు లెత్తారు. యక్షుడు యీ సారి కొంచెం హేళనస్ఫురించే స్వరంతో, "అయితే, మీ ఇద్దరూ నిర్భయంగా, పడవలోకి రావచ్చు. నా మిత్రుడైన యక్షమంజి రంజితుడు వుండే యక్షపర్వతానికి మిమ్మల్ను తీసుకుపోతాను. అతడు వివాహమాడదలిచిన పద్మావతీ, వసంత కుమారీ అనే రాజకన్యలు అక్కడే వున్నారు," అన్నాడు.

ఖడ్గ జీవదత్తులు నీటి అంచు నుంచి ఎగిరి పడవలోకి దూకారు. జీవదత్తుడు, యక్షుణ్ణి, "నువ్వు, అసహాయులైన రాజ కుమార్తెలను రాత్రివేళ అపహరించుకు పోయే యక్షమంజిరంజితుడి మిత్రుడివా?"

అతడు పంపగా వచ్చావన్నమాట! నీ పేరేమిటి?" అని అడిగాడు.

"నా పేరు మణిభూషణుడు. నా మిత్రుడైన మణికంఠకుడిని గురించి మీకు ఏమీ తెలియనట్టున్నది. కార్యసాహసాల్లో అతడి కతడేసాటి. మంత్ర తంత్ర శక్తుల్లో అందెవేసిన చెయ్యి. మీరు అతడుండే యక్షిపర్వతాని కెళ్ళి, అనవసరంగా ప్రాణాపాయం ఎందుకు కొని తెచ్చుకుంటారు. వెనుదిరిగి మీ గృహాలకు పోయి సుఖంగా జీవించరాదా?" అన్నాడు మణిభూషణుడు.

మణిభూషణుడు మాట ముగించే లోపలే జీవదత్తుడు తన చేతిలోని దండాన్ని అతడి భుజానికి ఆనించాడు. యక్షుడు దండం తాకగానే పిడుగు దెబ్బ తిన్నవాడిలా ఎగిరి గంతేసి, నిలువెల్లా వణికిపోతూ, "ఏమిటది? మంత్ర దండమా? నీలో అంత గొప్ప మంత్ర శక్తులున్నవా?" అన్నాడు.

ఆ ప్రశ్నకు జీవదత్తుడు నవ్వి, దండాన్ని ఖడ్గవర్మ చేతికిచ్చి, చిన్నగా ఏదో జపించి, యీసారి యక్షుడి భుజాన్ని తన వేలితో తాకాడు. యక్షుడు ఒక్క దొప్పుకేక పెట్టి దబీమంటూ కిందపడి పోయి, కొద్ది సేపటి తర్వాత ఆయాస పడుతూ లేచి, "నువ్వు జీవదత్తుడివే



గదా? నీ మంత్ర శక్తి అమోఘం! నా స్నేహితుడికి సరి అయిన ఉజ్జీవి. మీ ఇద్దరికీ శత్రుత్వం ఎందుకు? ఎవరి ఆటంకం లేకుండా మీరనే ఆ రాతి రథాన్ని కదిలించే మార్గం నేను చెప్తాను. ఆ పని చేసి మీ దారిన మీరు పొండి. మీ ప్రతిజ్ఞ నెరవేరినట్టవుతుంది." అన్నాడు.

ఖడ్గవర్మ పళ్ళు కొరుకుతూ కత్తి పైకెత్తి, "ఒరే, యక్షుడా! ఊరికే బింకాలు పలకకుండా పడవను ఆ యక్షి పర్వతం కేసి నడుపు. నీ మిత్రుడు రాజకుమార్తె లిద్దరిని చెరనుంచి విడిపించి, క్షమాపణ కోరాడో సరి. లేకపోతే అతణ్ణి



ముక్కలుగా నరికి వింధ్యపర్వతాల్లోని కాకులకూ, గద్దలకూ ఆహారంగా వేస్తాం." అన్నారు.

ఇద్దరు మానవ మాత్రులు తనను యింతగా హడలగొట్టటం చూసి మణి భూషణుడు అవమానంతో, కోపంతో విల విల లాడిపోతూ, "క్షత్రియ యోధుల్లారా, మిమ్మల్ని మణిరంజితుడు తన వద్దకు తీసుకురమ్మన్నాడు. ఆ పని నెర వేర్చి, నా దారిన నేనుపోతాను. రాజ కుమార్తెల అపహరణా, రాతిరథం గొడ వల్తో నాకే ప్రమేయంలేదు." అన్నాడు.

"నీలోవున్న గర్వం, అహంలాటి వ్యాధులుపోయి, మామూలు మర్యాదలు పాటిస్తూ మాట్లాడినందుకు నాకు చాలా సంతోషంగా వుంది. ఇక చుక్కాని పట్టి పడవను నది మధ్యకు నడుపు." అని జీవదత్తుడు. ఒడ్డున వుండి యీ జరుగుతున్నదంతా ఆశ్చర్యంతో చూస్తున్న వీరపుర మంత్రితో, "మహామంత్రీ, ప్రస్తుతానికి సెలవు. వసంతకుమారిని బంధ విముక్తురాలిని చేసి తీసుకు వచ్చేందుకు నేనూ, ఖడ్గవర్మా ప్రతిజ్ఞ చేశామని మీ రాజు గారితో చెప్పండి. వీలయితే ఆమెను అపహరించుకుపోయిన యక్షమణిరంజితుడి తల కూడా నరికి తెస్తాము. రాజుగారు దాన్ని కోటగుమ్మంకు వేళ్ళాడదీయవచ్చు." అన్నాడు.

వీరపుర మంత్రికి ఆ సమయంలో ఖడ్గ జీవదత్తులు అన్నంత పని చేస్తారన్న నమ్మకం కలిగింది. పడవ ఒడ్డు నుంచి నీటిలోకి పోతూండగా అతడు చేయెత్తి వాళ్ళిద్దర్నీ దీవిస్తూ, "శీఘ్రమే కార్య సిద్ధికలుగుగాక!" అన్నాడు.

పడవ నీటివాలున వేగంగా పోసాగింది. ఖడ్గ జీవదత్తులు పడవలో అన్నిచోట్లా తిరిగి, అది యక్ష మణిరంజితుడు గాలిలో ఎగిరేందు కూడా ఉప యోగించేదేమో అన్న అనుమానం కలిగి, చుక్కాని దగ్గర వున్న మణి భూషణుణ్ణి ఆ సంగతి అడిగారు.



వాడికి యివ్వాళ ఖడ్గ జీవదత్తుల్ని చూస్తూంటే ప్రాణభయం కలుగుతున్నది. ఏదో సామాన్య మానవులు. శాస్త్ర శక్తి యుద్ధంలో ప్రవీణులైన క్షత్రియయువకు లిద్దర్ని బెదరగొట్టి తన పడవలో ఎక్కించుకుని యక్షపర్వతం దగ్గిరకు పోవచ్చును కుంటూ వాడు వచ్చాడు. కాని చూస్తూంటె యువకులిద్దరూ సాహసికులేకాక, మంత్ర తంత్ర శక్తులున్న వాళ్ళలా కూడా అతడికి కనిపించారు.

ఖడ్గ జీవదత్తు లడిగిన ప్రశ్నకు యక్షుడు ఒకటి రెండు క్షణాలు జవాబిచ్చేందుకు తటపటాయించి చివరకు, "ఖడ్గ జీవదత్తుల్లారా, మణిరంజితుడు ఆకాశ గమనానికి ఉపయోగించే రాతి రథం యిది కాదు. అతడికి రథాకారంలో వున్న వస్తువు లంటే తగని మక్కువ. అందుకనే అతడు నివశించే గృహం దగ్గిర నుంచి, వాహ్యాళికి నదిలో తిరిగే యీ పడవ వరకూ—అన్నీ రథాకృతిలో నిర్మించుకున్నాడు." అన్నాడు.

జీవదత్తుడు కోపంగా తలవూపి, "అలాగా, పాపం! వాడు మా చేత చిక్కిన తరవాత, రథాకృతిలో వున్న ఏ చెట్టుకొమ్మకో ఉరితీస్తాం. అలాంటి చెట్లు మీ యక్షపర్వతం మీద వున్నయ్యా?" అని అడిగాడు.

యక్షమణిభూషణుడు యీ ప్రశ్నకు జవాబివ్వకుండా తల పక్కకు తిప్పుకున్నాడు. ఖడ్గ జీవదత్తులు యక్షుణ్ణి వదిలి, నదికి రెండు వైపులా వున్న ఎత్తయిన మహాపర్వతాలనూ, వాటి మీద చిత్త ఒత్తుగా పెరిగివున్న వృక్షాలనూ చూడసాగారు. వాళ్ళ కిప్పుడు తాము వింధ్యపర్వత ప్రాంతాల గుండా ప్రవహిస్తున్న ఒక మహానదిలో ప్రయాణిస్తున్నామన్న అనుమానం కలిగింది. మణిభూషణుణ్ణి ప్రశ్నించగా, ఆ కనబడేవి వింధ్యపర్వతాలే అని చెప్పాడు.

"ఈ పర్వత ప్రాంతాల్లో నువ్వనే ఆ యక్షపర్వతం యింకెన్ని ఆమడల

దూరంలో వున్నది?" అని అడిగాడు జీవదత్తుడు.

"ఇంకొక పదిపన్నెండు ఆమడల దూరం వుంటుంది. సూర్యాస్తమయానికి మరెంతో కాలం లేదు. పడవను ఎక్కడైనా ఒడ్డుకు చేర్చి, భోజనాలు ముగించుకుని తిరిగి ప్రయాణం సాగించుదాం." అన్నాడు మణిభూషణుడు.

జీవదత్తుడికి అలా చేయటమే బావుంటుందనిపించింది. కాని, పడవలో తినేందుకు పళ్ళూ ఫలాలూ తప్ప మరేం లేవు. పడవను ఒడ్డుకు పట్టిస్తే, ఆ ప్రాంతాల ఆహారంగా ఉపయోగించే పశుపక్ష్యాదులకు కొరత వుండదన్న నమ్మకం కలిగింది అతడికి.

జీవదత్తుడు, ఖడ్గవర్మను సలహా అడిగాడు. అతడు అస్తమించబోతున్న సూర్యుడి కేసి, నది అంచున వున్న కొండల కేసి ఓ మారు చూసి, "మనం యీ రాత్రికి యీ నది ఒడ్డునే భోజనం ఏర్పాట్లు చేసుకుని, హాయిగా నిద్రపోయి, తిరిగి సూర్యోదయంతోనే ప్రయాణం సాగించటం బావుంటుంది." అన్నాడు.

జీవదత్తుడు, మణిభూషణుడితో, "విన్నావా, ఖడ్గవర్మ చెప్పింది? పడవను ఒడ్డు కేసి పోనీ," అన్నాడు.

మణిభూషణుడు కాస్త చిరాకు పడుతూ, "నా మిత్రుడైన మణిరంజితుడు మిమ్మల్ని సాధ్యమైనంత త్వరగా యక్షపర్వతాల దగ్గరకు తీసుకు రమ్మన్నాడు. ఈ రాత్రికి మనం యిక్కడ వుండిపోతే, చాలా కాలయాపన జరిగిపోతుంది." అన్నాడు.

జీవదత్తుడు కఠినమైన స్వరంతో, "ఇక్కడ ఆజ్ఞలు యిచ్చేది నేను. ఆ కన్యాపహరణంలో చేయి తిరిగిన నీ మిత్రుడు మణిరంజితుడు కాదు! చుక్కాని తిప్పి పడవను ఒడ్డుకు పోనియ్యి. విన్నావా?" అన్నాడు.

మణిభూషణుడు కిక్కురు మనకుండా పడవను నది మధ్య నుంచి, ఒడ్డు కేసి నడిపాడు. —(ఇంకా వుంది)






# యక్షపర్వతం

## 24

[వీరపుర రాజకుమార్తె వసంతకుమారిని యక్షుడి నుంచి కాపాడి తెస్తామని, వీరపుర మంత్రికి అభయం యిచ్చి, ఖడ్గ జీవదత్తులు యక్ష మణిభూషణుడు తెచ్చిన పడవ ఎక్కి బయలుదేరారు. సూర్యాస్తమయ సమయంలో వాళ్ళు నది పక్కన వున్న ఒక కొండ దరి చేరారు. జీవదత్తుడు ఆజ్ఞాపించగా మణిభూషణుడు పడవను ఒడ్డు కేసి నడిపాడు. తరవాత—]

పడవ ఒడ్డు చేరగానే ఖడ్గ జీవదత్తులు పడవలోంచి నేల మీదికి దూకారు. జీవదత్తుడు, మణిభూషణుడితో, "పడవను ఒడ్డునున్న ఏ రాయికైనా కట్టివెయ్యి. పడవలో వున్న పళ్ళూ ఫలాలూ కావాలంటే నువ్వే తిను. నేను. కీకారణ్యంగా వున్న యీ చుట్టు పక్కల ఏదైనా లేడి గాని, అడవిపందిగాని కనబడుతుందేమో చూసి వేటాడితెస్తాను." అన్నాడు.

యక్షమణిభూషణుడు ఆ మాటలకు భయపడిన వాడిలా ముఖం పెట్టి, "జీవదత్తా, యీ కొండల్లోకి పోకు. ఈ ప్రాంతం భయంకరులైన రాక్షసులకు ఆవాసం," అన్నాడు.

"రాక్షసుల కన్నా కూడా భయంకరులూ, మంత్ర తంత్ర వేత్తలూ అయిన మీ యక్షుల మధ్యకు పోనున్న నేను, ఈ రాక్షసుల కెందుకు భయపడాలి?"



అని జీవదత్తుడు ఖడ్గవర్మకు, "ఖడ్గా, నేను పావుగంట లోపలే తిరిగొస్తాను. నువ్వు చితుకులు పేర్చి నిప్పు రాజెయ్యి." అని చెప్పాడు.

జీవదత్తుడు అన్నట్టే ఒక్క పావు గంట గడిచీ గడవక ముందే లేడి నొక దాన్ని వేటాడి, భుజాన వేసుకుని పడవ దగ్గిరకు తిరిగొచ్చాడు. ఆ వరికి ఖడ్గ వర్మ ఎండు కట్టెలు పోగుచేసి మంట వేశాడు.

కిరాలమీద ఖడ్గ జీవదత్తులు లేడిని కోసి దాని మాంసాన్ని నిప్పుల మీద కాల్చ సాగారు. మాంసం కాలుతున్న వాసన ఆ చుట్టు పక్కల వ్యాపించింది.

ఆ సమయంలో భయంకరాకారంలో ఉన్న ఒక రాకసి చెట్లలో నుంచి చేతులు చాచి ముందుకొస్తూ, "నరవాసన! నరవాసన!" అంటూ అరిచింది.

రాకసిని చూస్తూనే ఖడ్గవర్మ లేచి నిలబడి కత్తిదూసి, దానికేసి వెళ్ళ బోయాడు. జీవదత్తుడు అతణ్ణి ఆపి, రాకసితో, "నువ్వు రాకసివేనా లేక రాకసి రూపం ధరించిన యువతివా? ఇక్కడ నరవాసనతో పాటు, బాగా పక్వమైన లేడి మాంసం వాసన కూడా వస్తున్నది గదా. ఆ వాసన నీ ముక్కు రంధ్రాలకు తగలటం లేదా ఏం?" అని అడిగాడు.

రాకసి ఆ మాటలకు ఆశ్చర్యపోతూ, "ఎవర్రా నువ్వు? మనిషివై వుండి నన్ను చూడగానే బెదిరి గుండెలవిసి చావక, నన్నే ఎదురు ప్రశ్నిస్తున్నావా?" అన్నది.

రాకసి యిలా అనగానే ఖడ్గవర్మ ఒక్క ఎగురున పోయి దాని జుట్టు పట్టుకున్నాడు. అతను దాన్ని కత్తితో పొడవ బోయేంతలో జీవదత్తుడు, అతడి చేయి పట్టుకుని, తన మంత్రదండాన్ని రాకసి తలకు ఆనిస్తూ, "రాకసీ! ఇప్పుడు చెప్పు. మేం మామూలు మనుషులమా లేక...." అంటూ ఆగాడు.

రాకసి నిలువెల్లా వణికిపోతూ, "మీరు మనుషులు కాదు, యక్షులై వుంటారు. నన్ను వదలండి. నా ఇద్దరు కొడుకుల్నీ మీరు లోగడే పట్టుకుని యక్షపర్వతానికి తీసుకు పోయారు గదా. నేను వయసు మళ్ళినదాన్ని; ఆ కొండ పొట్టలో రాళ్ళూ రప్పలూ కొట్టి, మీ కోసం బంగారం, మణులూ బయటికి తీయలేను," అన్నది.

ఆ జవాబు ఖడ్గ జీవదత్తుల్ని చాలా ఆశ్చర్యపరిచింది.

జీవదత్తుడు, ఖడ్గవర్మకు కత్తిని ఒరలో పెట్టమని చెప్పి, "రాకసీ, నిన్ను చంపటం మా ఉద్దేశం కాదు. నీ కొడుకు లిద్దర్నీ యక్షులు పట్టుకు పోయారంటున్నావే, ఆ మాట నిజమైతే వాళ్ళను కూడా కాపాడి తెస్తాను. అదుగో, అక్కడ కూర్చున్న వాడు యక్షుడే! కనక, వాళ్ళను గురించిన రహస్యాలు యిక్కడ చెప్పవద్దు. నీ నివాసం ఎక్కడ? అక్కడికి పోదాం పద," అన్నాడు.

ఈ సారి రాకసి, యక్షమణిభూషణుడి కేసి చూసి గుడ్లు తేలవేస్తూ, "అయ్యా, నరుడా! నన్ను దయవుంచి ఆ యక్షుడికి అప్ప చెప్పకు. నా దారిన నన్ను పోనీ," అన్నది.

జీవదత్తుడు, రాకసికి అభయం యిస్తూ, "నేనూ, నా మిత్రుడూ



యీ దుర్మార్గులైన యక్షులు నివసించే యక్షపర్వతానికి పోతున్నాం. వాళ్ళను గురించిన సమాచారం నీకు కొంత తెలిసి నట్టున్నది. నీ గుహకు పద, చెపుదువు గాని," అన్నాడు.

యక్షుణ్ణి చూసినప్పటి నుంచీ రాకసికి అక్కణ్ణించి ఎంత త్వరగా పారిపోదామా అని వున్నది. జీవదత్తుడు గుహ పేరు తేగానే అది, అతడికి నమస్కరిస్తూ, "అయ్యా, నరుడా! నువ్వు మా గుహ దగ్గరకుదా, దాపులనే వున్నది. నా భర్త అక్కడే వున్నాడు. అతను మీకు యక్ష పర్వతాన్ని గురించిన ఎన్నో భయంకర విషయాలు చెపుతాడు," అన్నది.



జీవదత్తుడు, రాక్షసితో సరే వెడమని చెప్పి, ఖడ్గవర్మతో, "ఖడ్గా, నేను తిరిగి వచ్చే వరకూ నీ కత్తికి, నా మంత్రదండం మహిమ వుంటుంది. మణిభూషణుడు పారిపోవాలని చూసినా లేక ఏదైనా హాని తలపెట్టినా, అతణ్ణి నిర్దాక్షిణ్యంగా వధించు," అన్నాడు.

ఆ మాటలకు మణిభూషణుడు వెల వెల పోయి, అంతలోనే లేని నవ్వును తెచ్చి పెట్టుకుని, "జీవదత్తా, నువ్వా దుర్మార్గురాలి మాటలు నమ్మకు. రాక్షసులు పరమక్రూరులు. అది నిన్ను గుహకు తీసుకుపోయి నిలువునా చీరుచు తిన్నా తినవచ్చు," అన్నాడు.

జీవదత్తుడు ఆ మాటలకు నవ్వి, "ఒక వేళ రాక్షసి దాని మొగుడూ కలిసి నన్ను చీరుచుకు తిన్నా, నీ స్నేహితుడైన మణి రంజితుణ్ణి హతంచేసి, రాతిరథాన్ని కదిలించి, రాజకుమార్తెలను బంధవిముక్తురాళ్ళను చేసేందుకు ఖడ్గవర్మ వున్నాడు. ఆ మాట మాత్రం మరిచిపోకు మణి భూషణా," అన్నాడు.

జీవదత్తుడు యిలా అనగానే మణి భూషణుడి ముఖం కోపంతో ఎర్రనైంది. కాని, అతడు నోరు మెదిపి జవాబివ్వటానికి భయపడి, తల వంచుకున్నాడు. ముందుండి రాక్షసి దారితీయగా, జీవదత్తుడు దాని వెనగ్గా గుబురు చెట్లలోకి పోయాడు.

రాక్షసి యింకా భయంతో కంపించి పోతూనే జీవదత్తుణ్ణి వెంటబెట్టుకుని నాలుగైదు నిమిషాల్లో ఒక గుహ దగ్గరకు తీసుకుపోయింది. గుహ ముందు మహా కాయుడైన రాక్షసుడొకడు పెద్ద కాగడా వెలిగించి, ఆ కాంతిలో ఒక బండరాయికి చేరగిలబడి కూర్చుని వున్నాడు. వాడు ముందువస్తున్న తన భార్యనూ, కొంచెం వెనగ్గా నడుస్తున్న జీవదత్తుణ్ణీ చూస్తూనే, "ఆశ్చర్యం! ఆశ్చర్యం! ఈ నరమానవుడెవడు, నిర్భయంగా నీ వెంట వస్తున్నాడు?" అన్నాడు.

రాక్షసి ముందుగా తన భర్తను సమీపించి, "నువ్వు ఆకలికొద్దీ ఈయన్ని నమిలి మింగాలని చూసేవు. జాగ్రత్త! ఈ మనిషి చేతిలో గొప్ప మంత్రదండం ఉన్నది. ఈయనా, యీయన నేస్తం కలిసి ఒక యక్షుణ్ణి బంధించి తెచ్చారు." అన్నది.

"యక్షుడంతటి వాణ్ణి బందీగా పట్టుకోవటమా?" అంటూ రాక్షసుడు, జీవదత్తుడి కేసి కళ్ళింతచేసి చూస్తూ, "అయ్యా, నా పెళ్ళాం చెప్పేమాట నిజమేనా? అది కొంచెం వెర్రిబాగులది." అన్నాడు.

జీవదత్తుడు చిన్నగా నవ్వి, "నీ పెళ్ళాం చెప్పిన దాంట్లో అబద్ధం ఏమీ లేదు. నా కొడుకు శిఖరిని యక్షులు బందీలుగా పట్టుకుపోయి, ఎక్కడో యక్షపర్వతంలో ఉంచారని విన్నాను. ఆ పర్వతాన్ని గురించిన రహస్యాలేమైనా ఉన్నవా?" అని అడిగాడు.

రాక్షసుడు తలాడిస్తూ కొంచెం సేపు నేల చూపులు చూసి, తరవాత తల ఎత్తి "అయ్యా, మీరేదో మంత్ర తంత్ర శక్తులు కలవాళ్ళే అయి ఉండాలి. లేకపోతే యింత ధైర్యంగా నా ముందుకు వచ్చి మాట్లాడలేరు. ఇక ఆ యక్షపర్వతం సంగతి. ఈ విశాలమైన వింధ్య పర్వత ప్రాంతాల్లో అది ఒక చిన్న పర్వతం.



ఆ పర్వత పరిసరాలకు మణిరంజితుడనే వాడు అధిపతి. వాణ్ణి యక్షరాజు చాలకాలం కిందట ఆ యక్షపర్వతానికి అధిపతిగా నియమించాడు. ఆ నాటినుంచి ఆ మణిరంజితుడు చేయని ఘోరం అంటూ ఏమీ లేదు." అన్నాడు.

జీవదత్తుడు, రాక్షసుడి కేసి సానుభూతిగా తలాడించి, "ఆ మణిరంజితుడు పరమ కిరాతకుడని నాకు తెలుసు. మా దేశంలోవున్న ఇద్దరు రాజకుమార్తెలను చెరపట్టి తెచ్చాడు. నాక్కావలసిన సమాచారం: వాడు నీబోటి రాక్షసులనూ వాళ్ళనూ పట్టుకుపోయి ఏం చేస్తూ వుంటాడని!" అన్నాడు.



"ఆ యక్షపర్వతం లోపల మణి మాణిక్యాలూ, బంగారం వున్నదట! వాటిని తవ్వి బయటికి తీయించేందుకు ఆ మణిరంజితుడు తాను బందీలుగా పట్టుకున్న వాళ్ళను బానిసలుగా ఉప యోగిస్తూంటాడు. ఆ బానిసల్లో రాక్షసులే కాక, వాడిచేతబడిన కొందరు గంధర్వులు కూడా వున్నారని నేను విన్నాను. అలాంటి వాళ్ళందరూ రాత్రిం బవళ్ళు, తాము పనిచేస్తున్న ఆ చీకటి కొండకడుపుల్లో కాలం వెళ్ళబుచ్చవలసిందే." అన్నాడు రాక్షసుడు.

"అంటే, ఆ బానిసలు కొండ గర్భంలో నుంచి బయటికి వచ్చి పారి పోకుండా యీ మణిరంజితుడు తగిన కావలా ఏదో పెట్టివుంటాడన్న మాట. సరే, అక్కడ ఏదైనా రాతిరథం లాటిది వున్నదా?" అని అడిగాడు జీవదత్తుడు.

"అయ్యా, ఉన్నది. ఆ రథాన్ని కొండలోనే మలిచినట్టు చెప్పుకుంటారు. కాని, నేనైతే దాన్ని చూడలేదు," అన్నాడు రాక్షసుడు.

జీవదత్తుడికి ఇక రాక్షసుడి నుంచి అడిగి తెలుసుకోవలసిన సమాచారం ఏమీ వున్నట్టు కనిపించలేదు. రాక్షసుడు ఆ నోటా యీ నోటా యక్షపర్వతాన్ని గురించి విన్నదేదో చెప్పటం తప్ప, అతడు ఆ పర్వతాన్ని చూసి వుండలేదని అతడికి తోచింది.

జీవదత్తుడు అక్కణ్ణుంచి ఖడ్గవర్మ, యక్ష మణిభూషణుడూ వున్నచోటుకు బయలుదేరుతూ, రాక్షసితో, "నువ్వు నరవాసన అంటూ వచ్చి నా కంటబడటం కొంత మేలే అయింది. నా వెంట వచ్చి కాల్చిన లేడిమాంసంలో నీ క్కావలసినంత ఎత్తుకుపో." అన్నాడు.

రాక్షసి ఆ మాటలకు సంతోషించినదానిలా కనిపించి, రాక్షసుడితో మెల్లిగా ఏదో చెప్పింది. వాడు జీవదత్తుడితో, "అయ్యా, మీరు మహా శక్తివంతులన్న నమ్మకం నాక్కలిగింది. ఒక వేళ

దుర్మార్గుడైన ఆ మణిరంజితుణ్ణి మీరు గెలిచే పక్షంలో, వాడికి బానిసలుగా వున్న నా ఇద్దరు కొడుకులకూ స్వేచ్ఛ యిప్పించండి.'' అన్నాడు.

జీవదత్తుడు నడుస్తున్న వాడల్లా ఆగి, వెనక్కు తిరిగి, ''రాకసుడా, నీ పేరేమిటో నాకు తెలియదు.... ఆ మణిరంజితుణ్ణుంచి నీ కొడుకులకే గాదు, మరి చాలా మందికి స్వేచ్ఛ కలిగించ బోతున్నాను. దిగులు పడకు,'' అన్నాడు.

''అయ్యా, నా పేరు చండముఖుడు. మరిచిపోకండి.'' అన్నాడు రాకసుడు.

కొద్దిసేపటి తరవాత జీవదత్తుడి వెంట రాకసి రావటం చూస్తూనే మణిభూషణుడు నిలువెల్లా కణికిపోతూ, ఖడ్గవర్మతో, ''ఇదేమిటి? నీ మిత్రుడు రాకసిని మళ్ళీ వెంటబెట్టుకు వస్తున్నాడు?'' అన్నాడు.

''బహుశా, నిన్ను దానికి ఆహారంగా యిస్తానన్నాడేమో, జీవదత్తుడు. అడిగి చూద్దాం,'' అన్నాడు ఖడ్గవర్మ.

''ఇది అన్యాయం. నేను లోగడే చెప్పాను లేదే! మణిరంజితుడు నా మిత్రుడు కాడు, యజమాని. అతడి ఆజ్ఞలు నిర్వహించటం తప్ప, నాకై నేను ఇతరులకు చేసిన హాని ఏమీ లేదు,'' అన్నాడు మణిభూషణుడు.



ఆ మాటలు వింటూనే జీవదత్తుడు కోపంగా, ''మణిభూషణా, ఇప్పటి నుంచే చావు భయంతో ఉన్న మతి కాస్తా పోగొట్టుకోకు. ఈ రాకసి భర్తవల్ల యక్ష పర్వతం మీద మీవాళ్ళ రహస్యాలన్నీ తెలుసుకున్నాను. ఒకవేళ నేనూ, ఖడ్గవర్మా నీ యజమాని మణిరంజితుణ్ణి జయించలేక పోవచ్చు. కాని అలా జరిగితే మాత్రం మీ యక్షులందర్నీ పట్టుకుని చిత్రహింసలకు గురిచేయటానికి యీ దాపులనే అపరరావణాసురుడి వంటి వాడి నాయకత్వాన పెద్ద రాకససేన సిద్ధంగా వుంది. వాళ్ళు మీ పర్వతాన్ని నేలమట్టం చేస్తారు,'' అన్నాడు.

"రాక్షససేనా?" అంటూ మణి భూషణుడు తెల్లబోయాడు.

"అవును, రాక్షససేనే! ఆ మాట బాగా గుర్తుంచుకో," అని జీవదత్తుడు, రాక్షసితో, "లేడిమాంసంలో నీక్కావలసినంత ఎత్తుకుపో. యక్షపర్వతం మీద వాడికి యింకా సమయం రాలేదని, మీ నాయకుడితో చెప్పు," అన్నాడు.

రాక్షసి అర్థ దీర్ఘంగా తలాడించి లేడి మాంసం తీసుకుని తిరిగి తన గుహకేసి వెళ్ళిపోయింది. ఆ తరవాత ఖడ్గ జీవదత్తులూ, మణిభూషణుడూ భోజనాలు ముగించి, ఒక చెట్టు కింద, చదునుగా వున్న రాళ్ళమీద పడుకున్నారు. మణి భూషణుడు, ఖడ్గ జీవదత్తుల నుంచి కొంచెం దూరంగా పక్క వేసుకున్నాడు. అతడు పడుకునే ముందు నది ఒడ్డున కట్టి వేసివున్న పడవ కేసి ఒకటికి రెండు సార్లు చూడటం గమనించిన జీవదత్తుడు, ఖడ్గవర్మను రహస్యంగా, "ఈ యక్షవైభవ మనమంటే హడలిపోతున్నాడు. ఏ రాత్రి వేళనో పడవనెక్కి పారిపోతాడేమో, కాస్త మెలకువగా వుండి చూస్తూవుండు." అని హెచ్చరించాడు.

ఖడ్గవర్మకూ్కడా, మణిభూషణుణ్ణి గురించి యిలాంటి అనుమానమే వున్నది! ఆ కారణంచేత అతడు నిద్రపోతున్నట్టు నటిస్తూ, యక్షుణ్ణి ఒక కంట కనిపెడు తూనే వున్నాడు. నడిరేయివేళ నేలను మూచూస్తూ అక్కడికి ఒక ఎలుగు బంటూ, తోడేలూ వచ్చినై. అవి లేడి మాంసం వాసన పసికట్టి వుండాలి! ఆ రెండూ గిరికీలు తిరుగుతూ మణి భూషణుడి దగ్గిరకు రాబోయేంతలో ఖడ్గవర్మ లేచికూర్చుని, వాటి మీదికి ఒక చిన్నరాయి విసిరాడు. ఆ వెంటనే ఎలుగు బంటూ, తోడేలూ చెట్లగుబురు కేసి పరిగెత్తినై. కాని, యీ అలికిడికి మణిభూష ణుడు మేలుక్కొని, చుట్టూకలయచూస్తూ, "ఖడ్గ జీవదత్తుల్లారా! లేవండి, రాక్షసులు వచ్చి పడుతున్నారు!" అంటూ అరిచాడు.

—(ముగింపు వచ్చే సంచికలో.)





# యక్షపర్వతం

## 25

[ఖడ్గజీవదత్తులూ, మణిభూషణుడూ విడిది చేసిన చోటుకు రాత్రివేళ ఒక రాక్షసి వచ్చింది. దాని భర్త ద్వారా జీవదత్తుడు యక్షపర్వతాన్ని గురించిన కొన్ని రహస్యాలు తెలుసుకున్నాడు. నడిరేయి వేళ మణిభూషణుడు ఏదో అలికిడి విని, నిద్ర మేల్కొని, రాక్షసులు వచ్చి మీద పడుతున్నారని అరవసాగాడు. తరవాత—]

మణిభూషణుడి అరుపులు వింటూనే జీవదత్తుడు నిద్రలేచాడు. ఖడ్గవర్మ మణిభూషణుడికి ధైర్యం చెబుతూ, "మణిభూషణా, నీ కొచ్చిన భయం ఏమీ లేదు. ఆ వచ్చిన ఇద్దరు రాక్షసులకూ నువ్వు యక్షమణిరంజితుడివి కావనీ, అతడి సేవకుడివైన మణిభూషణుడి వనీ చెప్పాను. వాళ్ళు నా మాటనమ్మి వెళ్ళిపోయారు." అన్నాడు.

ఆ తరవాత మణిభూషణుడికి నిద్ర పట్టలేదు. తెల్లవార్లూ అతడు మేలుకునే వున్నాడు. సూర్యోదయం అవుతూనే ఖడ్గజీవదత్తులు లేచారు. అందరూ కాలకృత్యాలు ముగించి, తిరిగి పడవ దగ్గిరకు పోయారు. మణిభూషణుడు పడవను తీరానికి దగ్గిరగా నడపసాగాడు.

ఒక అరగంట కాలం గడిచిన తరవాత పడవ తీరం పక్కగా ఒక చోట



ఆగింది. అక్కడ నది కొండ పక్కన ఒక మలుపు తిరగటంతో చిన్న రేవు ఏర్పడింది. మణిభూషణుడు పడవను అందులోకి పోనిచ్చి, ఒడ్డుకు దిగుతూ, "ఇదే యక్షపర్వతం! ఇక మీరు దిగవచ్చు. అరెరె, నా యజమాని మణిరంజితుడు, మనలను కలుసుకునేందుకు యిక్కడికి స్వయంగా వచ్చాడు." అన్నాడు.

ఖడ్గ జీవదత్తులు పడవలోంచి ఒడ్డుకు దిగి, కొండకేసి తలలెత్తి చూశారు. అక్కడ వున్న ఎగుడు దిగుడు రాళ్ళల్లో ఒక దానిమీద యువకుడైన యక్షుడొకడు నిలబడి వున్నాడు. అతడి చేతిలో చిన్న గద వున్నది. అతడు కన్నార్పకుండా ఖడ్గ జీవదత్తుల కేసి చూస్తున్నాడు.

ముందు మణిభూషణుడు దారి తీయగా ఖడ్గ జీవదత్తులు ఆ యక్షుణ్ణి సమీపించారు. అతడు ఖడ్గ జీవదత్తుల కేసి తీవ్రదృష్టితో చూస్తూ, "ఖడ్గ జీవదత్తుల్లారా! మీ దుస్సాహసం నన్ను ఆశ్చర్యచకితుణ్ణి చేస్తున్నది. బుద్ధిః కర్మానుసారిణీ, అన్నారు పెద్దలు. పాపం, మిమ్మల్ని అని ఏం లాభం." అన్నాడు.

జీవదత్తుడు, మణిరంజితుణ్ణి ఆ పాదమస్తకం ఒకసారి పరీక్షగా చూసి, చిరునవ్వు నవ్వుతూ, "మణిరంజితా! రాజకుమారి పద్మావతికి, యిక్కడున్న రాతిరథాన్ని కదిలించిన వాడు మహావీరుడన్న అభిప్రాయం కలిగించి, ఆ పనిమీద యిక్కడికి వచ్చేవారిని హతం చేయాలని నువ్వు మంచి పథకమే వేశావు. అదే నీ అంతానికి ఇప్పుడు ఉరితాడు కాబోతున్నది. ఏది, నువ్వు చెరబట్టి తెచ్చిన పద్మావతీ, వసంతకుమారీ రాజకన్యలు? ఆ రాతిరథం ఎక్కడ?" అన్నాడు.

ఆ మాటలకు మణిరంజితుడు ఉగ్రుడైపోయి చేతనున్న గద ఎత్తబోయేంతలో, ఖడ్గవర్మ కత్తిపిడి మీద

చేయివేసి, "మణిరంజితా, ఆ రాతి రథాన్ని మేం కదిలించ లేనప్పుడు నువ్వు మా యిద్దర్నీ చంపే ప్రయత్నం చేయవచ్చు. అప్పుడు వసంతకుమారి మాట ఏమోగాని, పద్మావతి మాత్రం నిన్ను మహావీరుడుగా భావించి తప్పక వివాహం ఆడుతుంది. కనక, ముందు ఆ రాతిరథం ఎక్కడున్నదో చూపించు," అన్నాడు.

మణిరంజితుడు కోపంగా ఏదో అనబోయేంతలో మణిభూషణుడు అతడితో, "తొందరపడకు, మణిరంజితా! ఈ యువకులను ముందు ఆ రాతిరథం దగ్గిరకు తీసుకుపో," అన్నాడు.

మణిరంజితుడు కాస్త స్థిమితపడి బయలుదేరాడు. కొద్దిసేపటికల్లా వాళ్ళు కొండ మీద సమతలంగా వున్న ఒక ప్రదేశాన్ని చేరారు. దానికి దిగువ ప్రదేశమంతా ఫలవృక్షాలతో, పూలతోటలతో ఎంతో రమణీయంగా వున్నది. ఆ తోటల మధ్య ఒక దానికొకటి కొంచెం ఎడంగా రథాకృతిలో వున్న రెండు భవనాలు వున్నవి. అందులో ఒక దాని మీద ఇద్దరు యువతులు నిలబడి ఖడ్గ జీవదత్తుల కేసి చూస్తున్నారు.

జీవదత్తుడు, ఆ యువతుల కేసి ఓమారు చూసి, "మణిరంజితా, వారేనా



నువ్వు తెచ్చిన రాజకుమార్తెలు పద్మావతి, వసంతకుమారి?" అని ప్రశ్నించాడు.

"అవును, మీ శౌర్యపరాక్రమాలు కళ్ళారా చూసేందుకు వాళ్ళక్కడ నిలబడి వున్నారు." అంటూ మణిరంజితుడు తల పక్కకు తిప్పి, "ఇదుగో, ఈ కనబడేదే రాతిరథం!" అన్నాడు పళ్ళు కొరుకుతూ.

అక్కడకు దాపులనే దాదాపు ఇరవై అడుగుల ఎత్తున్న ఒక రాతిరథం వున్నది. ఆ రథం వున్న చోటు నుంచి దిగువకు కొండ ఏటవాలుగా పరుచుకు పోయింది. ఖడ్గ జీవదత్తులు ఆ రథం కేసి బయలుదేరగానే మణిరంజితుడు,



"మణిభూషణా!" అంటూ పక్కకు తిరిగిచూశాడు. కాని మణిభూషణుడు ఆ చుట్టుపక్కల ఎక్కడా లేడు.

తన మిత్రుడు యిలా చెప్పాచెయ్యకుండా వెళ్ళిపోయినందుకు ఆశ్చర్యపడుతూ మణిరంజితుడు రాతిరథం దగ్గిరకు వెళ్ళాడు. ఆ సరికి ఖడ్గ జీవదత్తులు రథం చుట్టూ ఓ మారు తిరిగి చూశారు. జీవదత్తుడు వంగి రథం అడుగు భాగాన్ని ఖడ్గవర్మకు చూపుతూ, "ఖడ్గా, ఈ రథం కొండలో మలిచినది కాదు. వేరుగా యిక్కడ పడివున్న రాతిని రథంగా చెక్కారు. దిగువ నుంచి సన్నని వెలుగూ, మనుషులు మాట్లాడు కుంటున్నట్టుగా, అస్పష్టమైన ధ్వనులూ వినిపిస్తున్నవి," అన్నాడు.

జీవదత్తుడు యిలా అనగానే మణిరంజితుడు కత్తిదెబ్బ తిన్న వాడిలా ఎగిరి గంతేసి, "రథం అడుగు నుంచి వెలుగూ, మాటలూ నీకు వినబడుతున్నవా? అసంభవం! అసంభవం!" అన్నాడు.

"అసంభవం ఎలా అవుతుంది? కొండ లోపల వున్న మణి మాణిక్యాలనూ, బంగారాన్నీ తవ్వి బయటికి తీసే నీ బానిసలందరూ మూగవాళ్ళు కాదు గదా? ఏమంటావు?" అన్నాడు జీవదత్తుడు కోపంగా.

మణిరంజితుడు ఒక్క క్షణకాలం నిశ్చేష్టుడై, "ఈ సంగతి నీ కెవరు చెప్పారు? ఆ దుష్టుడు మణిభూషణుడా?" అన్నాడు రౌద్రంగా.

"పాపం, ఆ మణిభూషణుణ్ణి నిందించకు. అతను నీకు సేవకుడో, మిత్రుడో కూడా మాకు అర్థంకాని పద్ధతిలో నిన్ను గురించి మాట్లాడాడు. నేను నా దివ్య దృష్టితో ఈ యక్షపర్వతానికి సంబంధించిన రహస్యాలన్నీ తెలుసుకున్నాను," అన్నాడు జీవదత్తుడు నవ్వుతూ.

మణిరంజితుడు కోపంతో ముక్కుపుటాలు అదురుతూండగా, "జీవదత్తా,

యీ ప్రగల్భాలకేంగాని, రాతిరథాన్ని కదిలించగలవేమో ప్రయత్నించి చూడు. నీ శక్తి సామర్థ్యాలను కళ్ళారా చూసేందుకు పద్మావతి ఆ భవనం మీద నిలబడి వున్నది." అన్నాడు.

జీవదత్తుడు, ఖడ్గవర్మకు కనుసైగ చేసి, దాపుల కొండదిగువున రథాకృతిలో వున్న భవనాల కేసి చేయిచూపుతూ, "రాజకుమార్తెలు నిలిచివున్న భవనం పక్కనున్న ఆ అందమైన భవనం నీ నివాసగృహమే కదా, మణిరంజితా?" అని అడిగాడు.

"అవును. ఈ ప్రశ్న అడగవలసిన అవసరం నీకెందుకు కలిగింది?" అన్నాడు మణిరంజితుడు.

"ఆ భవనం యిప్పుడు తునాతునియలై నేలమట్టం కాబోతున్నది. ఇదుగో, చూడు!" అంటూ జీవదత్తుడు మంత్రం జపించి, దండాన్ని రాతిరథానికి గట్టిగా ఆనించి, కాలితో ఒక్క తన్ను తన్నాడు.

ఆ వెంటనే భూమి బద్దలవుతున్నంత భయంకరమైన శబ్దంతో రాతిరథం కదిలి, ఏటవాలుగా వున్న కొండ దిగువకు బాణవేగంతో పోయి, మణిరంజితుడి భవనాన్ని ఢీకొట్టింది. భవనం, దానితో పాటు రాతిరథం ఫెళఫెళా రావాలతో ముక్కలు చెక్కలయినై. విరిగిన కొన్ని భవన భాగాలూ, రాతిరథం ముక్కలూ అంత ఎత్తున పైకెగిరి, దాపులనున్న ఉద్యానవనంలో చెల్లా చెదురుగా పడినై.





కనుమూసి తెరిచేంతలో జరిగిపోయిన యీ భయంకర సంఘటన చూసి మణిరంజితుడు నిలువెల్లా కంపించిపోయాడు. అయినా, అతడు ఒక్క క్షణకాలంలో తెప్పరిల్లి చేతనున్న గదను జీవదత్తుణ్ణి కొట్టేందుకు పైకెత్తాడు. కాని, అంతలో ఖడ్గవర్మ కత్తిదూసి అతణ్ణి ఎదుర్కున్నాడు.

జీవదత్తుడు సంతోషం పట్టలేక ఒక్కసారి పెద్దగా నవ్వి, తనకు గంధర్వ వసుమతి యిచ్చిన కంచుఢక్కను చేతికి తీసుకుని గట్టిగా మోగించాడు. ఆ మరుక్షణం, రాతిరథం కదిలిపోగా దిగువ ఏర్పడిన బిలంలో నుంచి కొందరు రాక్షసులూ, గంధర్వులూ బిల బిలమంటూ కొండపైకి వచ్చి, గోల గోలగా అరవసాగారు.

జీవదత్తుడు వాళ్ళనందరినీ నిశ్శబ్దంగా వుండమని చెప్పి, "మీరందరూ యీ క్షణం నుంచి స్వేచ్ఛా జీవులు. ఎవరి ఇళ్ళకు వాళ్ళు వెళ్ళిపోండి," అని కంచుఢక్కను పైకెత్తి పట్టుకుని, "ఈ కంచు ఢక్కను మా దేశ ప్రాంతాల ప్రవాసంలో వున్న వసుమతి అనే గంధర్వుడు నాకిచ్చాడు. మీలో గంధర్వులెవరైనా వుంటే దీన్ని నిరభ్యంతరంగా తీసుకుపోవచ్చు." అన్నాడు.

గంధర్వుల్లో ఒకడు ముందుకొచ్చి, జీవదత్తుడిచ్చిన కంచు ఢక్కను తీసుకుని కళ్ళ కద్దుకున్నాడు. జీవదత్తుడు విముక్తులైన రాక్షసులకూ, గంధర్వులకూ ఏదో చెప్పబోయేంతలో, "అబ్బా!" అన్న మణిరంజితుడి చావుకేక వినిపించింది. జీవదత్తుడు తలతిప్పి చూశాడు. ఖడ్గవర్మ, మణిరంజితుణ్ణి గాయపరిచి, అతడు నేల మీద పడిపోగా, అతడి గుండెల మీద కాలుపెట్టి, కత్తిని అతడి కంఠానికి గురిచేసి నిలబడి వున్నాడు.

ఆ దృశ్యం చూసి జీవదత్తుడికి కలిగిన ఆనందం అంతా యింతా కాదు. ఖడ్గవర్మ, జీవదత్తుడితో, "జీవా, ఈ దుర్మార్గుడైన మణిరంజితుణ్ణి చంపటమా, వదల

టమా? వీడు రాజకుమార్తెలను అపహరించి తెచ్చి, వాళ్ళకేకాక, వాళ్ళ తల్లిదండ్రులకున్నూ మానసిక క్లేశ కలిగించాడు." అన్నాడు.

ఆ సమయంలో అక్కడికి రాజకుమార్తెలు పద్మావతీ, వసంతకుమారి వచ్చారు. వసంతకుమారి కళ్ళెర్రచేసి కిందపడివున్న మణిరంజితుడి కేసి చూస్తూ, "ఈ నీచుడైన యక్షుణ్ణి చంపిన వీరుణ్ణే వివాహం ఆడతానని నేను ప్రతిజ్ఞ చేశాను. వీడి మరణం నేను కళ్ళారా చూడకపోతే, ఇక నేను జీవితకాలమంతా బ్రహ్మచారిణిగా వుండవలసిందే!" అన్నది.

ఖడ్గవర్మ, వసంతకుమారి కేసి చూసి, ఆమె అద్భుత సౌందర్యానికి ముగ్ధుడై పోయాడు. ఆమెను భార్యగా పొందాలంటే మణిరంజితుణ్ణి తాను చంపి తీరాలి! ఈ ఆలోచన రాగానే అతడు కత్తిని మణిరంజితుడి కంఠంలో గుచ్చేందుకు పైకెత్తాడు. అంతలో ఆకాశం నుంచి, "ఆగండి!" అన్న భీకరస్వరం వినిపించింది. అందరూ తలలు పైకెత్తి చూశారు.

హంసాకృతిలో వున్న విమానం ఒకటి వాళ్ళ ముందుకు వచ్చి, నేల దిగింది. అందులో నుంచి యక్షరాజూ, మణి



భూషణుడూ బయిటికి వచ్చారు. యక్షరాజు అక్కడ వున్న అందరి కేసీ ఓమారు చూసి, "ఖడ్గజీవదత్తుల్లారా! మీరు మహావీరులు. సందేహం లేదు. జరిగిన సంగతులన్నీ మణిభూషణుడి ద్వారా విన్నాను. యక్షవంశంలో చెడబుట్టిన యీ మణిరంజితుణ్ణి ప్రాణాలతో వదలండి. వాడు యీ నాటి నుంచీ బతికి వుండి కూడా, జీవచ్ఛవం!" అన్నాడు.

ఖడ్గవర్మ ఏమి చేయటమా అని సందేహిస్తున్నంతలో జీవదత్తుడు, "ఖడ్గా, యక్షరాజు చెప్పింది విన్నావు కదా? మణిరంజితుణ్ణి క్షమించి వదిలెయ్యి." అన్నాడు.

"వీరపుర రాజకుమార్తె వసంతకుమారి ప్రతిజ్ఞ మాటేమిటి?'' అన్నాడు ఖడ్గవర్మ, ఆమె కేసి నిశితంగా చూస్తూ.

వసంతకుమారి ఎక్కడలేని సిగ్గుతో తల వంచుకుని, పద్మావతి చాటుకు పోవాలని చూసింది.

యక్షరాజు చిరునవ్వు నవ్వి, "మణిరంజితుడు బతికుండి వచ్చినవాడి కిందే లెక్క అని ఇంతకుముందే చెప్పాను గదా? అందువల్ల వసంతకుమారిని ప్రతిజ్ఞాభంగ దోషం అంటదు. ఇప్పుడు నేనే స్వయంగా రాతిరథం కదిలించిన మహావీరుడైన జీవదత్తుడితో పద్మావతికీ, ఖడ్గవర్మతో వసంతకుమారికీ వివాహం చేయబోతున్నాను! పుష్పమాలలెక్కడ?'' అన్నాడు.

మణిభూషణుడు విమానంలో నుంచి నాలుగు పుష్పమాలలు తెచ్చి ఖడ్గ జీవదత్తులకూ, పద్మావతీ వసంతలకూ తలా ఒకటి ఇచ్చాడు. పద్మావతీ, జీవదత్తులు ఒకరి మెడలో ఒకరు పూలమాలలు వేశారు. ఖడ్గవర్మా, వసంతకుమారి కూడా అలాగే వేశారు. చుట్టూ వున్నవాళ్ళ హర్షధ్వానాలతో ఆ ప్రదేశం మార్మోగిపోయింది.

యక్షరాజు, ఖడ్గ జీవదత్తుల్నీ, వాళ్ళ భార్యలతో పాటు విమానంలో ఎక్కమని చెప్పి, వాళ్ళు విమానంలో ఎక్కి కూర్చోగానే, "ఖడ్గ జీవదత్తుల్లారా! మీ ఇచ్ఛామాత్రంతో ఈ విమానం మీరు కోరిన ప్రదేశానికి వాయువేగంతో ప్రయాణిస్తుంది. ఈ నాటి నుంచి నెలరోజులపాటు దీన్ని మీరు యథేచ్ఛగా ఉపయోగించుకోవచ్చు. ఆ తరవాత నా విమానం నా దగ్గిరకు తిరిగి వస్తుంది! శుభం, వెళ్ళిరండి!'' అన్నాడు.

"మీ దయకు ఎంతో కృతజ్ఞులం, యక్షరాజా!'' అని ఖడ్గ జీవదత్తులూ, పద్మావతీ వసంతలూ యక్షరాజుకు నమస్కరించారు. విమానం రివ్వుమంటూ పైకి లేచి పద్మ వీరపురాల కేసి బయలుదేరింది. —(అయిపోయింది.)

